

## జరుపుల రమేష్

| | |
|---|---|
| జన్మించిన తేది | 16.08.1984 |
| జన్మించిన ఊరు | భీమలబావి తండ, విస్నూర్, పాలకుర్తి, వరంగల్ జిల్లా |
| తల్లిదండ్రులు | సోమ్లి, బాల్యా నాయక్ |
| చదువు | బి.ఏ (లిట్), ప్రథమ శ్రేణి (2005) |
| | కాకతీయ యూనివర్సిటీ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, హన్మకొండ, వరంగల్ |
| | (బి.ఏ., లో ఆర్ట్స్ & సైన్స్ కళాశాల ఫస్ట్) |
| | ఎం.ఏ (తెలుగు), ప్రథమ శ్రేణి (2007) } హైదరాబాదు విశ్వవిద్యాలయం |
| | ఎం.ఫిల్., విశేషయోగ్యతతో ప్రథమ శ్రేణి (2008) } హైదరాబాదు విశ్వవిద్యాలయం |
| | అడవిలో వెన్నెల (గిరిజన పోరాట కథలు) సమగ్ర పరిశీలన } హైదరాబాదు విశ్వవిద్యాలయం |
| ప్రస్తుతం | పిహెచ్.డి., తెలుగు నవల-గిరిజన జీవిత చిత్రణ } హైదరాబాదు విశ్వవిద్యాలయం |
| సాధించినవి | రాత పరీక్ష ద్వారా యు.జి.సి. వారి నెట్ & రీసెర్చ్ ఫెలోషిప్ సాధించడం. |
| | యు.జి.సి. వారి రాజీవ్ గాంధీ నేషనల్ ఫెలోషిప్ పొందడం. |
| ఇతర అంశాలు | వివిధ పత్రికల్లో వ్యాసాలు ప్రచురితం. |
| | వివిధ విశ్వవిద్యాలయాల్లో జరిగిన జాతీయ సదస్సుల్లో ఐదు పత్రాలు సమర్పితం. |
| | కార్యదర్శి, తెలుగు సాహిత్య వేదిక, హైదరాబాదు. |

ISBN 978-81-908961-1-5



COVER DESIGN : KIRAN KUMAR, kiran@societyandeducation.org

# అడవిలో వెన్నెల

## (గిరిజన పోరాట కథలు)

సమగ్ర పరిశీలన



జరుపుల రమేష్

# అడవిలో వెన్నెల

(గిరిజన పోరాట కథలు)

సమగ్ర పరిశీలన

**జరుపుల రమేష్**

హైదరాబాద్ విశ్వవిద్యాలయం
ఎం.ఫిల్. పట్టం పొందిన సిద్ధాంత వ్యాసం

ప్రచురణ

**విశాల సాహిత్య అకాడమీ**

హైదరాబాద్ - 500 013

2011

**ADAVILO VENNELA** (Girijana Porata Kathalu)
**SAMAGRA PARISHEELANA**
M.Phil. Dissertation - 2008
University of Hyderabad

by **Jarupula Ramesh**


First Edition : 2011
ISBN 978-81-908961-1-5

Cover Design : P.V.V.S.Kiran Kumar
DTP : AVM Graphics, Hyderabad. 9440096321
Printed at : Karshak Art Printers, Hyderabad, 040-27653348

*for copies :*
**Jarupula Ramesh,** Research Scholar,
MH-E, NRS Hostel, Room No.L102
University of Hyderabad - 500 046.
✆ : 09618944654
e.mail : ramesh.jarupula@gmail.com

and Vishalandhra Publishing House branches

Publishers & Distributors:
**Vishala Sahitya Acadamy**
403, Sai Laxmi Residency, 2-2-647/90,
Central Excise Colony, Hyderabad - 500 013
✆ : 09391036987

**Rs. 70 /-**

పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
వారి ఆర్థిక సహాయంతో ముద్రించబడినది

## విషయ సూచిక

# కృతజ్ఞతలు

జీవితంలో ఎలా వుండాలో నేర్పి, నాలో తమ ఆశలను చూసుకోవాలని తపించి, ఆ ఆశలు నెరవేరక ముందే లోకాన్ని వదలి వెళ్ళిపోయిన నాన్న హర్యానాయక్ గారికి...

అక్షరం అంటే ఏమిటో తెలియకపోయినా, ఎన్ని ఆర్థిక ఇబ్బందులు ఎదురైనా, వాటిని అధిగమించి నన్ను ప్రాథమిక విద్య నుండి విశ్వవిద్యాలయ స్థాయి వరకు ఎంతో శ్రద్ధతో చదివిస్తూ వస్తున్న మా అమ్మ సోమ్లీకి...

పరిశోధనకు అవకాశం కల్పించిన తెలుగు శాఖ, హైదరాబాద్ విశ్వ విద్యాలయం వారికీ...

ఎన్ని పనుల ఒత్తిడిలో ఉన్నా సాదరాభిమానంతో విషయ నిర్ణయంలోను, విషయ వివరణలోను, సామాగ్రి సేకరణలోను అడుగడుగునా అండగా నిల్చి నా ఆలోచనలకు ఒక రూపాన్నిచ్చిన పర్యవేక్షకులు ఆచార్య తుమ్మల రామకృష్ణ గారికి...

నేను పి.హెచ్.డి.లో చేరడానికి ప్రోత్సాహం అందించిన తెలుగుశాఖాధ్యక్షులు ఆచార్య బేతవోలు రామబ్రహ్మం గారికి...

నా పరిశోధనకు సంబంధించిన అనేక విషయాలతో పాటు, జీవితానికి సంబంధించి, సామాజిక, సాహిత్య రంగాలకు సంబంధించిన దృక్పథాలను తెలియజెప్పి, విశ్లేషించి తన దగ్గర వున్న ఎన్నో పుస్తకాలిచ్చి వెన్నుతట్టి ప్రోత్సహించడంతో పాటు, ఈ పరిశోధన ఇలా పుస్తక రూపంలో రావడానికి కారకులైన సామాజిక తత్వవేత్త, ప్రముఖ రచయిత బి.ఎస్.రాములు గారికి...

తెలంగాణా సాహిత్యం గురించి తమ అనుభవాలను తెలిపిన తెలంగాణ సీనియర్ కథకులు గూడూరి సీతారాం గారికి... అల్లం రాజయ్య గారికి...

నా అభివృద్ధిని కాంక్షిస్తూ నన్ను ప్రోత్సహించే ఆచార్య అరుణ కుమారి గారికి, దార్ల వెంకటేశ్వరరావుగారికి... అధ్యాపకుల బృందానికి... డిగ్రీ చదువుతున్నప్పుడు సాహిత్యంపై ఎంతో ఆసక్తి కలిగించిన కాకతీయ యూనివర్సిటీ ప్రొఫెసర్ బన్న అయిలయ్య గారికి... పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం గిరిజన పీఠం, వరంగల్ ఆచార్యులుగా వున్నప్పటి నుండి నన్ను వెన్ను తట్టి ప్రోత్సహిస్తున్న ఆచార్య భట్టు రమేష్ గారికి...

నా పరిశోధనకు తమ విలువైన సలహాలు అందించిన డా. గోనా నాయక్, డా. సూర్య ధనుంజయ్, డా॥ అప్పారావు, డా॥ తిరుపతి నాయక్, జ్యోతి అక్కయ్య గారలకు....

ప్రేమాభిమానాలకు మారు పేరైన మా అన్న వదిన తిరుపతి, విమలగారలకు... అనునిత్యం నా అభివృద్ధిని కాంక్షించే అక్కా బావలు రవి, విజయ్ గారలకు... నేనంటే ఎంతో ఇష్టపడే మా చిన్నారులకు, నా అభివృద్ధిని కాంక్షించే బంధు వర్గానికి...

నన్ను ఆదరాభిమానాలతో కన్న కొడుకులా చూసుకుంటున్న మాతృమూర్తులు మంజుశ్రీ, సత్తెమ్మ, బేతి శ్యామల, గీతమ్మ గారలకు...

స్నేహానికి నిలువెత్తు సాక్ష్యం... నా ఆత్మీయ మిత్రుడు అన్నందాసు దుర్గయ్య, అనునిత్యం నా ఉన్నతిని కోరుకునే చిన్నీకి...

నాకు జూనియర్ రీసెర్చ్ ఫెలోషిప్ (జెఆర్ఎఫ్)తో ఆర్థిక సహాయం అందించిన యుజిసి వారికి...

గ్రంథ ప్రచురణకు కొంత ఆర్థిక సహాయం అందించిన పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారికి...

ఇందిరాగాంధీ మెమోరియల్ గ్రంథాలయం, హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం వారికి, నగర కేంద్ర గ్రంథాలయం వారికి...

కవర్ పేజి చక్కగా రూపొందించిన కిరణ్ అన్నకు... అందంగా డిటిపి చేసిన ఏవిఎమ్ గ్రాఫిక్స్ విజయకుమార్ గారికి... టిఎస్ఎఫ్ మిత్రులకు... నాకు ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించిన వారందరికీ... హృదయ పూర్వక కృతజ్ఞతలు.

– జరుపుల రమేష్



**ఆచార్య తుమ్మల రామకృష్ణ**
ఎం.ఏ., ఎం.ఫిల్. పి.హెచ్.డి.



ప్రొఫెసర్, తెలుగు శాఖ
హైదరాబాద్ విశ్వవిద్యాలయం
హైదరాబాద్ - 46

# కొత్త దారి...

జరుపుల రమేష్ నా విద్యార్థి. హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయ తెలుగు శాఖలో ఎం.ఏ. ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడైన తర్వాత ఎం.ఫిల్ పరిశోధన నా పర్యవేక్షణలో కొనసాగించాడు. తన పిహెచ్.డి.కి సంబంధించిన పరిశోధన కొనసాగిస్తున్నాడు. రమేష్ తన ఎం.ఫిల్. పరిశోధనకు ఎన్నుకున్న అంశం 'అడవిలో వెన్నెల' అనే కథల సంకలనం. ఈ సంకలనం 1985లో వెలువడింది. ఇందులోని కథలు ప్రధానంగా గిరిజన జీవితానికి సంబంధించినవి. ప్రత్యేకించి ఆదిలాబాద్ ప్రాంతంలోని గోండుల జీవితానికి సంబంధించినవి. రమేష్ తన పరిశోధనకి ఈ కథల్ని ఎన్నుకోవడం వెనుక తను తన మూలాల్లోని పొరలని చూడాలనుకున్నాడు.

రమేష్ గిరిజన కుటుంబాల్లో పుట్టి పెరిగి, అనేక అననుకూల పరిస్థితులను ఎదుర్కొని జీవితాన్ని ఒక ఛాలెంజ్‌గా తీసుకొని హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయ స్థాయికి ఎదిగొచ్చిన మొదటి తరం గిరిజన కుటుంబాలకి చెందిన విద్యార్థి. తల్లిదండ్రులకు చదువులేదు. తోడబుట్టిన వాళ్ళ చదువులు కూడా అంతంత మాత్రమే. ఆర్థికంగా ఎప్పుడూ పెనుగులాటే. ఆశయాలు మాత్రం ఉన్నతం.

నిచ్చెనమెట్ల సమాజంలో ప్రధాన జీవన స్రవంతికి ఎంతో దూరంగా ఉన్న గిరిజన కుటుంబాల్లోంచి ఎదిగి, హైదరాబాద్ విశ్వవిద్యాలయంలో అడుగు పెట్టడం అంతసులువేమీ కాదు. ఒక క్రమశిక్షణ, పట్టుదల, ఆశయం లేకుంటే ఈ స్థాయికి రావడం ఎంతో కష్టం.

పరిశోధనలో కూడా నలిగిన బాటలో నడవకుండా ఎవరూ స్పృశించని అంశాలని ఎంచుకొని విశ్లేషణలోనూ కొత్తదారి వేయడంలో సఫలీకృతుడు కావడం రమేష్‌లోని పట్టుదలకు ఒక దృష్టాంతం. కొత్తదారులు వేసేటప్పుడు ఎన్నో కష్టాలు ఎదురవుతాయి. కొన్ని తప్పులు దొర్లుతుంటాయి. అవన్నీ జ్ఞానార్జనలో భాగాలే.

ఎం.ఫిల్ పరిశోధన చాలా పరిమితుల మధ్య కొనసాగుతుంది. ప్రధానంగా పరిమితమైనటువంటి కాలానికి లోబడి ఉంటుంది. సమగ్ర విషయ సేకరణ, సిద్ధాంత విభజన, విశ్లేషణ, సామాజిక దృష్టి అధ్యయన ఫలితాలు ఇలా ఎన్నింటినో దృష్టిలో ఉంచుకోవలసి వుంటుంది.

రమేష్ తాను ఎన్నుకున్న ఈ పరిశోధనను కాల పరిమితుల్ని దృష్టిలో ఉంచుకొని ఎంతో శ్రద్ధతో, పట్టుదలతో, ఆర్తితో రూపొందించాడని చెప్పడానికి నాకు ఎలాంటి సందేహము లేదు. రమేష్ ప్రయాణంలో ఇదొక మజిలీ. ఇంకా ఎంతో ఎత్తుకు ఎదగాల్సి ఉంది. ఎదగగలడని నా నమ్మకం. తన పరిశోధనని ఇలా సమాజం ముందుకు తెస్తున్నందుకు ఎంతో ఆనందిస్తున్నాను. మరెంతగానో అభినందిస్తున్నాను.



**ఆచార్య భట్టు రమేష్**
రిజిస్ట్రార్



పొట్టిశ్రీరాములు
తెలుగు విశ్వవిద్యాలయం
పబ్లిక్ గార్డెన్స్, హైదరాబాద్

# అభినందనలు

తెలుగు లేదా ఇతర ప్రాంతీయ భాషా సాహిత్యాలలో గిరిజన సాహిత్యం, కళలు వంటి విషయాలపై సమాచారం అంతంత మాత్రమనే చెప్పవచ్చు. ఇటీవలి కాలంలో గిరిజనుల బహుముఖీన అంశాలపైన, సాహిత్యంపైన మంచి అధ్యయనాలు వస్తున్నాయి. విషయ సేకరణలో గిరిజన సమాజాలతో పరిచయమున్న సాహితీవేత్తలు, అదే విధంగా గిరిజన సమాజాల నుండి వచ్చిన పరిశోధకులు సమాజానికి గిరిజన సాహిత్య విషయాలు అందిస్తున్నారు.

తెలుగులో గిరిజన సాహిత్యం వామపక్ష ఉద్యమం ద్వారా వెలుగులోకి వచ్చినవే ఎక్కువ. ఈ ఉద్యమంలో పాల్గొన్న వారు ఎక్కువగా గిరిజనులతోను, గిరిజన ప్రాంతాలతోను సంబంధాలు ఏర్పడటం వలన వారి జీవన విధానాన్ని ప్రత్యక్షంగా చూడటం వలన గిరిజన సాహిత్య, సాంస్కృతిక విషయాలను రిపోర్టుల రూపంలో రావడం వలన గిరిజన సాహిత్యం జనబాహుళ్యంలోకి వచ్చింది. ముఖ్యంగా ఈ సాహిత్యాన్ని పరిశీలిస్తే గిరిజనుల అటవీ సంపద, దళారీల వ్యవస్థ, ప్రకృతి విషయాలు, తిరుగుబాట్లు వంటి విషయాలపై సాహిత్యాన్ని చెప్పడం జరిగింది.

'అడవిలో వెన్నెల (గిరిజన పోరాట కథలు) సమగ్ర పరిశీలన' అనే అంశంపై పరిశోధన చేసిన జరుపుల రమేష్ అభినందనీయుడు. తను గిరిజన సమాజం నుండి వచ్చినానని, నాకు అభిరుచి కలిగిన అంశం గిరిజన సాహిత్యమని ముందే ప్రకటించుకొని తన సమాజ విషయాలు క్షుణ్ణంగా అధ్యయనం చేయడం గ్రంథ రూపంలో తేవడం వలన భవిష్యత్ పరిశోధనలకు ఈ గ్రంథం ఒక దిక్సూచిలా పనికి వస్తుంది.

భవిష్యత్తులో జరుపుల రమేష్ ద్వారా గిరిజనులపై మంచి సాహిత్య విశ్లేషణలు రావాలని కోరుతూ అభినందిస్తున్నాను.

ఆచార్య బన్న అయిలయ్య
ఎంఏ, పి.హెచ్.డి.



తెలుగు విభాగము
కాకతీయ విశ్వవిద్యాలయం,
విద్యారణ్యపురి, వరంగల్,
సెల్ నెం.9949106968

# అమాయకమైన గోండు కథ

## అర్థవంతమైన పరిశోధన

తెలుగులో కథలు విస్తారంగానే వచ్చాయి. మధ్య తరగతి జీవితాన్ని, ఉద్యమ నేపథ్యంలో వచ్చిన కథలు, మానవ జీవితంలోని సంక్లిష్టమైన సమస్యల్ని వస్తువుగా చేసుకుని కథలు వెలువడ్డాయి. ఈ మారుతున్న కాలంలో ఇతర ప్రక్రియల కంటే కథా ప్రక్రియే ముందుందని విమర్శకులు తేల్చారు కూడా. దాదాపు నూటపది సంవత్సరాల తెలుగు కథ అనూహ్యమైన కథా వస్తువుతో విలసిల్లడం ముదావహం. అయితే ప్రజాస్వామ్య వ్యవస్థలో అన్ని వర్గాల జీవితాలని సాహిత్యంలోకి అందునా, కథా సాహిత్యంలోకి రచయితలు తీసుకు వచ్చారా అనే సందేహం కూడా కలగక మానదు. నాగరిక ప్రపంచానికి దూరంగా ఉంటూ ఎటువంటి ఆడంబరాలకు తావివ్వకుండా పటాటోప జీవితానికి దూరంగా ఉంటూ ప్రకృతితో మమేకమై జీవిస్తున్న గిరిజనుల జీవితాలని స్వీకరిస్తూ సాహిత్యం అతి తక్కువగా వెలువడిందని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఇదే విషయాన్ని కథలకు మినహాయింపు లేకుండా వర్తిస్తుంది కూడా. చింతా దీక్షితులు మొట్టమొదట గిరిజన జీవితాలను కథలుగా రాశాడు. ఆ తర్వాత చుక్క తెగపడ్డట్టు అక్కడో కథ, ఇక్కడో కథ వస్తోంది. ఇందుకు కారణం గిరిజనులు విద్యావంతులు కాకపోవడం ఒకటైతే గిరిజనుల జీవితాల్ని కథా వస్తువులుగా స్వీకరించాలనే స్పృహ గిరిజనేతర రచయితలకు తక్కువగా ఉండడమే కారణం. ఫణికుమార్, ఐఏఎస్, ఏ.విద్యాసాగర్ ఐఏఎస్ లాంటి ఉన్నతోద్యోగులు, మన్నెం ప్రజల జీవితాలని ఇతివృత్తాలుగా చేసుకొని కథల్ని వెలువరించారు. వామపక్ష భావజాల ఉద్యమంలో పని చేసిన రచయితలు ఉద్యమంలో భాగంగా గిరిజన కథలు రాశారు.

గిరిజనుడుగా పుట్టి, గిరిజన సంస్కృతితో మమేకమై తన చుట్టూ వున్న సంస్కృతిని అవ్యాజంగా ప్రేమించి తన జాతికి రవ్వంత మేలు చేకూర్చాలనే ఉత్తమ భావనతో జరుపుల రమేష్ 'అడవిలో వెన్నెల' గిరిజన పోరాట కథల సంపుటిపై ఎం.ఫిల్ పరిశోధన చేయడం గర్వించ దగింది. రమేష్ లంబాడ గిరిజనుడు. ఆయనకి గోండుల జీవితం సంపూర్ణం తెలియకపోయినా ఆదివాసీలు నాగరిక ప్రపంచం చేత ఎంతగా అవమానింప బడతారో అనుభవం ద్వారా తెలుసుకున్న



వ్యక్తి. అందుకే ఈ కథలపై సమగ్ర విశ్లేషణ చేశాడు.

మొదటి అధ్యాయంలో గిరిజనుల నిర్వచనం, వారి పుట్టుపూర్వోత్తరాలని చారిత్రక నేపథ్యాన్ని సంస్కృతిని చక్కగా వివరించాడు. అందుకే ఈ మొదటి అధ్యాయంలోని గోండుల సంస్కృతి, ఆ సంస్కృతిలోని విభిన్న పార్శ్వాలని కూలంకషంగా వివరించి అడవిలో వెన్నెల కథల్లో ఉన్న భిన్న గిరిజన తెగల జీవితాలని తెలిపాడు.

మన దేశంలోనే కాకుండా ప్రపంచ వ్యాప్తంగా గిరిజనులున్నారని, వారి సంస్కృతి అంత చిన్న చిన్న భేదాలతో కనిపించినా వారంతా గిరిజనులే అని రమేష్ నిర్ధారిస్తున్నాడు. గోండు జాతి వారు ఒక ప్రత్యేకమైన పద్ధతుల్లో ఆచారాలను అనుసరిస్తున్నారు. ఈ ఆచారాలు అనూచానంగా ఒక తరం నుండి మరో తరానికి ప్రవహిస్తూ వస్తున్నాయని హేతుపూర్వకంగా తెలిపాడు. రోజురోజుకు సమాజం మారుతుంది. మారుతున్న సమాజాన్ని దృష్టిలో ఉంచుకొని కొంతమంది కొన్ని ఆచారాలను విడిచి పెట్టినా, అడవుల్లో వుండే గోండులు మాత్రం విడవడం లేదని రమేష్ నిర్ధారించాడు. అడవిలో వెన్నెల కథల్లో మారని గోండుల జీవితాలని ఎలా చిత్రించారో సమన్వయం చేసి చూపాడు.

సంస్కృతిని వీడి మానవుడు లేడు. ఒక్కొక్క జాతికి ఒక్కొక్క రకమైన సంస్కృతి వుంది. గోండుల సంస్కృతిని రమేష్ వివరించాడు. శిశువు పుట్టింది మొదలు మనిషి మరణించే వరకు సంస్కృతి ప్రాధాన్యత ఎలా ఉంటుందో గోండుల సంస్కృతిని వివరించే క్రమంలో తెలిపాడు. గోండుల సంస్కృతి ప్రత్యేకమైనదని వీరిచ్చిన ఆధారాలను బట్టి తెలుస్తోంది. పునర్జన్మ భావన గోండు జాతిలో కూడా వుందని రమేష్ ధ్వనిపూర్వకంగా తెలిపాడు. వ్యక్తి మరణించాక ఖననం చేస్తారు. కర్మకాండకు అయిదు రోజుల తర్వాత మరణించిన ఆ వ్యక్తి ఏ జీవిగా పునర్జన్మమెత్తాడో తెలుసుకోవడం గోండుల సంస్కృతిలో భాగం. ప్రపంచ వ్యాప్తంగా దేవునిపై విశ్వాసం ఉన్నట్లే గిరిజనులకు పెద్ద దేవుని పట్ల విశ్వాసం ఉన్నట్లు రమేష్ తెలిపాడు. గోండుల సంస్కృతిని వెలుగులోకి తీసుకురావాలనే తపన రమేష్‌లో కనిపిస్తుంది. ఇంకా అక్కడక్కడ కథల్లో భాగంగా ఈ సంస్కృతి ఎట్లా వుందో రమేష్ ఎత్తి చూపాడు.

'అడవిలో వెన్నెల' కథల వస్తు పరిశీలన చేస్తూ ఒక్కొక్క కథను సోదాహరణంగా వివరించాడు. దీనివల్ల పాఠకుడు అడవిలో వెన్నెల కథలన్నింటిని చదివిన తృప్తి కలుగుతుంది. ఈ రెండవ అధ్యాయంలో కథల విశ్లేషణ చేస్తూ ఈ సంకలనంలోని కథల్ని మూడు రకాలుగా వర్గీకరించాడు. ఇది సహేతుకమైన వర్గీకరణే. ప్రకృతితో పోరాటం, సంప్రదాయాలతో పోరాటం, గిరిజనేతర వ్యవస్థలతో పోరాటం అంటూ వర్గీకరించాడు. గిరిజనులు ప్రకృతి తల్లి ఒడిలో పెరిగే అమాయకమైన శిశువుల్లాంటి వారు. ప్రకృతి కరుణిస్తే వారు ఎక్కువ కాలం జీవిస్తారు. వికటిస్తే అర్ధాంతరంగా

జీవితాన్ని ముగిస్తారు. ఆకు పసరు తాగడం వల్ల రోగం నయం కావచ్చు. ఒక్కొక్కప్పుడు ప్రాణం పోవచ్చు. పాముకాటు వల్ల గిరిజనులెందరో చనిపోతున్నారు. అట్లాగే తాగునీరు తెచ్చుకోవడానికి మైళ్ల కొద్ది అడవిలో నడిచి వెళ్తూ క్రూరమృగాల బారిన పడి ప్రాణమే కోల్పోయిన గిరిజనులున్నారు. ఆ మృగాలతో పోరాడి బతికిన గిరిజన స్త్రీలు వున్నారు. ఇలాంటి ఉదంతాలు ఉన్న కథల్ని ప్రకృతితో పోరాటమనే విభాగంలో రమేష్ చూపించాడు.

రెండవ విభాగంలో సంప్రదాయాలతో పోరాటం. నమ్మకమే ఆచారంగా, ఆచారమే సంప్రదాయంగా స్థిరపడుతుంది ఒక్కొక్కసారి. సంప్రదాయం అభివృద్ధికి ఆటంకంగా నిలవడం చూస్తాం. గోండుల సంప్రదాయంలో ఫ్లెక్సిబులిటీ ఉండదు. కనుక తమకెంత నష్టం వాటిల్లినా వాటిని తు.చ. తప్పకుండా పాటిస్తారు. చదువుకుంటే అనర్థమని, చదువుకోకపోవడం, ప్రకృతి బీభత్సాలకి భయపడి కోళ్లను, గొర్లను బలి ఇవ్వడం, శాస్త్రీయ వైద్యాన్ని అంగీకరించకపోవడం, మగపెళ్లివారు, ఆడపెళ్లివారికి 'ఓలి' ఇవ్వడం గోండుల సంప్రదాయం. ఇందుకోసం వారి జీవనాధారమైన పశువుల్ని సైతం అమ్మి ఇవ్వడం కనిపిస్తుంది. ఇలాంటి సంప్రదాయాలు గిరిజనుల అభివృద్ధికి ఆటంకంగా ఉన్నాయని ఈ కథా సంకలనం ఆధారంగా రమేష్ శాస్త్రీయ విశ్లేషణ చేశాడు.

మూడవది గిరిజనేతర వ్యవస్థలతో పోరాటం. గిరిజనులకు ఒక ప్రత్యేక జీవన వ్యవస్థ ఉందని, అదే నాగరిక ప్రపంచం నుండి గిరిజనులను వేరు చేసి, వారి అస్తిత్వాన్ని గుర్తించే ప్రత్యేక వ్యవస్థను రమేష్ నిర్ధారించాడు.

గిరిజన సంస్కృతి ఆ ప్రత్యేక వ్యవస్థలో ఒక భాగం మాత్రమే. కనుక గిరిజన సంస్కృతినే గిరిజన వ్యవస్థగా చెప్పలేం. గిరిజనులు నాగరిక సమాజం అనుసరించే చట్టాలకంటే, న్యాయం కంటే ఒక ప్రత్యేక వ్యవస్థను కల్గి ఉంటుంది. ఆ వ్యవస్థ తమ జీవన విధానానికి అత్యంత సమీపంలో వుంటుంది. అత్యంత ఆచరణ యోగ్యంగా వుంటుంది. అంతేకాదు వారి దృష్టిలో సరళంగా వుంటుంది. ఆ వ్యవస్థకు అలవాటు పడిన గిరిజనుడు, గిరిజనేతర వ్యవస్థలతో సంఘర్షణ పడక తప్పడం లేదు అని రమేష్ నిర్ధారించింది నూటికి నూరుపాలు నిజం. నాగరిక వ్యవస్థలోని కొన్ని పద్ధతులు గిరిజన వ్యవస్థలో నేరం. నిరంతరం వనంలో వుండే గిరిజనులు ఈ పనులు చేయకూడదంటే వారి మనుగడే కష్టం. ఈ పనులు చేస్తే చట్ట ప్రకారం శిక్షకు గురవుతారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేసిన చట్టాలు గిరిజనుల జీవన వ్యవస్థను దృష్టిలో ఉంచుకొని చేసినవి కావు. గిరిజనేతరులైన నాగరికులు చేసిన ఈ చట్టాలు గిరిజనుల పాలిట యమపాశాలేనని ఈ కథల్లో వున్నట్లు రమేష్ సరిగ్గానే గుర్తించాడు.

మూడవ అధ్యాయంలో ఈ కథల్లో శిల్పం గురించి రమేష్ చర్చించాడు.



ఒక్కొక్క కథని సోదాహరణంగా తీసుకుంటూ పరిశీలించాడు. శిల్పపరంగా బాగుంటేనే మంచి కథ అవుతుందని ఇంతకాలం ప్రచారం చేయడం వల్ల అసలైన జీవితాలని చిత్రించాల్సిన వాళ్లెందరో రచయితలు కాకుండా పోయారు. చదువు వచ్చిన ప్రతి ఒక్కరూ కథా రచయిత కావచ్చు. తమ చుట్టూ వున్న బీభత్స జీవితాల్ని కథలుగా రాయవచ్చు. వస్తువు, శిల్పం సమంగా ఉంటేనే మంచి కథ అవుతుందనే భీతి వల్ల ఎందరో విద్యావంతులు తమ చుట్టూ వున్న విషాద జీవితాన్ని కథలుగా మలచలేకపోయారు. అస్తిత్వవాద ఉద్యమాల మూలంగా ఇలాంటి ఆలోచనలకు స్వస్తి పలికి తమ జీవితాలను, తాము చూసిన జీవితాలను చిత్రిస్తే గొప్ప సాహిత్యం అవుతుంది అని మరాఠీ దళిత సాహిత్యం నిరూపించింది. తెలుగులోనూ దళిత, బహుజన, స్త్రీవాద, మైనార్టీ సాహిత్యంతో ఎందరో రచయితలు కలం పట్టి జీవిత వాస్తవికతలను కథలుగా మలుస్తున్నారు.

సాహు సాహిత్యం (1999)పై నా పర్యవేక్షణలో వి.రాజేశ్వర శర్మ ఒక ఎం.ఫిల్ సిద్ధాంత పరిశోధన చేశారు. ఆ పరిశోధన కోసం సాహు కథలను చదువుతున్నప్పుడు శిల్ప పరమైన ఆలోచనలకే తావుండదు, అమాయకమైన గోండులు బతకడం కోసం ప్రకృతిలో దోపిడి దారులతో క్రూరమృగాలతో ఎట్లా పోరాటం చేశారో చదువుతూ చలించిపోతాం. సాహు గోండులతో కలిసి జీవిస్తూ వాళ్ళ వ్యధల్ని కథలుగా మలచడం చేశాడు. ఆ కథల్ని శిల్ప పరమైనవి కావు అని కొట్టివేస్తే గిరిజన జీవితాలనే విస్మరించిన వారమవుతాం. వీటిని మధ్య తరగతి సాహిత్య శైలీ, శిల్ప కోణంలో కాకుండా కార్మికవర్గ, పీడిత వర్గ సాహిత్య శైలీ, శిల్పాల కోణంలో, ఉద్యమ సాహిత్య ప్రయోజన కోణంలో పరిశీలించడం అవసరమని వి.రాజేశ్వరశర్మతో పాటు జరుపుల రమేష్ కూడా తమ ఎం.ఫిల్ సిద్ధాంత వ్యాసాల్లో స్పష్టంగా విశ్లేషించి చూపారు. జీవితాలని యథాతథంగా ఎంతో గొప్పగా చిత్రించిన కథకులనే రచయితలు కాదని సాహిత్యంలో ప్రచారం చేస్తుంటే, ఇక సామాన్యులు, తమ జీవితాల గూర్చి కథలు రాయడానికి సాహసిస్తారా? అందుకే గిరిజన జీవితాలపై కథలు ఎక్కువగా రాలేదేమోనని అనిపిస్తోంది.

ఇప్పటి వరకు ఉన్న సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొని ఈ కథల్ని విశ్లేషించే ప్రయత్నం చేసినప్పటికీ, ఇప్పుడున్న సైద్ధాంతిక భూమికకు అందని కథలను వీరు విశ్లేషించడానికి, సమన్వయించడానికి తెలుగు కథా సాహిత్యంలో కొత్త సూత్రాలు అవసరమని ప్రతిపాదించాడు. ఈ ప్రతిపాదన అభినందనీయం.

మంచి ప్రతిపాదనలతో సహేతుకమైన విశ్లేషణతో నూతన దృష్టికోణం కలిగిన రమేష్‌కు ఉజ్వలమైన భవిష్యత్తు ఉంది. తన పరిశోధనా వ్యాసం చీకట్లోనే వుండకుండా పుస్తక రూపంలో పాఠకుల మధ్యకు తీసుకురావడం పరిశోధనకు ఎంతో మేలు చేస్తుంది.

సామాజిక తత్వవేత్త
**బి.ఎస్.రాములు**
సామాజిక తాత్విక విశ్వవిద్యాలయం

ఫ్లాట్ నెం.403, సాయిలక్ష్మి రెసిడెన్సీ,
2-2-647/90, ఎక్సైజ్ కాలనీ,
హైదరాబాద్ - 500 013
ఫోన్ : 9391036987

# 'అడవిలో వెన్నెల' భూమిక

ఇది 'అడవిలో వెన్నెల గిరిజన పోరాట కథల సంపుటి'పై జరుపుల రమేష్ హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఎం.ఫిల్ లఘు సిద్ధాంత పరిశోధన వ్యాసం. అడవిలో వెన్నెల కథల సంపుటిని కరీంనగర్ బుక్‌ట్రస్ట్ పేరిట 1985 మార్చిలో ప్రచురించాము. దీని సంపాదకత్వంలో నాతో పాటు ఆర్కే నిజాం వెంకటేశం, అల్లం రాజయ్య, పి.చంద్ సహకరించారు.

కరీంనగర్ బుక్‌ట్రస్ట్ ప్రచురించిన బతుకుపోరు నవలపై రెండు ఎం.ఫిల్ పరిశోధనలు, భూమి, బొగ్గుపొరల్లో కథా సంకలనాలపై పరిశోధనలతో పాటు, అడవిలో వెన్నెల కథల సంపుటిపై ఎం.ఫిల్ పరిశోధన జరగడం కరీంనగర్ బుక్‌ట్రస్ట్ నిర్వాహకులకు ఎంతో సంతోషం కలిగించే విషయం.

'అడవిలో వెన్నెల' కథల సంపుటి తర్వాత ఆదివాసీల జీవితాలపై మరెన్నో కథలు, నవలలు వచ్చాయి. 'అడవిలో వెన్నెల' కథల సంపుటి తర్వాత 'నేలతల్లి విముక్తికోసం - జనజీవన పోరాట కథలు' సంకలనం విరసం ప్రచురణగా వెలువడింది. ఈ కథల ఎంపికలో నాతో పాటు డా॥ శ్రీనివాస్ (సారధి) ప్రధాన సంపాదకులుగా వ్యవహరించడం జరిగింది. ఈ కథా సంకలనంలో విప్లవోద్యమం ఎన్ని రంగాల్లో విస్తరించి ఎన్ని సెక్షన్లను ఆర్గనైజ్ చేసిందో ఆయా ప్రజల సమస్యలు, జీవితాలు, పోరాటాలు ఎలా జరిగాయో, వాటిపై నిర్బంధాలు ఎలా కొనసాగాయో వాటిని ప్రజలు, ఉద్యమకారులు ఎలా ఎదుర్కొంటున్నారో మొదలైన కోణాలను ప్రతిఫలించే కథలను ఎంపిక చేయడం జరిగింది. ఆ తర్వాత విరసం 'కథా కెరటాలు' పేరుతో మరో కథా సంకలనం ప్రచురించింది. అందులో కూడా మరికొన్ని ఆదివాసీ కథలు వున్నాయి. అరుణతారలో వచ్చిన కథల్లోంచి ఎంపిక చేసి మరో కథా సంకలనం... 'కదిలే కథ' పేరుతో విరసం ఇటీవల ఉద్యమ కథా సంకలనాన్ని ప్రచురించింది. ఇటీవల జీవన్, జయధీర్ తిరుమలరావుల సంపాదకత్వంలో 'ఇప్పపూలు' గిరిజన, సంచార తెగల కథా సంకలనం వెలువడింది. 'ముప్పయ్యేళ్ళ దండకారణ్య ఆదివాసీ సాహితీ, సాంస్కృతికోద్యమ చరిత్ర' అనే పుస్తకం మూడు దశాబ్దాల సాహిత్య, సాంస్కృతిక ఉద్యమాన్ని పరిచయం చేస్తుంది. అరుణతారలో మరికొన్ని వ్యాసాలు వెలువడ్డాయి. ఇలా ఉద్యమ సాహిత్యం, అందులో భాగంగా



దండకారణ్య, ఆదివాసీ ప్రజల, ప్రాంతాల సాహిత్యం రికార్డవుతూ వస్తున్నది. వీటిని కేవలం కాలక్షేపం కోసం, తమ సమస్యల కోసం రాసే సాహిత్య ప్రమాణాలతో పరిశీలించడం పొరపాటు. ఇది నిజమైన ప్రజా సాహిత్యం. నిజమైన సామాజిక పరిణామాలను చిత్రించే సమకాలీన చారిత్రక ప్రాధాన్యత గల సాహిత్యం.

ఈ నేపథ్యంలో ఒక స్పష్టమైన ప్రజా దృక్పథంగల ఆచార్య తుమ్మల రామకృష్ణ గారి పర్యవేక్షణలో 'అడవిలో వెన్నెల' కథల సంపుటిపై ఈ లఘు సిద్ధాంత వ్యాసం ఎం.ఫిల్ పట్టా పొందింది. జరుపుల రమేష్ లంబాడీ తెగకు సంబంధించిన కుటుంబం నుండి కష్టపడి ఎదుగుతూ వచ్చిన తొలితరం విద్యావంతుడు. వందలాది మంది ప్రాథమిక, పాఠశాల విద్యతో ఆగిపోతే నూటిలో ఒకరు ఇలా యూనివర్సిటీ పరిశోధన దాకా ఎదుగుతూ వస్తున్నారు. 1968లో మొదలైన శ్రీకాకుళం ఉద్యమం మొదలుకొని దండకారణ్య ఉద్యమం దాకా గడిచిన 40 ఏళ్లలో లక్షలాది మంది ఆదివాసీలు ఉద్యమాల్లో చురుకుగా పని చేస్తున్నప్పటికీ ఆదివాసీల నుండి సాహితీ వేత్తలు, రచయితలు ఎదగకపోవడం నన్ను తొలిచివేస్తున్న ప్రశ్న. ఇలాంటి నేపథ్యంలో జరుపుల రమేష్ ఒక ఆశాదీపంగా పరిశోధక విద్యార్థిగా ముందుకు రావడం ఎంతో సంతోషం కలిగింది.రమేష్ ఈ పరిశోధనతో ఆగిపోకుండా సాహితీ విశ్లేషణ, కథా సాహిత్య సృజన రంగాల్లో నిరంతరం విస్తృతంగా కృషి చేయాలని ఆశిస్తున్నాను.

ఈ పరిశోధనా గ్రంథంలో రమేష్ తెలుగు సాహిత్యానికి అనేక విషయాలను విశ్లేషించి అందించాడు. గిరిజనులు అంటే ఎవరు? అనే నిర్వచనాన్ని, గిరిజనుల పుట్టుపూర్వోత్తరాలను, వారి చారిత్రక నేపథ్యాన్ని, సంస్కృతిని తొలి అధ్యాయంలో పరిశీలించాడు. గోండు గిరిజనుల సంస్కృతి విశిష్టతలను, వారి పెళ్ళి, పండగలు, పుట్టుక, మరణాలు, సంస్కృతిని, అడవిలో వెన్నెల కథా సంపుటిలో గల భిన్న గిరిజన తెగల తీరును వివరించాడు.

రెండవ అధ్యాయంలో కథలను సంక్షిప్తంగా పరిచయం చేస్తూ కథా వస్తువు, విశ్లేషణ చేశాడు. ప్రకృతితో గిరిజనులు ఎలా పోరాడుతారో , సాంప్రదాయాలతో, గిరిజనేతర సమాజంతో, వ్యవస్థలతో వారు ఎలా అనివార్యంగా పోరాడాల్సిన దుస్థితి ఎందుకు ఏర్పడుతున్నదో మైదాన ప్రాంత పౌర సమాజం ఆదివాసీ అటవీ, భూగర్భ సంపదను దోచుకోవడానికి ఎలా ఆదివాసీలను తరిమి వేస్తూ, అణచివేస్తూ వస్తున్నదో విశ్లేషించాడు. ఆదివాసీలదే అడవి, అక్కడి భూగర్భ సంపద అని విప్లవోద్యమం అనేక కోణాల్లో విశ్లేషించి ఆదివాసీలను చైతన్య పరుస్తుంది. అయితే పారిశ్రామిక వేత్తలకు, కాంట్రాక్టర్లకు, గ్లోబలైజేషన్ పరిణామాల్లో మల్టీనేషనల్ కంపెనీలకు అడవి, అడవిలోని భూగర్భ ఖనిజ సంపద,వనరులు, నదులు, లాభాల వేట కోసం ఆక్రమించాలని భావిస్తున్నారు. ఆదివాసీలకే శిక్షణ ఇచ్చి వారినుంచే నిపుణులను, పెట్టుబడిదారులను, పారిశ్రామిక వేత్తలను తయారు చేస్తే ఈ సమస్య ఇలా వుండేది

కాదు. ఆదివాసీ ప్రాంతాలను, వాటి నైసర్గిక సరిహద్దులననుసరించి గోండ్వానా రాష్ట్రంగా ఏర్పర్చి వుంటే ఈ అణచివేత, దోపిడీ ఇలా వుండేది కాదు.

ఒక చోట ఉద్యమం మొదలైందంటే ఆ సమస్య పరిష్కరించాలి. అది ప్రజాస్వామిక ప్రభుత్వ కర్తవ్యం. కానీ ఉద్యమించే ప్రజలను, దానికి నాయకత్వం వహించే పార్టీని అణచివేయాలనుకోవడం ఏ రకమైన ప్రజాస్వామ్యం? అందువల్ల ఇలాంటి ప్రభుత్వ నిర్ణయాలతో ఆదివాసీల సమస్య జటిలమవుతుందే తప్ప పరిష్కారం కాదు. ప్రతి ఆదివాసీ బాలబాలికలు ఉచిత ఉన్నత విద్య, భోజన వసతి, రెసిడెన్షియల్ స్కూలు, కాలేజీలు, హాస్టళ్లు ఏర్పాటు చేసి కనీసం బి.ఇడి. టీటీసీ, సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లుగా, డాక్టర్లుగా విద్యారంగం ద్వారా ఎదిగించడానికి ఎంత సమయం కావాలి? అయిదేళ్ల వయస్సున్న వారందరినీ ఇలా చదివిస్తే కేవలం 16 సంవత్సరాల్లో ఇంజినీరింగ్ కూడా పూర్తయిపోతుంది. కేవలం 16 సంవత్సరాల్లో దేశంలో ఆదివాసులందర్నీ డిగ్రీ, పీజీ, విద్యావంతులుగా, మేధావులుగా, ఇంజనీర్లుగా, డాక్టర్లుగా, మేనేజ్‌మెంట్ గురువులుగా, పారిశ్రామిక వేత్తలుగా ఎదిగించడం సాధ్యమే. అందుకు రాజ్యాంగం ప్రకారం కేటాయించాల్సిన ఆదివాసీ బడ్జెట్‌లను, విద్యా రంగ, సంక్షేమ రంగ బడ్జెట్‌లను కేటాయించి, చిత్తశుద్ధితో కృషి చేస్తే చాలు. నేడున్న ఉద్యమకారులందరూ దాన్ని ఆహ్వానిస్తారు. సహకరిస్తారు. ఆదివాసుల్లోంచి ఎదిగి తమ సమాజాన్ని ఇలా పునర్నిర్మించుకుంటారు. అంబేద్కర్ దళిత సమాజం శాంతియుత పరివర్తనతో కోట్లాది మంది ఎదిగే విధంగా రూపకల్పన చేశారు. అదే పద్ధతిలో ఆదివాసీలను ఎదిగించడం జరిగినప్పుడు ఆయుధాల కోసం, సైన్యం కోసం, పోలీసుల కోసం, అంతర్యుద్ధం కోసం బడ్జెట్‌లను కేటాయిస్తూ ప్రజలను ప్రజల చేతే చంపించే, అణిచివేసే అవసరం ఉత్పన్నం కాదు.

అందువల్ల ఆదివాసీల సమస్య ప్రణాళికా సంఘాలకు సంబంధించినది. బడ్జెట్‌లకు సంబంధించినది. అభివృద్ధికి సంబంధించినది. స్వేచ్ఛా, సమానత్వం, స్వయం పాలనకు సంబంధించినవి. ఆదివాసీ సామాజిక వ్యవస్థల ప్రత్యేకతలకు, సంస్కృతికి సంబంధించినవి. ఆదివాసులను మిగతా సమాజంతో సమానంగా పారిశ్రామిక వేత్తలుగా, విద్యావంతులుగా ఎదిగించడానికి సంబంధించినది. ఇది జరిగే దాకా ఎన్ని అణచివేతలు సాగినా ఎవరో ఒకరు ముందుకు వచ్చి ఉద్యమిస్తూనే వుంటారు. మొత్తంగా రెడ్ ఇండియన్స్ లాగా ఈ దేశ మూలవాసులైన ఆదివాసులను నిర్మూలించాలని కొందరికి వుందేమో. కానీ అది సాధ్యం కాదు. అలా కోరుకునే వారినే ప్రభుత్వాల నుండి కిందికి దించి తమకనువైన ప్రభుత్వాలను ప్రజాస్వామికంగా ప్రజలు ఏర్పర్చుకుంటారు.

అభివృద్ధి చెందిన సమాజానికి, వర్గాలకు, కులాలకు, ప్రాంతాలకు, దేశాలకు అభివృద్ధి చెందాల్సిన వారికి మధ్య నిరంతరం అంతరం వుంటుంది. అది అనేక



రూపాల్లో వ్యక్తమవుతుంది. అభివృద్ధి అందుకోవాల్సిన అవసరాన్ని గుర్తించి ముందుకు సాగే చైతన్యం కొందరికి వుంటే అభివృద్ధి అనేది ఒకటి వుందని దాన్ని అందుకోవాలని తెలియని, అవసరం లేదని భావించే, ఉన్నత ఆశయాలు, లక్ష్యాలు లేని వారు ఎందరో వుంటారు. ఈ మూడు దశల ప్రజాశ్రేణులు ఈ ప్రజాస్వామ్య దేశంలో కలిసి జీవిస్తున్నారు. వీరి మధ్య శాంతియుత అభివృద్ధి పరివర్తన ద్వారా స్వేచ్ఛ, సమానత్వం సాధించడానికి రాజ్యాంగం, ప్రభుత్వ యంత్రాంగాలు, శాసనకర్తలు, ప్రణాళికా కర్తలు, ప్రభుత్వ ఉద్యోగులు ఉపయోగ పడినప్పుడే నిజమైన ప్రజాస్వామ్యం. ఆదివాసీల సమస్య తమకు తామే పరిష్కరించుకునే సమస్య కాదు. మొత్తం సమాజం పూనుకుని పరిష్కరించాల్సిన, సహకరించాల్సిన సమస్య. ఆ కోణంలో సమాజం ఆదివాసీల జీవితాలను, కష్టాలను, ఉద్యమాలను అర్థం చేసుకోవడం అవసరం. గోండ్వాన రాష్ట్రంగానీ, విదర్భ రాష్ట్రంగానీ లేదా రెండు ప్రత్యేక రాష్ట్రాలు ఏర్పడినప్పుడే ఆదివాసీల అభివృద్ధి వేగవంతమవుతుంది. కేంద్ర, రాష్ట్ర స్థానిక ప్రభుత్వాలలో వారి అధికారం, వారి వాటా అందుతుంది.

రమేష్ తన పరిశోధనలో 'అడవిలో వెన్నెల' కథల్లోని శిల్పాన్ని, పాత్ర చిత్రణను, సన్నివేశ కల్పనను, సంఘటనల కూర్పును, సంభాషణలను, చక్కగా పరిశీలించారు. కథన రీతుల్లో వైవిధ్యాన్ని పట్టుకున్నారు. ప్రథమ పురుష, ఉత్తమ పురుష, ఫ్లాష్ బ్యాక్, ఎత్తుగడ, ముగింపు, కథల పేర్లు, భాషా పరిశీలన మొదలైన పలు అంశాలను విశ్లేషించిన ఈ పరిశోధన ఆదివాసీ జీవితాలను, సంస్కృతిని తెలుసుకోవడానికి సాహితీ వేత్తలకు ఒక కరదీపికలా ఉపయోగపడుతుంది. ఈ పరిశోధన ఆదివాసీ సాహిత్యంపై మరింత విస్తృత పరిశోధనలు జరగడానికి, సాహిత్యంలో ఆదివాసీల జీవితాలను విశ్లేషించడానికి ఎంతో స్ఫూర్తినిస్తుంది. రమేష్ పరిశోధన కేవలం సాహిత్య పరిశోధన కాదు అదొక చరిత్ర తవ్వకం. పురావస్తు ఆధారాల తవ్వకంతో చరిత్రను నిర్మించడం. ఈ పని తన పరిధిలోఅద్భుతంగా నిర్వహించాడు. తన వయస్సుకు మించిన శక్తితో ఈ పరిశోధనను సాహిత్యానికి అందిస్తున్న జరుపుల రమేష్‌కు హృదయ పూర్వక అభినందనలు.

# ప్రస్తావన

నేను హైదరాబాద్ విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. తెలుగు చదివాను. అప్పుడు విన్న పాఠాలు, రాసిన ఎసైన్‌మెంట్లు నన్ను పరిశోధన చేసేలా పురిగొల్పాయి. నేను స్వయంగా గిరిజన తెగకు చెందిన వాడిని. నా జీవితంలో ఎదురైన అనేకమైన అనుభవాలు కూడా గిరిజన సాహిత్య అధ్యయనానికి ప్రేరేపించాయి.

గిరిజన సాహిత్యంపై విశ్వవిద్యాలయ స్థాయిలో పరిశోధన చేస్తే బాగుంటుందని 'అడవిలో వెన్నెల (గిరిజన పోరాట కథలు) - సమగ్ర పరిశీలన' అనే అంశాన్ని ఎం.ఫిల్ పరిశోధనకు ఎన్నుకున్నాను. నా ఆలోచనలకి, పర్యవేక్షకుల ఆమోదం లభించింది. గిరిజన కథలు చాలా వున్నాయి. అందుచేత ఎం. ఫిల్.,కి ఒక సంకలనం తీసుకొని అందులోని గిరిజన జీవితాలను అధ్యయనం చేయాలనుకున్నాను. అలా 'అడవిలో వెన్నెల (గిరిజన పోరాట కథలు) - సమగ్ర పరిశీలన' అనే అంశాన్ని ఎన్నుకోవడం జరిగింది. నేను తీసుకున్న కథలను గిరిజన తండాలకు వెళ్ళి (ఫీల్డ్ వర్క్ ద్వారా) కొన్ని కథలు వాళ్ళకు చదివి వినిపించి వాస్తవ విషయాలను సేకరించాను. వాళ్ళ ప్రతిస్పందనలను గమనించాను. ఈ కథల సంకలనంలో కథ రచయితల పేర్లుగాని, సంపాదకుల పేర్లుగాని తెలుపలేదు. అందువల్ల కొంత మంది రచయితలనే కలుసుకోగలిగాను. అలా కలిసి మాట్లాడడం వల్ల సామాజిక తత్వవేత్త, ప్రముఖ రచయిత బి.ఎస్. రాములు, విప్లవ సాహితీవేత్త అల్లం రాజయ్య గార్లతో బాగా సాన్నిహిత్యం ఏర్పడింది. కథలు రాసిన రచయితల గురించి వివరాలు తెలుసుకున్నాను.

గిరిజన జీవితాలను సాహిత్యంలో అక్షరీకరించేటప్పుడు గమనించవలసిన అనేక అంశాలు 'అడవిలో వెన్నెల' కథల సంపుటిలో వున్నాయి. ఉద్యమం పూర్వాపరాలు, వాటి లక్ష్యాలు తెలియకుండా ఈ కథల సంపుటిని, ఈ రచనల ప్రాధాన్యతను విశ్లేషించడం అసాధ్యం. ఉద్యమ నేపథ్యం, రచయితల నేపథ్యం, ఒకే తీరుగా కలిసిపోయిన సామాజిక కర్తవ్యంలో భాగంగా రాసిన కథలివి. తొలుత కథల సంపుటిని పరిశోధనకు ఎన్నుకున్నప్పుడు ఇంత గొప్ప పుస్తకంపై పరిశోధన చేస్తున్నానని నాకు తెలియదు. ఒక చరిత్రాత్మకమైన, మహోన్నతమైన సాహిత్య చరిత్రను మలుపు తిప్పిన ఉద్యమ సాహిత్యంలోని ఒక పుస్తకాన్ని అధ్యయనం చేసి, పరిశోధించి, విశ్లేషించే అవకాశం రావడం నా అదృష్టంగా భావిస్తున్నాను. పుస్తకం అచ్చు వేసేటప్పుడు ఎం.ఫిల్ చేసినప్పటికన్నా అదనంగా పెరిగిన అవగాహనను, అధ్యయనాన్ని అనుసరించి మరింత పఠనీయంగా సమగ్రంగా ఈ పరిశోధనను రూపొందించాను.



ఒకటవ అధ్యాయం

# గిరిజనుల చరిత్ర

## కథల సామాజిక నేపథ్యం - కథకుల పరిచయం

### గిరిజనులు - నిర్వచనం - వివరణ

భారతదేశం విభిన్న మతాల, జాతుల, కులాల, సంస్కృతుల సమాహారం. ఇందులో భాగమైన ఆంధ్ర ప్రదేశ్‌లో కూడా ఈ వైవిధ్యం లేకపోలేదు. సాహిత్యం సమాజ ప్రతిబింబం అనుకున్నప్పుడు సమాజాన్ని అర్థం చేసుకోవడానికి సాహిత్యానికి మించిన ఆధారాలు లేవు. కాబట్టి విభిన్న మతాలు, జాతులు, కులాలు, శ్రేణులు, సామాజిక నేపథ్యాలు, సాహిత్య, సాంస్కృతిక విషయాలు అధ్యయనం చేయకపోతే భారతీయ సమాజాన్ని, అందులో భాగమైన తెలుగు సమాజాన్ని అర్థం చేసుకోవడం కష్టమవుతుంది. అయితే ఈ ఇరవై ఒకటవ శతాబ్దంలో కూడా ప్రధాన జీవన స్రవంతిలో భాగం కాకుండా, మైదాన ప్రాంతాలకు దూరంగా కొండల్లో, కోనల్లో, అడవుల్లో జీవిస్తున్న ఆటవిక తెగలు ఎన్నో ఉన్నాయి. ఆటవిక తెగలంటే గిరిజన తెగలు. గిరిజన జీవితాన్ని అర్థం చేసుకోవడానికి వారి పుట్టు పూర్వోత్తరాలు, చారిత్రక నేపథ్యాలు, వాళ్ళ సంస్కృతి తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

'గిరిజనులు' అనే పదంలోనే వారు గిరులపై నివసించేవారు అనే అర్థం ఉంది. గిరి అంటే 'కొండ'. కొండ మీద నివసించేవారని అర్థం. వీరినే 'ఆదివాసులు' అని కూడా పిలుస్తారు. గిరిజనులు అనే మాటకన్నా 'ఆదివాసులు' అనే మాటను చారిత్రకార్థంలోనూ, గౌరవార్థం లోనూ విస్తృతంగా సామాజిక వేత్తలు వాడినట్లు తెలుస్తోంది.

ఆర్యులు ఈ దేశంలోకి రాకముందే ఇక్కడ నివసిస్తున్న వారిని గిరిజనులుగా భావిస్తున్నారు. అటవీ ప్రాంతంలో నాగరిక సమాజానికి దూరంగా నివసిస్తున్న వారిని 'గిరిజనులు'గా భారత రాజ్యాంగం గుర్తించింది. కాని గిరిజనులు, వాళ్ళ

ఉనికి, వాళ్ళ జీవన విధానాలపై భిన్న అభిప్రాయాలు లేకపోలేదు.

గిరిజన, ఆదివాసీ, దళిత మొదలైన పదాలలో ఏ పదం 'గిరిజనులకు' సరిపోతుందని గిరిజన కథలు రాసిన బి.ఎస్. రాములు గారిని అడిగిన ప్రశ్నలకి ఆయన చెప్పిన సమాధానం – "నేను గిరిజన, ఆదివాసీ అనే పదాలు మంచిది అనుకుంటున్నాను. గిరిజన అనే పదం కొండల్లో వుండే వాళ్ళు అనే అర్థాన్నిస్తుంది. అయితే, తెగలు కాబట్టి ఆదివాసీ తెగలు అని అర్థం. దళిత అనే పదం వేరు. దళిత అనే పదం వర్ణవ్యవస్థకు, కులవ్యవస్థకు సంబంధించినది. కుల వ్యవస్థలో హిందూమతంలో నాలుగు వర్ణాలు అన్నారు. తర్వాత నాలుగు కులాలు అని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర. శూద్రుల తర్వాత అయిదో వర్ణం కింద, అయిదో కులం కింద పంచములు అన్నారు. పంచములు అనే పదం బదులుగా 'దళితుడు' అనే పదం ప్రచారం చేయబడింది. భారత రాజ్యాంగం ప్రకారంగా దళితులంటే షెడ్యూలు కులాలు. షెడ్యూలు తెగలుగా రికార్డు చేయబడిన వాళ్ళు ఏ మతం ఉన్నావారు కాదు. ప్రకృతి ఆరాధకులు అంటారు. షెడ్యూలు తెగలను హిందూమతమని, క్రైస్తవ మతమని, ముస్లిం మతమని లెక్కించడానికి వీలు లేదు. వాళ్ళు మత పూర్వ దశకు సంబంధించినవారు. ఎప్పుడైతే పౌరసమాజం, నాగరికత ఏర్పడుతుందో, అప్పుడే గిరిజన తెగలూ, తండాలు జనపదాలు నుంచి రాజ్యమేర్పడుతుంది. పౌరసమాజంలో హిందు మతం ఉంటే అప్పుడు కుల వ్యవస్థ వస్తుంది. ఈ పౌర సమాజం ఏర్పడక ముందు వున్న దశకు చెందిన మానవుల జీవితాలు, దాని వెలుపల వున్న స్వతంత్రమైన జీవితాలు గిరిజనులు, ఆదివాసులు, షెడ్యూలు తెగలు. అందువల్ల దీనికి దళిత అనే పదం వాడకూడదు. గిరిజన, ఆదివాసీ అనే పదాలే సరైనవి"[1].

"కొన్ని కుటుంబాలు, లేదా కొన్ని కుటుంబ సముదాయాల మధ్య సమైక్యత వుండి, ఒకే పేరుతో వ్యవహరింప బడుతూ వారందరూ ఒకే నిర్ణీత ప్రదేశంలో నివసిస్తూ, ఒకే భాష మాట్లాడుతూ, ఒకే రకమైన వైవాహిక నియమాల్ని పాటిస్తూ, ఒకే రకమైన ఆహార విధానాన్ని అవలంబిస్తూ పరస్పర సహకార భావం కలిగి ఉండి, వారి మధ్య పరస్పర అనుబంధముండే సమూహాన్ని తెగ అనవచ్చు. ఒక తెగ సామాన్యంగా అంతర్వివాహ సముదాయము అంటే ఒక తెగలోని వారు ఆ తెగలోని వారితోనే వైవాహిక సంబంధాల్ని ఏర్పరచుకొంటా"[2] రని ఎమ్. సూర్యనారాయణ అభిప్రాయం.



"గిరిజనులు అనగానే తలలో ఈకలూ, మొలలో గజ్జెలు ఉండే విచిత్ర జీవులని సామాన్య నాగరికులు భావిస్తారు. ఎక్కడో అడవులలో నివసిస్తూ తెల్లబట్టలు కనబడగానే పారిపోయే భయస్తులు అని కొంత చదువుకున్న వాళ్ళు భావిస్తారు. గిరిజనుల మాటే చెప్పాలంటే వాళ్ళు తమను తాము 'కొండ మనుషుల' గాను 'అడవి మనుషుల' గాను వర్ణించుకుంటారు. ఈ రకంగా చూస్తే వాళ్ళకు మనం పెట్టుకున్న గిరిజనులు, ఆటవికులు అనే పేర్లు వాళ్ళ చైతన్యం యొక్క సంస్కృతీకరణే"[3] నని అంటారు 'అడవిలో వెన్నెల' కథల సంపుటికి ముందు మాట రాసిన బాలగోపాల్.

'భారతీయ గిరిజనులు' అన్న ప్రసిద్ధ గ్రంథం అందించిన నదీం హస్నైన్ గిరిజనుల గురించి చెపుతూ "సాధారణంగా గిరిజన సమాజాలు చిన్నవిగా ఉంటాయి. వారి అవసరాలు, ఆలోచనలు, పరిమితంగా ఉంటాయి. వారి సామాజిక, న్యాయ, రాజకీయ సంబంధాలు చాలా పరిమితమైనది. వారికి నైతికవర్తన, మతం ఉన్నాయి .... గిరిజన భాషలకు లిపి ఉండదు. అందువల్ల వారు నోటి మాట ద్వారా అందించే సమాచారం పరిమితంగా ఉంటుంది. అయితే గిరిజన సమాజాలు అన్ని విషయాల్లోనూ వృథాను వ్యతిరేకిస్తాయి. అందువల్ల వాటికి ఒక సమగ్రత ఏర్పడుతుంది. స్వయం సమృద్ధి ఏర్పడుతుంది. ఇది ఆధునిక సమాజాల్లో లోపించింద"[4]ని వివరించారు.

విజ్ఞాన సర్వస్వాలు (ఎన్‌సైక్లోపీడియా) అందించిన పండితులు 'తెగ' అనే పదాన్ని కింది అర్థంలో వాడారు.

"A group of families who have a Feeling of Community through occupying a common territory and Following similar customs. Tribe is has been applied to any people having common territory and customs who are not part of a state society. Tribe and Tribal are convenient terms for indicating that a people still follows customs rather then state law"[5].

"Tribe in cultural anthropology is theoretical type of human social organization based on small groups defined by traditions of common descent and having temporary or

permanent political integration above the Family level and shared language, culture and ideology, members typically share a tribal name and contiguous territory, they work together in such joint endeavowrs as trade, agriculture, hous construction, Waffare, and cermonial activities"[6].

"A group of people, often of related Families, who live together, sharing the same Language, culture and history, especially those who do not Live in towns or cities"[7].

గిరిజన తెగలపై వచ్చిన నిర్వచనాలను పరిశీలిస్తే అభిప్రాయాలలో వైవిధ్యం అర్థమవుతుంది. కాని ప్రస్తుత కాలంలో పైన చెప్పిన నిర్వచనాలు నేటి గిరిజన తెగలకు సరిపోవు అని చెప్పాలి. ఎందుకంటే ఆధునిక గిరిజన మానవుడు అడవులలో నుండి బయటకి వచ్చి, అక్షరజ్ఞానం నేర్చుకుని మైదాన ప్రాంత ప్రజలతో కలిసిపోతున్నాడు. అయితే గిరిజనులు ఒకే ప్రాంతంలో నివసించడం లేదు. తెగ ఒక గుర్తింపునిస్తుంది. తెగ వాళ్ళ భాషకు, వాళ్ళ వేషధారణకు, వాళ్ళ ఐక్యతకు, సాంస్కృతికి ప్రత్యేక ప్రాధాన్యత నిస్తుంది. ఇవన్నీ కలిసి వాళ్ళ మొత్తం జీవితాన్ని అర్థం చేసుకోవడానికి ఉపయోగపడతాయి. ప్రధానంగా కొన్ని కుటుంబాలు ఒకటిగా కలిసి ఒకే పేరుతో వ్యవహరింపబడుతూ, ఒకే వృత్తిన్ని చేపడుతూ, ఒకే భాషను మాట్లాడుతూ అంతర్వివాహ సంబంధాలు కలిగి వుంటూ, ఒక నిర్ణీత ప్రాంతంలో నివసిస్తున్న వారిని తెగగా, తెగలుగా గుర్తించవచ్చు.

## గిరిజనులు – పుట్టు పూర్వోత్తరాలు

బాలగోపాల్ గారు చెప్పినట్లు ఒకప్పుడు మనుషులంతా ఆటవికులే. అప్పుడు వేట, పశుపోషణ, ఆహారసేకరణ, పోడు వ్యవసాయం, జీవనాధారాలుగా వుండేవి. ద్రావిడులయినా ఆర్యులయినా మన దేశానికి వచ్చినప్పుడు మొదట్లో ఆటవిక స్థాయిలో వున్నవారే. అయితే మనదేశానికి మొదట వచ్చినవారు ద్రావిడులు. తరువాత వచ్చినవారు ఆర్యులు. ఇవ్వాళ వీళ్ల భాషలు ప్రబలంగా ఉండడాన్ని బట్టి చూస్తే ఇక్కడి ఆదివాసులు మీద వీళ్ళు ఆధిపత్యం నెలకొల్పినట్టు తెలుస్తోంది. ఇవ్వాళ మైదానాలుగా కనిపిస్తున్న ప్రాంతాలు ఒకప్పుడు మైదానాలు అయివుండకపోవచ్చు. అవి దట్టమయిన అడవులుగా ఉండి ఉండచ్చు.



## గిరిజనులు – చారిత్రక నేపథ్యం

"కొంత బలమూ, ప్రతాపము గలవారు కొండ ప్రాంతాలలోనూ కొండలకు, కొండలకూ మధ్య లోయల లోనూ, సముద్ర తీరపు పల్లపు ప్రదేశంలోనూ చిన్న చిన్న రాజ్యాలు కట్టుకొని తమకు వశమైనంత దేశాన్ని పాలిస్తూ వచ్చారు. ఈ రాజ్యాలను అన్నింటినీ జయించి శాశ్వతముగా ఒక్క మహారాజు అధికారాన ఉంచుకోవడం కష్టమే అయ్యేది. ఈ చిన్న రాజులు తమకోటలను, కాకులు దూరని కారడవుల మధ్య, కొండ కోనలలోనూ కట్టుకొనేవారు. అడవి దారులూ, కొండదారులూ ఆ ప్రాంతాన ఉన్నవారికే కాని ఇతరులకు తెలియవు. ఈ దొరలను కొండ రాజులనీ, మన్నెరాజులనీ అనేవారు. వీరందరూ విల్లమ్ములతో యుద్ధం చేయడంలో చాలా నేర్పరులు. పూర్వకాలంలోయుద్ధం చేసే ఆయుధాలలో విల్లమ్ములే ముఖ్యమైనవి. ఏ మహారాజయినా వీరిని తాత్కాలికంగా జయించినా, అట్టే కాలం వీరిని తన పాదాల క్రింద తొక్కిపెట్టి ఉంచలేకపోయేవాడు. మళ్ళీ వారు స్వతంత్రులై తమ రాజ్యం పాలించుకొనే వారు. ఈ చిన్న రాజ్యాల చరిత్ర మనకు ఏమీ తెలియదు"[8] అని గిరిజనుల పూర్వ చరిత్రను సుప్రసిద్ధ పరిశోధకులు శివరామకృష్ణ గారు తెలియజేశారు.

సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులైన కుమారస్వామి గారి అభిప్రాయం ప్రకారం "చారిత్రకంగా గిరిజనులు అతి ప్రాచీనకాలానికి చెందిన వారుగా కనబడతారు". ఆర్యులు భారతదేశంలోకి ప్రవేశించినపుడు వారితో పోరాడిన ఆర్యేతరులు ఆర్యులచేత ఓడించబడి దేశంలోని మారుమూల ప్రాంతాలకు పారదోల బడ్డారనీ చరిత్రవల్ల తెలుస్తుంది. ప్రాచీన భారతదేశ చరిత్రలో స్వతంత్ర గిరిజన రాజ్యాలను 'ఆటవిక రాజ్యాలు'గా పిలిచేవారు. క్రీ.పూ. 6వ శతాబ్దంలో గంగా యమునా మైదాన ప్రాంతాలలో ఆర్యులు రాచరిక రాజ్యాలను స్థాపించుకోగా, హిమాలయ పర్వతాలు, వింధ్య పర్వత ప్రాంతాలలో గణతంత్ర స్వభావాన్ని సంతరించుకున్న ఆటవిక రాజ్యాలు ఉండినట్లుగా, అలెగ్జాండర్ వాయువ్య భారతదేశం మీద దండ యాత్ర చేసినపుడు ఆటవిక రాజ్యాల ప్రజలు ఇతర రాజ్యాల కంటే ధైర్య సాహసాలతో ప్రతిఘటించినట్లుగా గ్రీకు రచనల వల్ల తెలుస్తోంది. మౌర్య సామ్రాజ్య నిర్మాత చంద్రగుప్త మౌర్యుడు, అతని సలహాదారు చాణక్యుడు ఆటవిక ప్రజల సహాయ సహకారాలతో దృఢమైన సైన్యాన్ని రూపొందించుకొని, మగధలో నందుల పాలనను అంతమొందించి మౌర్య పాలనకు నాంది పలికినట్లుగా తెలుస్తోంది.

మౌర్య చంద్రగుప్తుని ఆస్థానంలో గ్రీకు రాయబారిగా వచ్చిన 'మెగస్తనీసు' రాసిన 'ఇండికా' గ్రంథంలోను, అశోకుని శాసనాలలోను ఆటవికుల ప్రస్తావన ఉంది. "క్రీ.శ. 4వ శతాబ్దంలో ఉత్తర భారతదేశంలో స్థాపించబడిన గుప్త సామ్రాజ్య పాలకులలో ముఖ్యుడైన సముద్ర గుప్తుడు వింధ్య పర్వత ప్రాంతంలోని 'ఆటవిక రాజ్యాల' మీద దండయాత్ర చేసి, వాటిని తన సార్వభౌమత్వాన్ని అంగీకరింపచేశాడని అలహాబాదు ప్రశస్తి శాసనం"[9] తెలుపుతుంది.

"చారిత్రక యుగం నుంచి మధ్యయుగం వరకు గిరిజనులు ఒక వ్యవస్థీకృత రాజకీయ శక్తిగా స్వయం ప్రతిపత్తిని అనుభవిస్తూ వచ్చినట్లు చారిత్రకాధారాలు తెలుపుతున్నాయి. కాని క్రీ.శ. 16వ శతాబ్దం నాటికి ముస్లిం దండ యాత్రల కారణంగా క్రమేణా రాజకీయ స్వాతంత్ర్యాన్ని కోల్పోవడం ప్రారంభమైంది"[10]. మధ్య భారతదేశంలోని 'గోండులు' క్రీ.శ. 15 శతాబ్దం ప్రారంభంలో 'గార్హా'ను కేంద్రంగా 'గోండ్వానా' అనే రాజ్యాన్ని స్థాపించుకున్నారు. మొఘల్ సామ్రాజ్య విస్తరణంలో భాగంగా క్రీ.శ. 1564లో మొఘల్ సైన్యాలు 'గార్హా'ను ఆక్రమించాయి. అదే కాలంలో ఆ రాజ్యాన్ని రాణి దుర్గావతి తన కుమారుడు వీరనారాయణకు ప్రతినిధిగా పరిపాలన చేస్తుండేది. తన రాజ్యాన్ని శతృసైన్యాల నుంచి ఓటమికి గురి అయిన పరిస్థితులలో ఆత్మహత్య చేసుకొని మరణించాడు. దీనితో ఆమె కుమారుడు వీరనారాయణ యుద్ధ భూమిలో మరణించాడు. దానితో 'గోండ్వానా' మొఘల్ సామ్రాజ్యంలో కలిపివేయబడింది.

'ఓరాన్' ముండా అనే గిరిజనులు సంయుక్తంగా చోటానాగపూర్ ప్రాంతంలో స్వతంత్ర గిరిజన రాజ్యాన్ని స్థాపించుకోగా, క్రీ.శ. 1585లో మొఘల్ సైన్యాలు వీరిని ఓడించి, ఈ రాజ్యపాలకుని మొఘల్ సామ్రాజ్యానికి సామంతునిగా చేర్చుకున్నారు. మధ్య యుగంలో భారతదేశంలోని స్వతంత్ర గిరిజన రాజ్యాలను మొఘల్‌లు ఆక్రమించడాన్ని గురించి చరిత్రకారుడు "బలమైన రాజ్యాలు పొరుగున ఉన్నా బలహీన రాజ్యాల స్వాతంత్ర్యాన్ని కబళించాయి. ఇది సామ్రాజ్యవాద అణచివేతకు నిదర్శనం"[11] అని పరిశోధకులు అంటున్నారు.

దండకారణ్యంపై 14వ శతాబ్దం నుంచి పరాయి రాజుల ఆక్రమణలు ప్రారంభమైనాయి. 19వ శతాబ్దం మధ్య భాగంలో ఇక్కడ బ్రిటిష్ వాళ్ల ప్రత్యక్ష పాలన మొదలైంది. ఈ ప్రాంతంలోని ఆదివాసీ రాజులు కొందరు వాళ్లకు



సామంతులయ్యారు. వలస పాలన రావటంతో వీరి సంప్రదాయ పరిపాలనా వ్యవస్థ గట్టి కుదుపులకు లోనై పలు మార్పులు చోటు చేసుకున్నాయి. బ్రిటీష్ ప్రభుత్వంతో సహకరిస్తూ ఎదగాలనుకునే ఒక కొత్త భూస్వామ్య, పెత్తందారీ వర్గం పుట్టుకొచ్చింది. పాత సాంప్రదాయ తెగ పెద్దలు కొందరు వీరితో కలిశారు. మరికొందరు వీరికి దూరంగా ఉండిపోయారు.

పశ్చిమ భారతదేశంలోని 'భిల్లులు' క్రీ.శ. 17వ శతాబ్ది ప్రారంభం నుంచి తమ రాజకీయ స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవటానికి ముస్లిం, మరాఠా సామ్రాజ్యవాదులతో అనేక పోరాటాలు చేశారు. క్రీ.శ. 1780-1800ల మధ్య కాలంలో భిల్లులు వీరితో చేసిన పోరాటాలు ఇందుకు నిదర్శనంగా చెప్పవచ్చు. అంతేగాక క్రీ.శ. 18, 19 శతాబ్దాలలో చాందా, చత్తీస్‌ఘర్, భిల్‌ముల్ అనే గిరిజన రాజ్యాలుండేవి. బ్రిటీష్ వారి ఆక్రమణకు ముందు స్వతంత్ర గిరిజన రాజ్యాలు కొనసాగాయని తెలుస్తోంది.

## గిరిజనులు – తెగలు

భారతదేశంలోని బడుగు వర్గాలలో గిరిజనులొకరు. నేడు రాష్ట్రంలో గిరిజనులు అన్ని తరగతులకన్నా, ఎన్నో రకాలుగా వెనుకబడి ఉన్నవారు. దక్షిణ భారతదేశంలోని అన్ని రాష్ట్రాలకంటే ఆంధ్ర ప్రదేశ్‌లోనే ఎక్కువ సంఖ్యలో గిరిజనులు నివసిస్తున్నారు. 1956వ సంవత్సరం నవంబరు ఒకటవ తేదీన ఏర్పడిన ఆంధ్ర ప్రదేశ్ విస్తీర్ణం 2,76,754 చదరపు కిలోమీటర్లు. భారతదేశ మొత్తం భౌగోళిక విస్తీర్ణంలో ఇది 8.4 శాతం.

ఆంధ్ర ప్రదేశ్ ప్రజలు విభిన్నమైన భాషలు మాట్లాడుతారు. తాము విభిన్న ప్రాంతీయులమని చెప్పుకుంటారు. ఈ రాష్ట్రంలో షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలు, వెనకబడిన తరగతులకు చెందినవారు అధిక సంఖ్యలో నివసిస్తున్నారు. ఈ గిరిజనులు 30,028 చదరపు కిలోమీటర్ల ప్రాంతంలో విస్తరించి ఉన్నారు. రాష్ట్ర విస్తీర్ణం పదకొండు శాతం ప్రాంతంలో ఏడు శాతం గిరిజనులు నివసిస్తున్నారు.

శ్రీకాకుళం, విశాఖపట్నం విజయనగరం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, వరంగల్, ఆదిలాబాద్, ఖమ్మం, మహబూబ్‌నగర్, అనంతపురం జిల్లాలో గిరిజనులు అధికంగా నివసిస్తున్నారు. మొత్తం గిరిజనుల్లో అధిక శాతం షెడ్యూల్డ్

ప్రాంతంలో నివసిస్తుండగా మిగిలిన 32 శాతం మంది గిరిజనేతరులలో కలిసి మైదాన ప్రాంతంలో నివసిస్తున్నారు. ఆంధ్ర ప్రదేశ్‌లో గిరిజనులు అనేక తెగలుగా ఉన్నారు. వారిని ఈ కింది విధంగా (పరిశోధకులు) నదీం హసనైన్ వర్గీకరించారు.

1. అంథ్ 2. బగత 3. భిల్ 4. చెంచు 5. గదబ 6. గోండు 7. కొండరెడ్డి 8. జాతపు 9. కమ్మర 10. కోయ 11. కట్టునాయకన్ 12. కొండదొర 13. కొండకాపు 14. కొండరెడ్డి 15. ఖోండ్ 16. కోటియా 17. ఒరియా 18. కులియా 19. మాలి 20. మన్నెదొర 21. ముఖదొర 2. నాయక 23. పొరజ 24. పర్ధన్ 25. రెడ్డిదొర 26. రేన 27. సవర 28. సుగాలీ (లంబాడా, బంజారాలు) 29. వాల్మీకి 30. యానాది 31. తోటి 32. ఎరుకల 33. గవుడు-మొదలుగా ముప్పైమూడు తెగలు ఉన్నట్లు పేర్కొన్నారు.

ప్రపంచ వ్యాప్తంగా గిరిజనులు ఉన్నారు. వీరిని ఆయా దేశాల్లో ఎబ్ ఒరిజినల్స్ అని ఆయా దేశాల మూలవాసులని, ఆదివాసులని పేర్కొంటారు. మన దేశంలో వందలాది ఆదివాసీ గిరిజన తెగలు కొనసాగుతున్నాయి. ఆంధ్ర ప్రదేశ్‌లో పైన పేర్కొన్న '33' తెగలు జీవిస్తున్నాయి. ప్రతి గిరిజన తెగ ఒక్కొక్క ప్రత్యేకమైన లక్షణాలను కల్గి ఉండడం ఒక ప్రత్యేకత. గిరిజనులని వర్గీకరించడానికి కొన్ని ప్రత్యేక సూత్రాలను రూపొందించారు. ప్రస్తుతం దేశ జనాభాలో సుమారు ఏడు శాతం పైగా ఆదివాసీలే. ప్రాజెక్టులు, పరిశ్రమలు, గనులు, ఖనిజాల త్రవ్వకం వల్ల దేశంలోని 20 శాతం పైగా ఆదివాసీలు నిర్వాసితులయ్యారు, నిరాశ్రయులయ్యారు. వారి గురించి ప్రత్యేక ప్రణాళికలు ఏవీ చేపట్టలేదు. చేపట్టినా వారికి అందలేదు.

మైదాన ప్రాంతాల సమీపంలో గల గిరిజనులు కొంత అభివృద్ధిని అందుకొన్నప్పటికీ అటవీ ప్రాంతాల్లో ఆహార సేకరణ, వేట, పోడు వ్యవసాయం దశల్లో జీవితాన్ని కొనసాగిస్తున్న గిరిజనులు ఇప్పటికీ శతాబ్దాల వెనకబాటుతనంలో జీవిస్తున్నారు. ఆధునిక విద్య, ఉపాధి, ఆధునిక వ్యవసాయం, పని పద్ధతులు వారికి ఇంకా చేరువ కాలేదు. వాటి ఉత్పత్తి శక్తులు, సామర్థ్యం ప్రాథమిక స్థాయిలో కొనసాగడం వల్ల, వారి ఉత్పత్తులను మైదాన ప్రాంత వ్యాపారులు చవకగా దోపిడీ చేయడం వల్ల ఆదివాసీలు మరింత వెనకబడిపోతున్నారు. అలాంటి ఆదివాసీలను చైతన్య పరచడానికి ఉద్యమంలో భాగస్వాములను చేయడానికి వామపక్ష



భావజాలంతో ఉద్యమకారులు ఆదివాసులను సమీకరించారు. ఉద్యమించారు. గిరిజనులు జాతీయోద్యమ కాలంలో వలస పరిపాలనకు వ్యతిరేకంగా మైదాన ప్రాంత ఆధిపత్యాలకు, రాజరికాలకు వ్యతిరేకంగా 170కి పైగా తిరుగుబాట్లు చేశారు. వెన్నెలకంటి రాఘవయ్య వీటిని గ్రంథస్థం చేశారు.

## గిరిజనులు - సంస్కృతి

జీవన విధానమే సంస్కృతి. జీవన విధానంలో అంతర్భాగంగా ఉండే ఆచారాలు, సంప్రదాయాలు, వేష భాషలు మొదలైన వన్నీ సంస్కృతిలో భాగమే. నేడు శాఖోపశాఖాలుగా వికసించిన సంస్కృతిలో ఏది ఎవరి సంస్కృతి అనే దాన్ని కొంత వరకు సంస్కృతిపైన పరిశోధన చేసినవాళ్ళు వర్గీకరించే ప్రయత్నం చేశారు. అలాగే భారతీయ సంస్కృతిని కూడా గుర్తించవచ్చు. దానికి ఆధారాలు ఆర్య, ద్రావిడ జీవితాలను పరిగణనలోకి తీసుకోవచ్చు. ఆర్యులు రాక పూర్వం ఉన్నవారు ద్రావిడులు, ద్రావిడేతరులు. వారివారి సంస్కృతి విశేషాలు మనకు అందనంతగా నేడు మిశ్రమ సంస్కృతి ఏర్పడింది. ప్రస్తుతం చెప్పుకునే సంస్కృతి పుట్టుపూర్వోత్తరాలకు, మనకు అందనంత కాల ప్రవాహం వుండటం మూలంగా ఏది ఏదో తేల్చి చెప్పడం అంత సులభమైన పనికాదు. ఆ విధంగా తేల్చి చెప్పాలనుకున్నప్పుడు మనకున్న ఒకే ఒక్క ప్రామాణికాధారం ఆదిమజాతులు, వారి జీవిత విధానం, పద్ధతులు, నమ్మకాలు మొదలైనవి.

గిరిజన కళలు గమనించినట్లయితే వాళ్ళ జీవన విధానం వాళ్ళ ఆర్థిక స్థితి గతులూ, వాళ్ళ సాంఘిక సంబంధాలు, వాళ్ళకి సంబంధించిన సమస్త విషయాలు బోధపడతాయి. 'అడవిలో వెన్నెల' కథల్లో ప్రధానంగా గోండీ ప్రజల జీవన విధానం, వాళ్ళ నమ్మకాలు, వాళ్ళ సాహసాలు, వాళ్ళ రహస్యాలు, వాళ్ళ ఎత్తుగడలు, వాళ్ళ అమాయకత్వం ఇలా.... వాళ్ళకి సంబంధించిన అనేక విషయాలు చిత్రించడం జరిగింది.

## గోండు సంస్కృతి పుట్టుక ఆధారాలు

గోండువా భూమిని అతి ప్రాచీనమైన భూమిగా చరిత్రకారులు పేర్కొన్నట్లు తెలుస్తోంది. అయితే కాలక్రమంలో అది ప్రాధాన్యతను కోల్పోయింది. ఇలా కొంత

మంది చరిత్రకారులు, రచయితలు మాత్రమే ఆదిమ గిరిజనుల సంస్కృతి సాంప్రదాయాలను వారి రచనల్లో నిక్షిప్త పరిచే ప్రయత్నం చేశారు. మేస్రం మనోహర్ 'గోండు సంస్కృతి' గ్రంథంలో గోండుల శతాబ్దాల చరిత్ర, సంస్కృతి, గోండు రాజవంశావళి గురించి అనేక విశేషాలు పొందు పరిచారు. అవి ఈ పరిశోధనకు ఎంతగానో ఉపయోగపడ్డాయి.

గోండు అనే పదాన్ని పరిశోధకులు చాల రకాలుగా నిర్వచించారు. 'హిస్‌లప్' అనే పరిశోధకుడు గోండు అనే పదము ఖోండ్ అనే తెగ నుండి కోండ్‌గ మారి తర్వాత గోండ్‌గ మారిందన్నారు. క,గ, అనేవి ఒకే స్వరము నుండి వచ్చినవి. గోటూల్‌ఘర్ అనే పదం కోటూల్ ఘర్ నుండి వచ్చి వుంటుందనే అర్థంలో వివరించారు. కాని ఇది కూడా సరియైన నిర్వచనం కాదనిపిస్తుంది.

గోండులు తమని కోయ్ లేక కోయ్‌తూర్ అని, ఖోండులుకూ, అని చెప్పుకుంటారని 'కూ' అనేది కోయకు, కోయ్ అనేది గోండ్‌కు సంబంధమున్నదని నిర్ధారిస్తే తెలుగు ప్రజలే ఖోండులను గోండు లేక కోండ్ అని పిలుస్తుంటారని కనుకనే గోండ్ అనేది కోయ్ నుండి వచ్చినదని గ్రియర్సన్ అనే పరిశోధకుడు అన్నారు. "గోండులు వారి సొంత కులము పేరు కోయితూర్ లేక కోయ్ అని చెప్పుకుంటారు. గోండు అనే పేరు హిందువు గాని ముస్లీములు గాని పెట్టి యుంటార"[12] ని రూసుల్ అన్నారు.

ఒక్కో జాతికి, లేక ఒక్కో తెగకి మతాన్ని బట్టి ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క రకమైన ఆచారం ఉంటుంది. ఈ ఆచారాలు జాతి పుట్టినప్పటి నుంచి మొదలై వాళ్ళ వెన్నంటి వస్తున్నట్లు తెలుస్తోంది. వాళ్ళ నమ్మకాలు, వాళ్ళ జీవన విధానం ఈ ఆచారాలకు మూల కారణాలుగా కనిపిస్తాయి. ఇది మన దేశంలోనే గాక ప్రపంచంలోని అన్ని దేశాలలో కన్పిస్తున్నాయి. గోండు జాతి వారు తమదంటూ ఒక ప్రత్యేకమైన పద్ధతులలో ఆచారాలను అనుసరిస్తున్నారు.

మారుతున్న సమాజాన్ని దృష్టిలో ఉంచుకొని కొంత మంది కొన్ని ఆచారాలు విడిచిపెట్టినా, అడవుల్లో నివసించే గోండులు మాత్రం వాటిని విడవడం లేదు. గోండుల పుట్టుక, వివాహం, పండుగలు, మరణం మొదలైన అంశాలు 'అడవిలో వెన్నెల' కథల్లో ఎలా చోటుచేసుకున్నాయో చూసి, వాటిని గిరిజన జీవితాలతో సమన్వయించే ప్రయత్నం చేస్తాను.



## పుట్టుక గురించిన సాంప్రదాయాలు – గోండులు

సృష్టిలో కెల్లా మానవ జన్మ విశిష్టమైందని మానవ శాస్త్రవేత్తలు అంటున్నారు. తల్లి గర్భంలో తొమ్మిది మాసాలు నిండిన తర్వాతే శిశువు జన్మిస్తాడు. శిశువు జన్మించినపుడు గోండు ప్రజలు పాటించే ఆచారాలు ఎంతో ఉన్నతమైనవిగా కన్పిస్తాయి. "శిశువు తల్లి గర్భం నుండి బయటి ప్రపంచంలో అడుగుపెట్టినప్పుడు, శిశువును శుభ్రంగా కడిగిన తరువాత, తల్లి కొరకు మరియు శిశువు కొరకు ఇంటి ముందరకాని, దొడ్డిలో కాని, స్నానాల కొరకు చిన్న గుంటను ఏర్పాటుచేస్తారు. దానిపై తునికి చెట్టు కట్టెలు, జీడి కట్టెలు, వేపకట్టెలు వేస్తారు.

ప్రతిరోజు శిశువు మరియు తల్లికి అక్కడే స్నానం చేయిస్తారు. అదే రోజు ఇంటి గుమ్మం ముందు తునికి, జీడి, వేప కట్టెలను ఉంచుట ఆచారమే అయిన వారికి తెలియని విజ్ఞానం అందులో దాగి ఉన్నది. వేప, జీడివలన క్రిమి, కీటకాలు రావడానికి ఆస్కారం లేదు. కాని వీరు ఆచారంగా వాటిని వాడతారు. అలాగే బాలింతకు ప్రతిరోజు స్నానం చేయించే సమయంలో తక్కేడు, ఆయిలు, చెట్లు ఆకులను నీటిలో వేడి చేసి స్నానాలు చేయిస్తారు. వాస్తవానికి ఆయుర్వేదపరంగా శరీరంలోని నొప్పులను తగ్గించే శక్తి ఈ చెట్లకు కలద"[13]ని మేస్రం మనోహర్ 'గోండు సంస్కృతి' గ్రంథంలో గోండుల జననం గురించి వివరించారు.

స్త్రీ ప్రసవానికి ముందే మంత్రసానిని పిలుస్తారు. మంత్రసాని వచ్చి పురుడు పోస్తుంది. శిశువు జన్మించిన వెంటనే బొడ్డు కోస్తుంది. ఒక చాటలో సోలెడు జొన్నలు పోసి ఆ జొన్నలలో శిశువుని పండుకోబెట్టి 'నీకా' 'నాకా' అంటుంది మంత్ర సాని. ప్రసవించిన స్త్రీ నాకే అంటుంది. మంత్రసాని తల్లి చేతిలో బొడ్డును పెట్టి ఆ తరువాత తండ్రి చేతిలో పెడుతుంది.

శిశువు జన్మించిన మూడు లేక నాలుగు వారాల తర్వాత పేరు పెట్టుకుంటారు. కాని పెట్టిన పేర్లు శాశ్వతంగా ఉండవు. ఎందువల్ల అంటే గ్రామ ప్రజలు ఆ పిల్లవాని శరీర అవయవాలను బట్టి, నడవడికను బట్టి మరొక పేరు పెట్టి పిలుస్తారు. 'అడవిలో వెన్నెల' కథల్లో ఇటువంటి పేర్లు కన్పిస్తాయి. 'గంగారం' ని ముద్దుగా 'గన్నూ' అని పిలువడం 'నిర్ణయం' కథలో చూడవచ్చు. ఇంకా రంగును బట్టి కూడా పేర్లు పెట్టడం వీరి ఆచారం.

## పెళ్ళిళ్లు - గోండుల సంస్కృతి

పెళ్ళంటే నూరేళ్ల పంట అనేది సామెత. జీవితంలో పెళ్ళి అనేది ప్రముఖ స్థానం వహిస్తుంది. పెళ్ళి చేసుకున్న వారిని పిల్లా పాపలతో కలకాలం నూరేండ్లు చల్లగా వుండమని పెద్దలు దీవిస్తూ ఉంటారు. ఇది జాతిని బట్టి, ప్రాంతాన్ని బట్టి, దేశాన్ని బట్టి రకరకాలుగా జరుపుకుంటు ఉంటారు. ఇది సాంఘిక వ్యవస్థకు అనుకూలంగా నిర్వహిస్తుంటారు. ఒక పురుషునికి ఒక స్త్రీతోగాని, లేక ఒకే పురుషునికి అనేక మంది స్త్రీలతో గాని ఆచారం వల్ల, చట్టం వల్ల ఆమోదించబడిన సంబంధమే వివాహంగా గోండులు భావిస్తున్నారు.

గోండు ధర్మంలో వివాహానికి ఎంతో ప్రాధాన్యత ఉంది. వివాహ పద్ధతులు, ఆచారాలు చాలా సాంప్రదాయబద్ధంగా ఉంటాయి. పూర్వకాలంలో దాదాపు 8,10 రోజుల వరకు వివాహ సంబరాలు జరుపుకునేవారు. కాని ప్రస్తుత కాలంలో ఆ విధానం లేదు. గోండుల వివాహ పద్ధతులు చాలా రకాలుగా వుంటాయి. అవి 1. రాక్షస వివాహం 2. గాంధర్వ వివాహం 3. పరస్పర అవగాహన వివాహం 4. మార్పిడి వివాహం 5. ఇల్లరిక వివాహం 6. వితంతు వివాహం 7. కన్యాశుల్క వివాహం.

అయితే అడవిలో వెన్నెల కథలో లంకిబాయి ఇష్టపడిన ప్రియుని ఇంటికి చెరిపోతుంది. "పెళ్ళయితే ఛాతీమీద వేరే ఆచ్ఛాదన లేకుండా కొంగు కప్పుకొని వుండడం ఆ గోండుల ఆనవాయితీ. తాను వలచిన ప్రియుని యింటికి వచ్చి చేరిపోవడం ఇల్లు చొచ్చుడుగా వ్యవహరింప బడుతుంది. ఇక మళ్ళీ పెళ్ళితంతు ప్రత్యేకంగా ఉండదు[14]". బహుశా దీన్నే పరస్పర అవగాహనా వివాహంగా వాళ్ళు భావిస్తూ వుండచ్చు. అదే విధంగా "పెళ్ళి కావాలి" కథలో కన్యాశుల్కం ఇచ్చే వివాహం కన్పిస్తుంది. వివాహ పద్ధతుల్లో మాత్రం క్రమం తప్పకుండా ఆచార సంప్రదాయాలను పాటిస్తారు.

## గోండుల పండుగలు

గిరిజనుల పండుగలు ప్రకృతిలో వచ్చే మార్పులను బట్టి, పంటలకు అనుగుణంగా రూపొందించుకొన్నవిగా కనిపిస్తాయి. 'అడవిలో వెన్నెల' కథల్లో పండుగలను చూసినట్లయితే వారు పండుగ వర్గీకరణ చేయలేదు కాని, గోండులు నిర్వహించే పూజలను బట్టి మూడు రకాలుగా వర్గీకరించవచ్చు. అవి 1. ఆకాడి



పండుగ. 2. పొలాల పండుగ 3. పెర్సాపేన్‌పండుగ.

వర్షారంభమైన తర్వాత నేలపైన పచ్చని గడ్డి మొలచి ప్రకృతి శోభాయమానంగా కనిపించినప్పుడు మాత్రమే ఆకాడి పండుగ చేస్తారు. తర్వాత దుక్కి దున్నిన రోజు నుంచి పంట చేతికి వచ్చేంతవరకు కోళ్ళను, మేకలను బలియిస్తూనే వుంటారు. దీనిని పొలాల పండుగ అని అంటారు.

వర్షాలు పడాలని పెర్సాపేన్ అనే దేవుడ్ని ఊరి అవతల గట్టున రకరకాలైన జెండాలతో పూజించి, నైవేద్యం వండి దేవుని ముందుపెట్టి, నృత్యాలు చేసి వివిధ రకాలైన పూజాలు నిర్వహిస్తారు. ఇటువంటి పండుగను 'పెర్సాపేన్ పండుగ' అంటారు. అయితే గోండు ఆచారం ప్రకారం 'పెర్సాపేన్' అంటే కులదేవుడు అని అర్థం.

పై చెప్పిన పండుగలు 'కాయిదా' 'అడవిలో వెన్నెల' 'జెండా' కథల్లో కనిపిస్తాయి. ఈ పండుగల ముసుగులో గోండులు అనేక రకాలుగా నష్టపోతున్నారు. పండుగల కోసం షావుకారి దగ్గర అప్పు చేయడం, చివరికి అప్పు తీర్చక వాళ్ళ దగ్గరే కూలీలుగా మారడం పై కథలో జరుగుతుంది.

## గోండుల మరణాలు

జీవితం ఒక పడవ ప్రయాణం లాంటిది. సముద్రంలోని పడవ అనేక ఆటుపోట్లకు గురై మధ్యలో మునిగిపోవుటం లేదా గమ్యం చేరుటం జరుగుతుంది. మన జీవితంలో జననం ప్రారంభ దశ. మరణం అంతిమ దశ. ఈ రెంటికి మధ్య ఉన్న కాలం మనిషి పడవ వలె అనేక కష్ట సుఖాలను గురౌతుంటాడు. గోండు ప్రజల మరణాల గురించి "మరణించిన వారికి చేసే అంత్య క్రియలు ప్రత్యేక ఆచారాలతో నిర్వహిస్తారు. సాధారణంగా వీరు ఖననం చేస్తారు. అయితే మరి కొందరు దహన సంస్కరణ కూడా చేస్తారు. దహనం చేసిన వారి కర్మకాండ అదే రోజు లేక మూడు రోజులకు చేస్తారు. ఖననము చేసిన వారి యొక్క కర్మకాండ అయిదు రోజుల తరువాత చేస్తార"[15]ని గిరిజన ఆచార వ్యవహారాల గురించి పరిశోధన చేసిన మేస్రం మనోహర్ గారు అంటారు.

కర్మకాండ అయిన రాత్రి వారి పేరు మీద పాటలు పాడతారు. "అడవిలో వెన్నెల" కథల్లో కూడా ఇటువంటివి కన్పిస్తాయి. ఉదాహరణకు "రక్తపింజెర"

కథలో చూసినట్లయితే గోండులు విషాదంగా నృత్యం చేస్తూ పాడుతుంటారు. చనిపోయిన తరువాత అట్లా చేయడం కాయిదా"[16]. అన్ని పనులయిన తర్వాత వారు ఏ జన్మ నెత్తినారో అని చూస్తారు. ఇటువంటి సంప్రదాయం కేవలం గిరిజనుల్లో మాత్రమే వుంది. తర్వాత వాళ్ళ మనసుకు శాంతి చేకూరాలని వివిధ రకాలైన పూజలు చేస్తారు. చివరికి పెద్ద దేవుని పూజతో ఈ కార్యక్రమం ముగిస్తుంది. ఇవన్నీ ఈ కథల్లో కన్పిస్తాయి.

## అడవిలో వెన్నెల కథలు – భిన్న గిరిజన తెగల జీవితాలు

"మంచి జీవితాన్ని జీవించడం ఎంత కష్టమో, మంచి జీవిత చరిత్రను రాయడం కూడా అంతే కష్టం"[17] అంటారు సుప్రసిద్ధ జీవిత చరిత్రకారుడు లిట్టన్ స్ట్రాచీ.

ఉగాదులు గాని, ఉషస్సులు గాని లేని అడవుల్లో గిరిజన గూడేల మధ్య తిరిగి, వాళ్ళ జీవితాల్లోని కష్టనష్టాలు స్వయాన చవిచూసి ఈ రచయితలు కథలు రాసినట్లుగా బోధపడుతోంది. కె.వి.ఆర్. అడవిలో వెన్నెలకు రాసిన ముందుమాటలో "రక్త సిక్త గీతికలు అని తామే అంటున్న రచనలు నిజానికి గీతికలు కావు. గీతికల్లో అనుభూతి సాంద్రత మాత్రమే వుండగా దాన్ని అధిగమించి అనుభవ ప్రగాఢత ఎక్కువై యివి కథలనిస్తూ కూడా కథల లక్షణాలను వదిలించుకుపోయాయి... ప్రజలే నిజమైన విప్లవ కారులని చాటుతాయి ఈ పోరాట కథలు"[18]. బతుకు తెరవు, ఆరాటాలూ, కష్టాలూ, కన్నీళ్ళూ, దాన్ని సాధించేందుకు గల గుండె నిబ్బరం, గట్టి నిర్ణయం, సాహసం వంటి వస్తువులని గ్రహించి కథలుగా మన ముందుంచారు.

'గిరిజనుల జీవితమంటే వారి ఆలోచనా విధానం, సమస్యలు, ఆచారాలు, సంప్రదాయాలు, కట్టుబాట్లు, అమాయకత్వం, గుంపు జీవనం, ఉత్సాహాలు, భాష, వేషధారణ, వారిదైన సంస్కృతి, అడవితో పెనవేసుకున్న దైనందిన జీవన వ్యవహారాలన్నీ కలిస్తే గిరిజన జీవితం అవుతుంది. ఈ జీవితాన్ని 'అడవిలో వెన్నెల' కథల్లో పలు కోణాల్లో ఉద్యమించే క్రమంలో చిత్రించారు. ఉద్యమకారులు ప్రజల పట్ల నిబద్ధతతో వారి జీవితాన్ని అధ్యయనం చేసిన క్రమం, విప్లవ రచయితలు ఆదివాసీల పట్ల అపారమైన గౌరవంతో వారి గురించి కథల్లో నిక్షిప్తం చేసిన తీరు అందరికీ ఆదర్శనీయం.



## గోండుల ఉనికి

భారతదేశంలో గిరిజన తెగల్లో ప్రధానంగా చెప్పుకోదగ్గ తెగ గోండు. అత్యంత పురాతన భూమిగా గోండ్వానా భూమిని చరిత్రకారులు చెప్తుంటారు. "మధ్య భారత దేశములో సాత్పురా వింధ్య పర్వత శ్రేణిలో నర్మదా, గోదావరి, పెన్న, నదులమధ్య యిటు దక్షిణ భారతదేశం వరకు గోండ్వానా రాజ్యాలను స్థాపించి గోండి సంస్కృతి సంప్రదాయాలను పంచిన భూమి గోండ్వానా భూమి. విదేశీయుల రాక వలన తమ ఉనికిని పేరును కూడ కోల్పోయిన"[19] దని అంటారు మనోహర్. వీరు ఆంధ్ర ప్రదేశ్ పలు ప్రాంతాల్లో జీవిస్తున్నారు. గోండులు యాభైకి పైగా ఉపతెగలుగా చీలిపోయి దేశవ్యాప్తంగా ఉన్నారు. గోండులు తమను తాము పరిచయం చేసుకునేటప్పుడు గోండులుగా చెప్పుకోరు. ఉపతెగ పేరుతో తమను తాము పరిచయం చేసుకుంటారు.

## గోండుల భాష

దేశ వ్యాప్తంగా వుండే గిరిజనుల భాషకు లిపిలేదు. లిపి ప్రయత్నాలు జరుగుతున్నాయి. భాష లేకుంటే వ్యక్తి జీవించలేడు. ఆ భాషలను ప్రభుత్వం గుర్తించినా, గుర్తించకపోయిన వాళ్ళలో ఆ భాష ప్రత్యేకతను కల్గి ఉంటుంది. ప్రస్తుతం గోండులు సంప్రదాయ పద్ధతుల్లోనే తమ గోండి భాషను మాట్లాడుకుంటున్నారు. ఇతర భాషలు ఉన్నా వాటిని మాట్లాడడానికి నేర్చుకోక తప్పేట్లేదు. అందుకే తమ భాష అయితే, వారసత్వంగా వస్తుందని భావిస్తున్నారు.

## కోయల ఉనికి

గిరిజనుల్లో అభివృద్ధి చెందిన తెగల్లో 'కోయ' ఒకటి. కోయలు ప్రదానంగా పోడు వ్యవసాయమే చేస్తారు. చెంచులు, యానాదులవలె కాకుండా అభివృద్ధి సాధించే దశలోనే ఉన్నారు. వీరిని నూతన శిలా యుగ జనసమూహంగా చెప్పొచ్చు. ఆంధ్ర దేశంలోని ఈశాన్య ప్రాంతంలో నివసిస్తున్న వీరు, ఆహార సేకరణలో ఒక ప్రత్యేకతను కల్గి వుంటారు. కుదురు తెగలుగా ఏర్పడి నియమ నిబంధనలు, ఆచారాలు, సంప్రదాయాలను పాటిస్తారు. గిరిజనులపై కృషి చేసిన సత్యనారాయణ గారు అన్నట్లు "కోయలు గోదావరికి ఇరు వైపుల ఇంద్రావతీ సంగమం ప్రాంతం నుంచి ఖమ్మం మెట్టు వరకూ ఉత్తరాన బస్తరు, విశాఖ జిల్లాలో మలక నగరి వరకూ వ్యాపించి వున్నారు"[20].

## కోయల భాష

ఆంధ్ర రాష్ట్ర వ్యాప్తంగా కోయలు విస్తరించిఉన్నారు. వారు నివసించే ప్రాంతాల్లో తప్పకుండా కోయ భాషను మాత్రమే మట్లాడుతున్నారు. ఆంధ్ర దేశం లోతట్టు ప్రాంతాలకు వలస వచ్చిన కోయలు కోయ భాషను మరిచి తెలుగు భాషనే వ్యవహరిస్తున్న వారు కూడా ఉన్నారు. "ప్రస్తుత కాలంలో అధిక సంఖ్యలో 'కోయలు' తమ భాషను మరిచిపోయి తెలుగును యాసతో మాట్లాడుతున్నా"రని పరిశోధకుల అభిప్రాయం. వారి భాష గురించిన ప్రస్తావన అంతర్లీనంగా ఉంది.

'అడవిలో వెన్నెల' కథలు గోండు గిరిజనుల గురించిన కథలు. సనాతన ఆచారాల వల్ల నాటు వైద్యాన్నే నమ్ముకున్నారని, దానివల్లే ప్రాణాలను పోగొట్టుకున్నారని 'రక్తపింజెర' కథలో గోండుల జీవితాన్ని వర్ణించారు. అలాగే తమకు అండగావుంటున్న నక్సలైట్లను కాపాడడానికి 'కోయ' తెగకు చెందిన యువతి ఎంతో సమయ స్ఫూర్తిని చూపిందని వర్ణించిన కథ 'గంగజిమ్మ'. ఇలా కథల్లో గోండులు, కోయలు, నక్సలైట్లకు సహకరించిన విధానం కూడా చాలా కథల్లో వివరించారు. ప్రభుత్వాధికారులు, భూస్వాములు కుమ్మక్కై గిరిజన తెగలను అణిచివేయడానికి ప్రయత్నిస్తున్నారనీ, ఆ పరిస్థితిలో అనివార్యమైన స్థితిలో గిరిజనులు పోరాటాల్లో పాల్గొనాల్సి వస్తోందని రచయితలు ఆ కథల్లో చెప్పే ప్రయత్నం చేశారు.

## అడవిలో వెన్నెల కథలు-కథకులు

'అడవిలో వెన్నెల' కథల సంపుటి ఉద్యమకారులు ఆదివాసులను వెతుక్కుంటూ మైదాన ప్రాంతాల నుండి అడవుల్లోకి వెళ్లిన క్రమాన్ని, ఆదివాసీల హృదయాలను చూరగొన్న తీరును, గిరిజనులు తమ సమస్యల కోసం చైతన్యంతో ముందుకు కదిలిన తీరును అందుకు ఉద్యమకారులు ఇచ్చిన నైతిక ధైర్యం, కష్టాల్లో, నిర్బంధాల్లో ఉద్యమకారులు గిరిజనులకు అండగా నిలిచి ప్రాణత్యాగాలు చేసిన చరిత్రను రికార్డు చేసింది. ప్రజల కోసం ప్రాణాలు ఇవ్వడానికి సిద్ధపడిన ఉద్యమకారులు దీర్ఘకాలిక విప్లవ లక్ష్యంతో అటవీ ప్రాంతాలకు వెళ్ళి అక్కడి ప్రజలను అధ్యయనం చేసిన తీరు, అర్థం చేసుకున్న తీరు, వారిని ఉద్యమాల్లోకి కదిలించిన తీరు, ఉద్యమంలో కలిసి వచ్చిన ఆదివాసీ తెగలు, వారి బతుకు పోరాటాలు ఈ కథల సంపుటిలో అపూర్వంగా చిత్రించారు. ప్రభుత్వాలు



సమస్యలను పరిష్కరించే బదులు నిర్బంధాలను ప్రయోగించి ఆదివాసీలను అణచివేసే క్రమాలను తీసుకుంటున్న తీరును చిత్రించారు. ఇలా ఈ కథల సంపుటి ఆదివాసీ ఉద్యమాల్లో కలిసి వచ్చిన శ్రేణులను, వాటికి నాయకత్వం వహించిన ఉద్యమకారులను రికార్డు చేసింది. ఇదొక సామాజిక చరిత్ర. ఈ చరిత్రకు, ఉద్యమాలకు దశాబ్దాల ఉద్యమాల నేపథ్యం ఉంది.

## వామపక్ష సాహిత్యం

భూమి కోసం, భుక్తి కోసం, ఈ దేశ విముక్తి కోసం, కార్మికవర్గ నాయకత్వంలో సోషలిస్ట్, నూతన ప్రజాస్వామిక విప్లవం రావాలని ఉద్యమించే వామపక్ష ఉద్యమాలు తన వెంట ఎంతో సాహిత్యాన్ని సృష్టించాయి. భారతీయ సాహిత్యంలో తన ప్రత్యేకతను నిలబెట్టుకున్నాయి. సాహిత్య విలువలను, దృక్పథాన్ని, రచయితల, కళాకారుల కర్తవ్యాన్ని పునర్‌నిర్వచించాయి. సాహిత్యం, కళలు కాలక్షేపం కోసం కాదని, కేవలం వినోదం కోసంగానీ, పాలకవర్గాల కోసం గానీ కాదని అవి ప్రజల కోసం సృష్టించబడాలని ప్రజల జీవితం, సంస్కృతి సాహిత్యంలో ప్రతిఫలించాలని వామపక్ష ఉద్యమాలు సాహిత్యంలో సైద్ధాంతిక పోరాటం చేశాయి. సాహిత్యాన్ని, కళలను మలుపు తిప్పాయి. అలా ప్రపంచ వ్యాప్తంగా వామపక్ష భావజాలంతో సాహిత్యం కళలు విస్తరించాయి. ప్రధాన సాహిత్యంగా వ్యాప్తి చెందాయి.

భారతదేశంలో కూడా 1910 నుండి వామపక్ష భావజాలంతో ప్రజాపక్షం వహించి ప్రజలే కథా వస్తువులుగా సాహిత్యం, కళలు వేగం పుంజుకున్నాయి. ప్రేమ్‌చంద్, కిషన్ చందర్, సాదత్ హసన్‌మంటో వంటి మహా రచయితలు సాహిత్యాన్ని మలుపు తిప్పారు. అలా అభ్యుదయ రచయితల సంఘం (అరసం) ఏర్పాటు చేసి అఖిల భారత వ్యవస్థాపక అధ్యక్షులుగా ప్రేమ్‌చంద్ సాహిత్యానికి మార్గదర్శనం చేశారు. సంతాల్ గిరిజనుల నక్సల్‌బరీ ఉద్యమం 1967లో ప్రారంభమైంది. 1968లో శ్రీకాకుళం గిరిజనుల ఉద్యమం సాగింది. ఈ నేపథ్యంలో విప్లవ రచయితల సంఘం 1970లో ఏర్పడింది. జననాట్య మండలి కళా రంగంలో రూపుదిద్దుకొని విస్తరించింది.

## రాష్ట్రాల ఏర్పాటులో ఆదివాసులకు జరిగిన అన్యాయం

దేశంలో రాష్ట్రాల ఏర్పాటు ఆదివాసీ సమాజాలకు అనువుగా జరగలేదు.

మైదాన ప్రాంత, పట్టణ, నగరాల ప్రజలకు అనువుగా అడవులను, ఆదివాసులను సరిహద్దు ప్రాంతాలుగా ఒకే సమాజానికి చెందిన వారిని ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, రాష్ట్రాల్లోకి విభజించారు.

ఈ ఆదివాసీ ప్రాంతాలను కలిపి గోండ్వానా రాష్ట్రం ఏర్పర్చి వుంటే వారి అభివృద్ధి ఇతర రాష్ట్రాల్లాగే ముందుకు సాగి వుండేది. నాగపూర్, చంద్రపూర్, బలార్షా, ఆదిలాబాద్, గడ్చిరోలి, సిరొంచ, బస్తర్ తదితర ప్రాంతాలను కలుపుకొని గోండ్వానా రాజ్యం సుమారు 350 ఏళ్లకు పైగా కొనసాగింది. కాకతీయ సామ్రాజ్యం కన్నా వందేళ్ల ముందు నుండి గోండ్వానా రాజ్యాలు, గోండ్వానా రాజ్య వంశాల చరిత్ర గురించి ఇటీవల ఆదిలాబాద్ ఉపాధ్యాయుడు మేస్రం మనోహర్ ఒక పుస్తకం వెలువరించారు. ఆ పుస్తకం గోండ్వానా రాజ్య అస్తిత్వాన్ని, ప్రత్యేకతను, గోండు రాజరికాలను, వారి సంస్కృతిని, పరిపాలనా విధానాలను విస్తృతంగా వివరిస్తుంది. చాలాకాలంగా ఆదివాసీలు తమ ప్రాంతాలతో ప్రత్యేక రాష్ట్రాలు ఏర్పాటు చేయాలని డిమాండ్ చేస్తూనే వున్నారు. మధ్యప్రదేశ్, ఛత్తీస్‌గఢ్, మహారాష్ట్ర, ఒడిసా, ఆంధ్రప్రదేశ్‌లకు చెందిన దాదాపు 42 జిల్లాల్లో గోండు ఆదివాసీ (కోయతూర్) ప్రజలు నివసిస్తున్నారు. వీరు తమకంటూ గోండ్వానా రాష్ట్రం కావాలని గత ఆరు దశాబ్దాలుగా డిమాండ్ చేస్తున్నారు. 1956లో భాషా ప్రాతిపదికన రాష్ట్రాలను విభజించినప్పటికీ 70 లక్షల గోండు, కోయ ఆదివాసీ ప్రజలను పలు రాష్ట్రాలలోకి సరిహద్దులుగా విడగొట్టారు. విభజించారు. గోండులకు, కోయలకు ఒక రాష్ట్రం అంటూ లేకుండా చేశారు.[21] కాల క్రమంలో వారిని రెండో శ్రేణి పౌరుల కన్నా హీనంగా బానిసల్లాగా మార్చిన క్రమం విదేశీ పాలనలో స్వాతంత్ర్యానంతరం కూడా కొనసాగడం ఈ దేశ ప్రజలు ఎదుర్కొంటున్న విషాదాల్లో ఒకటి.

## కథల నేపథ్యం

ఎమర్జన్సీ తర్వాత కేంద్రంలో 1977లో జనతా పార్టీ అధికారంలోకి వచ్చింది. నిర్బంధాలను ఎత్తివేసి స్వేచ్ఛాయుత వాతావరణం పెరగడంతో చాలాకాలంగా నివురుగప్పిన నిప్పులా కొనసాగుతున్న ప్రజా ఉద్యమాలు, ప్రజల ఆశలు, చైతన్యం ఒక్కసారిగా దేశమంతటా పెల్లుబికాయి. ఎమర్జన్సీ తర్వాత ఉత్తర తెలంగాణా ప్రాంతంలో నక్సల్‌బరీ, శ్రీకాకుళం, బీహార్, ఉత్తర ప్రదేశ్ పోరాటాల స్ఫూర్తితో విప్లవ ఉద్యమం వేగం పుంజుకుంది.



## గ్రామాలకు తరలండి కాంపెయిన్

కాలేజీ విద్యార్థులను ఉద్యమాల్లోకి సమీకరించి గ్రామాలకు తరలండి అనే పిలుపు ఇచ్చింది. విద్యార్థులు, యువకులు గ్రామాలకు తరలి ప్రజలను అధ్యయనం చేసి ప్రజలను చైతన్య పరిచే క్రమంలో తాము చైతన్యం పొందారు. దున్నే వాడికే భూమి నినాదంగా వ్యవసాయ విప్లవం ఇరుసుగా కార్మిక, కర్షక, ఉద్యోగ, ఉపాధ్యాయ, మేథో వర్గాల సమిష్టి కృషితో నూతన ప్రజాస్వామిక విప్లవం తీసుకురావాలని గ్రామాలను విముక్తం చేసి పట్టణాలకు విస్తరించాలని విప్లవోద్యమాలు భావించాయి. అలా విద్యార్థులు, యువకులు, ఉద్యమకారులు ప్రజల్లోకి చొచ్చుకుపోయి ప్రజల సమస్యలను అధ్యయనం చేసి వాటి పరిష్కారానికి ఉద్యమించారు. ఉత్తర తెలంగాణలో ముఖ్యంగా కరీంనగర్ జిల్లాలో రైతాంగ ఉద్యమాలు, ఉవ్వెత్తున ఎగిసాయి.

## జగిత్యాల జైత్రయాత్ర

1978 జులైలో జగిత్యాల జైత్రయాత్ర భారతదేశ ఉద్యమాల చరిత్రలో ఒక మైలురాయి. అక్కడి నుండి జైత్రయాత్ర కరీంనగర్, ఆదిలాబాద్, ఉత్తర తెలంగాణా మీదగా దండకారణ్యం ఉద్యమ లక్ష్యాలుగా విస్తరిస్తూ వచ్చాయి. పీపుల్స్ వార్ పార్టీగా రూపుదిద్దుకుంది. రాడికల్ విద్యార్థి సంఘం, రాడికల్ యువజన సంఘం, రైతు కూలీ సంఘం, తదితర ప్రజా సంఘాలు లక్షలాది మందిని సమీకరించి చైతన్య పరిచాయి. విప్లవ రచయితల సంఘం, జననాట్యమండలి, ప్రజాసాహిత్యాన్ని, కళలను, సభలను, ప్రజలను ఎంతగానో ఉత్తేజపరిచాయి.

## అటవీ ప్రాంతాలకు విస్తరించిన ఉద్యమం

కరీంనగర్ నుండి ఎదుగుతున్న ఉద్యమకారులను ఉద్యమ విస్తరణ కోసం ఆదిలాబాద్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ ప్రాంతాలకు పంపించడం జరిగింది. వాళ్ల మొదట ఉప్పు, చింతపండు అమ్మే వ్యాపారుల్లాగా, మేకల బేరగాళ్లుగా ఆదివాసులతో సంబంధాలు పెంచుకున్నారు. ప్రత్యక్ష పరిచయాలతో వారి జీవితాలను పరిశీలించి, విశ్లేషించారు. ఎలాంటి పోరాటాలను తీసుకోవాలో, ఏ సమస్యలపై ప్రజలను సమీకరించాలో అధ్యయనం చేశారు. తునికాకు కూలీల పెంపుదల ఆవశ్యకతను గుర్తించారు. ఫారెస్ట్ కాంట్రాక్టర్ల దోపిడీ, దౌర్జన్యాలను

గమనించారు. గిరిజనుల్లో మగవారు ఒకరికన్నా ఎక్కువ మంది మహిళల్ని పెళ్ళి చేసుకోవడాన్ని, వారు సేకరించి తెస్తే తినడాన్ని కూడా గమనించారు. అసలు ఆహారమే దొరకక పోవడం, వారు సేకరించే బంక, తేనె, కాచు, తునికాకు, చింతపండు, సున్నపురాయి మొదలైన వాటిని మైదాన ప్రాంతాల వాళ్లు తక్కువ ధరకు కొని మోసం చేయడాన్ని, అతి తక్కువ ధర గల వస్తువులను ఎన్నో రెట్ల ఎక్కువ ధరకు అమ్మి దోపిడీ చేయడాన్ని కళ్ళారా చూశారు. తుడుందెబ్బ అనేది గోండు గిరిజనులను ఒకటి చేసే 'కాలింగ్‌బెల్'గా సమాచార యంత్రాంగంగా ఎలా పెంచుకున్నారో గమనించారు. అడవి జంతువుల కన్నా గిరిజనేతర మనుషులే వారికి ప్రమాదంగా మారిన క్రమాన్ని, వారి భూముల్ని గుంజుకున్న తీరుతెన్నులను పరిశీలించారు. తునికాకు కూలీల పెంపుదల కోసం ఆదివాసులను కదిలించారు. ఫారెస్ట్ అధికారులను, కాంట్రాక్టర్లను హెచ్చరించారు. వాళ్ళు అన్నలను చూసి భయపడడంతో వీరు తమ మేలు కోరి వచ్చారని గమనించి మెల్లిగా వారి చేరువకు వచ్చారు. అలా గిరిజనులు, ఉద్యమకారులు సన్నిహితమయ్యారు. ఒక గిరిజన సమాజంలో దాని వెలుపలి వ్యక్తుల ప్రవేశం చాలా కష్టం. అలా ఎంతో కష్ట, నష్టాలకు ఓర్చి క్రమంగా గోండు గిరిజన సమాజంలో స్థానం సాధించుకున్నారు, అందులో భాగమయ్యారు."[22]

అలా ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ రాష్ట్రాల సరిహద్దులు చెరుపుతూ దండకారణ్యంలోకి ప్రవేశించారు. ఆనాటి దండకారణ్యం సువిశాల భూభాగాన్ని వారికి పరిచయం చేసింది. ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాల సరిహద్దు అటవీ ప్రాంతం ఉద్యమానికి నెలవుగా మారింది. కరీంనగర్-ఆదిలాబాద్ జిల్లాల రైతాంగ పోరాటం అందించిన తొలితరం నవయువకులు తమ నాయకత్వంతో సహా ఏడు దళాలుగా తయారై కొత్త ప్రాంతంలో నూతనోత్సాహం, విప్లవ పట్టుదలతో తొలి అడుగులు వేశారు. సాయుధంగా ప్రవేశించిన ఆ రైతు బిడ్డలకు, బడి పిల్లలకు ఆ అడవికి కొత్త. ముప్పై ఏళ్ల కిందా, మూడు పదులైనా నిండని ఆ ముప్పై అయిదు మంది యువకులకు అడవి కొత్త.

వారికి ఆదివాసీ జీవితాల సహచర్యం కొత్త. అడవి గూడాలు, వాటి దారులు కొత్త. వారికి ఆదివాసీ ప్రజల 'కోయ, గోండీ' భాష రాదు. కాని వారికి ప్రజలంటే ప్రాణం. కరీంనగర్-ఆదిలాబాద్ జిల్లాల భూస్వామ్య వ్యతిరేక రైతాంగ పోరాటాలు వారికి గొప్ప ప్రేరణ. ఆనాటి పోరాటాల్లోకి పెద్ద ఎత్తున ప్రజాశక్తిని కదలించిన



జననాట్యమండలి ఆట-పాటలు, వారికి శక్తినిచ్చే సాధనాలు. సుబ్బారావు, పాణిగ్రాహి, సాహు, గూడ అంజయ్య, చెరబండరాజు, గద్దర్, సంజీవ్, పద్మ, సంధ్య, వంగపండు, దివాకర్ తదితరుల పాటలను, వరవరరావు, ఆకుల రాఘవయ్య, విమల్, శాంతిసాగర్, లింగమూర్తి, వంటి వారి ప్రసంగాలను గుర్తు చేసుకుంటూ ముందుకు సాగారు. అత్యంత ఉత్సాహంతో జనం వద్దకు చేరి వారి మంచీ-చెడ్డలను తెలుసుకుంటున్న క్రమంలో నాటి చంద్రపూర్ జిల్లాలోని సిరొంచ తాలుకా ముయ్యబోయిన పేట గ్రామ శివార్లలో 2-11-1980న పెద్ది శంకర్ ఎన్‌కౌంటర్‌లో చనిపోయారు. నిర్బంధాలను ఎదుర్కొంటూ ఉద్యమం ముందుకే సాగింది.[23]

## ఆదివాసీల్లో భాగమైన ఉద్యమకారులు

అలా అటవీ ప్రాంతాల్లో ఉద్యమం విస్తరించింది. ఆదిలాబాద్, గడ్‌చిరోలి, శిరొంచ, బస్తర్ జిల్లాల్లో ఆదివాసీ గోండు గిరిజనులు లక్షలాది మంది విప్లవ నాయకత్వంలో ముందుకు కదిలారు. మైదాన ప్రాంతాల్లో అన్నలు, అక్కలు పేరుతో, అటవీ ప్రాంతాల్లో పొరకల సార్లు అనే పేరుతో ప్రాచుర్యం పొందారు. సింగరేణి కార్మికుల నుండి గజ్జల గంగరాం వంటి వాళ్లు, కాంతి తుషార్ భట్టాచార్య, ఆదిలాబాద్ జిల్లాకు ఉద్యమ విస్తరణ కోసం కరీంనగర్ జిల్లా నుండి వెళ్లిన వారిలో సాహు(శనిగరం వెంకటేశ్వర్లు), నల్లా ఆదిరెడ్డి, పెద్ది శంకర్ తదితరులు వున్నారు. 1981 ఏప్రిల్ 20వ తేదీన ఇంద్రవెల్లిలో వేలాది మంది గోండు గిరిజనులతో మహాసభ జరిగింది. దానిపై కాల్పులు జరిపి అరవై మంది గిరిజనులను పొట్టన పెట్టుకున్నారు.

అలా తొలిదశలోనే ఆదివాసీ ఉద్యమం, డిమాండ్లు అణచివేతకు గురయ్యాయి. అయితే ప్రజలు ఊరుకోలేదు. ముందుకే సాగారు. వారు దండకారణ్యానికి నిర్ణయించుకున్న సరిహద్దులు విశాలమైనవి. చంద్రపూర్-కాజీపేట బ్రాడ్‌వే రైల్వే లైన్‌ను పశ్చిమాన సరిహద్దుగా పెట్టుకొని, ఉత్తరాన చంద్రపూర్ నుంచి గోందియా మీదుగా వున్న చిన్న లైనును సరిహద్దు గాను, తూర్పున రాయ్‌పూర్ నుంచి విశాఖ వెళ్లే జాతీయ రహదారిని సరిహద్దుగాను దండకారణ్య ఉద్యమ చిత్రపటాన్ని రూపొందించుకున్నారు. ఈ సరిహద్దుల మధ్య వారి కార్యకలాపాలు విస్తరించారు.

## ఆదివాసీ జీవితాల్లో తునికాకు-వెదురు

ఆదివాసీ జీవితాల్లో తునికాకు తెంపడం, వెదురు బొంగు నరకడం ద్వారా నగదు కళ్లకు కనపడేది. తునికాకు తెంపడానికి వారు ఉదయాన్నే బయల్దేరే వారు. పాములు, తేళ్లు, ఆకుతేళ్లు ఎన్నో వారి ప్రాణాలకు ముప్పుగా పరిణమించేవి. ఉదయం బయల్దేరి అడవి మృగాల భయంతో ప్రాణాలు అరచేతిలో పెట్టకొని అడవికి వెళ్లే జనాలు కాళ్లకు చెప్పులు లేకుండా, ఒంటినిండా బట్టలు లేకుండా, ఆకలితో డొక్కలు గుంజుకుపోగా జబ్బకు వెళ్లాడే బుర్రలోనుంచి బుక్కెడు అంబలి, గుక్కెడు మంచినీళ్లు తాగి కడుపు నింపుకొని మధ్యాహ్నం దాకా తునికాకు తెంపుతూ భగ, భగ మండే రోహిణి ఎండల్లో, 48 డిగ్రీల సెంటీగ్రేడ్‌లో పని చేసేవారు. ఆదివాసీలు ఎండల్లో తునికి ఆకులు తెంపుకుని తలపై బరువైన ఆకుల మూటలతో అడవి నుంచీ ఇంటికి చేరి బస్తర్‌లో అయితే 50 ఆకులు, గడ్‌చిరోలిలో అయితే 70 ఆకులు లెక్క పెట్టి కట్టలు కడతారు. సాయంత్రం తునికాకు కళ్లం వద్దకు తీసుకెళతారు.

1981లో ఒక కట్టకు మూడు పైసలు ఇవ్వడం కష్టంగా ఉండేది. గుళ్ల కట్ట, కళ్లం కట్ట అంటూ ఉచిత కట్టలు వసూలు చేసే వాళ్లు. ఇలా ఆదివాసీ ప్రజల కష్టార్జితాన్ని ఎన్నెన్ని విధాల టేకేదార్లు, కల్లెదార్లు, గిర్దావర్లూ, అటవీశాఖ అధికారులు కొల్లగొట్టే వాళ్లు. ఉద్యమ రచయితలు ఈ విషయాలను పాటల్లో పొందుపరిచి ఆదివాసీలను చైతన్య పర్చారు. తునికాకు సేకరణ కూలీ రేటు పెరిగినంత మాత్రాన శ్రమజీవుల జీవితాల్లో మౌలిక మార్పులేం రావని మొత్తం సమాజం మారడానికి ఉద్యమించాలని ఆ పాటల్లో సూచించారు.[24] వీటితో పాటు వెదురుబొంగు ఫారెస్ట్ ప్లాంటేషన్ల గురించి 'అడవిలో వెన్నెల' కథా సంపుటిలో చిత్రించారు.

తునికాకు సేకరణ కాలం పూర్తయిన కొద్ది మాసాలకు వెదురు పనులతో అడవంతా ప్రతిధ్వనిస్తుంది. దండకారణ్యంలోనూ ఆ పరిసర అడవుల్లోనూ చెప్పుకోతగిన మోతాదులో వెదురు లభిస్తుంది. కెరిమెరి కొండల నుంచి (నిర్మల్-ఆదిలాబాద్), మన్యం (తూర్పు కనుమలు) వరకు విస్తారంగా వెదురు లభిస్తుంది. ఈ వెదురులో అధిక భాగం కాగితపు ముడి సరుకుగా పేపర్ మిల్లుల కోసం చవకగా కొంటారు. అడవిలో జీవించే ఆదివాసులకు ఆ వెదురుపై ఏ హక్కూ



లేకపోవడం, రాయల్టీ గానీ, ప్రావిడెంట్ ఫండుగానీ లేకుండా తునికాకు, వెదురు పనులు తీసుకోవడం ద్వారా ప్రభుత్వాలు, కాంట్రాక్టర్లు పరిశ్రమలు లాభాలు సంపాదించాలనుకున్నాయి. అంతేగానీ దాని మీద వచ్చే ఆదాయాన్ని వారికే కేటాయిస్తూ దానికి తోడుగా మరింత బడ్జెట్ కేటాయించి వారికి స్కూళ్లు, కాలేజీలు, వైద్యశాలలు, సబ్సిడీపై నిత్యావసర సరుకులు, ప్రావిడెంట్ ఫండ్ ఖాతాలు, వృద్ధాప్య పెన్షన్లు, స్కాలర్‌షిప్పులు, నూతన ఉపాధి అవకాశాలు అందుకోవడానికి నైపుణ్యాల శిక్షణ మొదలైన వాటికి కృషి చేయలేకపోయింది. ఈ పని చేసి వుంటే ఆదివాసీలు ఎంతోకొంత ఎదిగి వుండే వాళ్లు. మధ్యతరగతి మేథో వర్గం, విద్యావంతులు, ఎదిగి వారి సమస్య కోసం, రాజకీయ, సామాజిక, సాధికారికత కోసం ప్రజలను శాంతియుతంగా సమీకరించి, ఉద్యమించి వుండేవారు.

1979 చివరి నుండి గత 31 ఏళ్ల ఉద్యమంలో అభివృద్ధి చెందుతున్న సాంస్కృతికోద్యమంలో పాట, ఆదివాసీ కళారూపాలు మహోన్నత పాత్ర నిర్వహించాయి. కథ, నవల, కవిత మొదలైన సాహితీ రూపాలు ఉనికిలోకి వచ్చినప్పటికీ అవి వేళ్ల మీద లెక్కపెట్టగలిగే సంఖ్యలోనే ఉన్నాయి తప్ప ఉద్యమ స్థాయికి తగిన విధంగా లేవనే చెప్పుకోవాలి. ఉద్యమం ప్రారంభమైన తర్వాత విరసం సభ్యులు తమకున్న నిబద్ధతతో కథా రచనకు పూనుకొన్నారు. ఆదివాసీల జీవితాలను, సంస్కృతిని, ఉద్యమాలను సాహిత్యీకరించారు. అలా దండకారణ్య, గిరిజన పోరాటాల గురించి ప్రత్యక్షంగా ఉద్యమానికి నాయకత్వం వహించిన సాహు (శనిగరం వెంకటేశ్వర్లు), విరసం సభ్యులు అల్లం రాజయ్య, బి.ఎస్.రాములు, పి.చంద్ తదితరులు కథలు, నవలలు రాశారు. 1983లో సాహు, అల్లం రాజయ్యల 'కొమురంభీం' నవల వెలువడింది. 1988లో రాజయ్య కలం పేరుతో రాసిన 'వసంతగీతం' నవల ప్రచురించబడింది. ఉద్యమ నాయకుడు సాధన కలం నుండి 'అడవిలో అన్నలు (సరిహద్దు)', రాగో నవలలు, పలు కథలు వెలువడ్డాయి.

ఈ క్రమంలో ఉద్యమంలో పని చేస్తూనే రచనలు చేయడాన్ని సామాజిక కర్తవ్యంగా భావించి ఆయా సాహిత్య ప్రక్రియల్లో కృషి చేసే యువతరం ఎదిగి వచ్చింది. అలా సుజాత, నిత్య, మైనా, ఫినెక్స్, జూరీ, ప్రవీణ్, లహర్, విశ్వం, తాయమ్మ కరుణ (దీప) మొదలైన వాళ్లు ఆదివాసీ జీవితాలనూ, పోరాట అనుభవాలనూ, వారితో గల అనుబంధాలనూ, అనుభూతులను వాస్తవ ఘటనల

ఆధారంగా కథలుగా మలిచారు. ఇలా వెలువడిన కథల నుండి ఆదివాసీల జీవితాలను, పరిణామాలను, ఉద్యమ పార్శ్వాలను, వైవిధ్యాలను, సంస్కృతిని ప్రతిఫలించే ఎంపిక చేసి 1990-91లో దండకారణ్య రచయితలు 'సంకెళ్లు విరుగుతున్న సవ్వడి' కథా సంకలనం ప్రచురించారు. వీటన్నిటికన్నా మొట్టమొదట 1985లో వెలువడిన కథల సంపుటి 'అడవిలో వెన్నెల'. ఇది ఆదివాసీ కథా సాహిత్యానికి గొప్ప ప్రేరణగా, మైలురాయిగా నిలిచిపోయింది. సాహిత్యంలో గిరిజన సాహిత్యం అనే ఒక కొత్త విభాగాన్ని ప్రారంభించింది.

## కథకుల పరిచయం-సాహు

'అడవిలో వెన్నెల' కథల సంపుటిలోని మొదటి తొమ్మిది కథలతో పాటు, 'మరట్ తుడుం పాయూనా' కథ రాసిన సాహు ఒక ఉద్యమ కారుడు. ఉద్యమకారులు ఆదివాసీలలో కలిసిపోయి వారి భాషను నేర్చుకున్నారు. వారి భాషలో పాటలు రాశారు. వారి జీవితాల గురించి మైదాన ప్రాంత సమాజానికి తెలియడానికి సంక్షిప్తంగా కథలుగా రాశారు. సాహు అనుకోకుండా అరెస్టయి లాకప్‌లో చిత్రహింసల పాలయినప్పటికీ ఆయనని పోలీసులు ఆదివాసీగానే భావించారు. ఉద్యమ కార్యకర్తగా గుర్తించలేకపోయారు. అంతగా ఆదివాసీల మాటను, సంస్కృతిని అలవర్చుకొని ఆదివాసీల్లో కలిసి పోయాడు సాహు. సాహు అనేక వివరాలు సేకరించి రహస్య నిర్మాణం వల్ల అనేక పరిమితులు ఎదుర్కొన్నప్పటికీ కొమరం భీం జీవితాన్ని, పోరాటాన్ని నవలగా మలిచాడు. దాన్ని అల్లం రాజయ్యను సరిచూడమని పంపితే కొన్ని చాప్టర్లు అదనంగా చేర్చాడు. అల్లం రాజయ్య, సాహుల ఉమ్మడి రచన పేరిట కొమురం భీం నవల ప్రచురించబడింది.

విరసం సభ్యుడైన సాహు రచనలపై కాకతీయ విశ్వవిద్యాలయంలో డా॥ బన్న అయిలయ్య గారి పర్యవేక్షణలో వి.రాజేశ్వర శర్మ ఎం.ఫిల్ చేశారు. సాహు ఈ విప్లవోద్యమ ఆదివాసీ సాహిత్య సృజనలో తొలి రచయిత. కరీంనగర్ జిల్లా హుజూరాబాద్ తాలూకా మాణిక్యాపూర్ గ్రామంలో పుట్టిన సాహు 1969 జై తెలంగాణ ఉద్యమంలో విద్యార్థి దశలో చురుకుగా పాల్గొన్నారు. జమ్మికుంట కాలేజీలో డిగ్రీ చేస్తున్న క్రమంలో కాలేజీ మిత్రులెందరో విప్లవకారులుగా ఎదిగారు. అందులో సాహు, కోటేశ్వరరావు, అల్లంరాజయ్య, ఆదిరెడ్డి వంటి వాళ్లు వున్నారు.



సాహు 1983లో అరెస్టయి ఆరేళ్లు జైలు జీవితం అనుభవించారు. 1990లో జైలు నుండి విడుదలయ్యారు. సాహిత్యానికి అంకితమై జీవించాలనుకున్నారు. 1993లో గుండెపోటుతో మరణించారు. సాహు తెలుగు సాహిత్యంలోని మహాశ్వేతాదేవి అని ప్రశంసలు పొందారు. సాహు ఇంటర్వ్యూలు, సాహు రచనలు అనే రెండు పుస్తకాలు వెలువడ్డాయి. సాహు 'రక్తపింజెర' కథలో రక్తపింజెర పాము కన్నా కాంట్రాక్టర్లు ఎలా ప్రమాదకారులుగా ఆదివాసీలను కాటు వేస్తున్నారో హృదయ విదారకంగా చిత్రించారు.

## అల్లం రాజయ్య

తుడుం, రగల్‌జెండా మైసివాకట్ కథలు రాసిన అల్లం రాజయ్య సుప్రసిద్ధ విప్లవ రచయిత. వంద యాభైకి కథలు, ఆరేడు నవలలు రాసి తెలుగు సాహిత్యంలో తనదంటు ప్రత్యేక స్థానం సాధించుకున్నారు. విప్లవ కథకు మొదట చెప్పే పేరు అల్లం రాజయ్య. 1974 నుండి కథలు రాసిన రాజయ్య కథలు భూమి, సృష్టికర్తలు కథా సంపుటాలు వెలువడ్డాయి. భూమిక, శ్వేతరాత్రులు, నేలతల్లి విముక్తి కోసం, విరసం, కథా కెరటాలు వంటి ఎన్నో సంకలనాల్లో వీరి కథలు చేరాయి.

ఆదిలాబాద్ జిల్లా మంచిర్యాల ఏసీసీ సిమెంట్ ఫ్యాక్టరీలో టైమ్ ఆఫీసర్‌గా పని చేసే అల్లం రాజయ్య విప్లవోద్యమాన్ని సన్నిహితంగా చూస్తూ, విశ్లేషిస్తూ, కథల్లో, నవలల్లో రికార్డు చేస్తూ వస్తున్న రచయిత. అల్లం రాజయ్య ఆదిలాబాద్ జిల్లా ఇంద్రవెల్లి సంఘటన తర్వాత జరిగిన 1984 ఆదిలాబాద్ జిల్లా సాతనాల ఆదివాసీ మహాసభల చైతన్యంపై జరిగిన నిర్బంధాలను ఎదిరించిన చరిత్రను 'రగల్‌రాజ్జెం మైసివాకట్' కథ. 'తుడుం' కథలో నిత్య నిర్బంధాలను ఎదుర్కొంటూ పోలీసుల తుపాకీ కాల్పులకు వెరవకుండా తుడుం కొట్టి గిరిజనులందరూ ఏకమై పోలీసులను తరిమి కొట్టడం చిత్రించడం జరిగింది.

## కాంతి తుషార్ భట్టాచార్య

ఉద్యమ కారుడైన కాంతి తుషార్ భట్టాచార్య ఆదిలాబాద్ జిల్లా బెల్లంపల్లి ప్రాంతం నుండి ఎదిగిన రచయిత. భట్టాచార్య కొన్నేళ్లుగా హైదరాబాద్‌లోని చర్లపల్లి జైలులో ఉంటూ కోర్టు కేసులను ఎదుర్కొంటున్నారు. 1980లో ఆయన రాసిన 'గంగజిమ్మ' కథలో నిత్య నిర్బంధంలో పోలీసుల పహారాలో బతుకుతున్న గిరిజనులకు మేమున్నామంటూ నైతిక ధైర్యాన్ని అందిస్తూ తీవ్రమైన జ్వరాల్లో

వారికి వైద్యం అందించడం కోసం ఎంతో రిస్క్ తీసుకొని ప్రజల్ని చేరిన ఉద్యమ కారుల కమిట్‌మెంట్‌ను, సాహసాన్ని తెలుపుతుంది. నిజానికి అలాంటి సమయాల్లో పార్టీ నిర్ణయం ప్రకారం సాధారణంగా వెళ్ళకూడదు. కాని మానవతా విలువలు, ఆదివాసీలతో పెనవేసుకున్న అనుబంధాలు, ముఖ్యంగా భావించిన తీరు ఇందులో కనబడుతుంది.

## బి.ఎస్.రాములు

ఇందులోని 'అడవిలో వెన్నెల' కథ రచించిన బి.ఎస్.రాములు సామాజిక తత్వవేత్తగా, రచయితగా సుప్రసిద్ధుడు. 150కి పైగా కథలు, అయిదారు నవలలతో పాటు, వందలాది సాహిత్య, సైద్ధాంతిక, తాత్విక, సామాజిక వ్యాసాలు, 60కి పైగా పుస్తకాలను వెలువరించారు. పాలు, తేనెటీగలు, స్మృతి, మమతలు-మానవ సంబంధాలు, వేపచెట్టు, బతుకుపయనం కథా సంపుటాలను ప్రచురించారు. పలు కథా సంకలనాల్లో వీరి కథలు ప్రచురించబడ్డాయి. యాభయ్యేళ్ల తెలుగు కథ తీరుతెన్నులు అధ్యయనం చేశారు. 1978 నుండి విప్లవ రాజకీయాలతో, ఉద్యమాలతో ప్రత్యక్షంగా సంబంధంలో వుంటూ విరసం, పౌరహక్కుల సంఘంలో చురుకుగా పని చేస్తూ 1984లో అరెస్టయి జైలుకు వెళ్లారు. జైలు నుండి విడుదలయ్యాక ప్రభుత్వ ఉద్యోగాన్ని వదిలి రాడికల్ యువజన సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా ఎన్నికై రహస్య జీవితంలోకి వెళ్ళి 1990లో తిరిగి బహిరంగ జీవితంలోకి వచ్చారు. 1990 నుండి బీసీ, ఎస్సీ, ఎస్టీ, మైనార్టీ సాహిత్యం, సిద్ధాంతాల కోసం కృషి చేస్తూ దళిత రచయితల, కళాకారుల, మేధావుల ఐక్యవేదిక వ్యవస్థాపక అధ్యక్షులుగా రాష్ట్రంలో సంచలనం సృష్టించారు. తెలుగు సాహిత్యాన్ని ఒక మలుపు తిప్పారు. దళిత, బహుజన సాహిత్య యుగకర్తగా ప్రసిద్ధులయ్యారు.

## పి.చంద్

'గెరిల్లా' కథ రాసిన పి.చంద్ ఆదివాసీల గురించి 15 దాకా కథలు రాశారు. 150కిపైగా కథలు, శేషగిరి, అంతర్జాతీయ శ్రామిక యోధుడు, ఒక కన్నీరు, నెత్తుటి ధార, విప్లవాగ్ని, వంటి పది దాకా నవలలు, సింగరేణి కార్మికుల సమస్యలపై అనేక వ్యాసాలు ప్రచురించారు. గోదావరిఖని సింగరేణి కార్మికులుగా జీవితం ప్రారంభించిన పి.చంద్ కార్మిక, గోపి, ఉరుగొండ యాదగిరి, మొదలైన కలం పేర్లతో కార్మిక, కర్షక, ఆదివాసీ జీవితాల గురించి రాసిన కథలు అనేక



కథా సంపుటాల్లో చేరాయి. 'సన్నజీవాలు', 'ప్రజాస్వామ్యం', 'బిర్లామందిర్', 'సింగరేణి కార్మిక కథలు', 'జులుం', 'గుమ్మన్ ఎగ్లాస్‌పూర్ గ్రామస్థులు', 'కొత్త ఎత్తు', 'మరోసారా కథ', 'కుంపటి', 'బొగ్గు దొంగ', 'నిర్వాసితులు', 'భూమి', 'తెలంగాణా తల్లి' మొదలైన కథలతో పాటు, చేనేత కార్మికులపై కూడా అనేక కథలు రాశారు. 'భూనిర్వాసితులు', 'జులుం', 'సమ్మె కథలు' కథా సంపుటాలు వెలువడ్డాయి.

## సామాజిక చరిత్ర కాలనాళిక

'అడవిలో వెన్నెల' సంకలనంలోని కథలు హిందీ, మరాఠీ, ఇంగ్లీషు, తదితర భాషల్లోకి అనువాదమయ్యాయి. ఈ కథలు ఇప్పుడు ఒక సామాజిక చరిత్ర నిక్షిప్తం చేసుకున్న శిలాఫలకాలు, కాలనాళికలు. నడుస్తున్న చరిత్రను అదే సమయంలో కథలుగా మలిచిన కథలే అడవిలో వెన్నెల కథలు. ఉద్యమ కారులకు, ఆదివాసీలకు ఉత్తేజాన్ని ఇవ్వడం, ఉద్యమం ఎలా సాగుతున్నదో బయటి ప్రపంచానికి తెలపడం లక్ష్యంగా మేము ఈ కథలో రాయడం జరిగింది. అందులో భాగంగా తెలంగాణా భాషకు ఆదివాసీ గోండు భాషకు సాహిత్య గౌరవం కలిగించాలని, ఆదివాసీ సంస్కృతి, జీవన విధానం, వారి పోరాటాలు, సమస్యలు ప్రధాన సమాజానికి తెలియాలని, తద్వారా ప్రజలు ఆదివాసీలకు మద్దతు అందించాలని భావించడం జరిగింది. ఇలా ఈ కథలు రాయడం వెనుక స్పష్టమైన కర్తవ్యం, సామాజిక ఉద్యమ లక్ష్యాలు ఇమిడి వున్నాయి. సాహిత్యంలోనే కాదు సమాజంలో, సామాజిక పరిణామాల్లో మార్పును కోరి ఈ సాహిత్యం రాయబడింది.

అందువల్ల ఇది కేవలం సాహిత్యం మాత్రమే కాదు. ఇది సామాజిక చరిత్ర పరిణామాల డాక్యుమెంటేషన్ కూడా. విప్లవోద్యమ చరిత్రను, ఆదివాసీల చరిత్ర పరిణామాలను పరిశీలించడానికి, విశ్లేషించడానికి ఈ కథలు ఒక గొప్ప రిసోర్స్. ఈ సంపుటికి కె.బాలగోపాల్, కె.వి.ఆర్. చక్కని ముందుమాటలు రాశారు. బాలగోపాల్ ఆదివాసీ సామాజిక చారిత్రక సమాజ పరిణామాలను, సంస్కృతిని ఒక పరిశోధనా వ్యాసంగా రాశారు. కొమురం భీం పోరాటం తర్వాత నైజాం ప్రభుత్వం ఆదివాసీల సమస్యలపై, పరిష్కారాలపై అధ్యయనం చేయడానికి నియమించిన హేమన్‌డార్ఫ్ పరిశోధనలను, పరిష్కారాలను వాటి పరిణామాలను, ఉద్యమం పుట్టిన నేపథ్యాన్ని కె.వి.ఆర్. విశ్లేషించారు.

## రెండవ అధ్యాయం

# అడవిలో వెన్నెల కథలు వస్తు పరిశీలన

## కథల సంక్షిప్త పరిచయం

'అడవిలో వెన్నెల' కథల సంపుటి కరీంనగర్ బుక్ ట్రస్ట్ తరఫున నాలుగో ప్రచురణగా 1985 మార్చిలో ప్రచురించబడింది. 1981 నుండి సృజన, అరుణతార, తదితర పత్రికల్లో ప్రచురించబడిన కథలనుండి ఆదివాసీ గిరిజన పోరాట కథలను ఎంపిక చేసి ఈ సంకలనంగా వెలువరించారు. ఇందులో మొత్తం 15 కథలు వున్నాయి.

| | | | |
|---|---|---|---|
| 1. | కన్నీటి కథ - నీటి కథ | సాహు | సృజన మే, జూన్ 1981 |
| 2. | పెళ్ళి కావాలి | ,, | ,, |
| 3. | కాయిదా | ,, | ,, |
| 4. | ఐదు రూపాయల కథ | ,, | ,, |
| 5. | భూమి కొరకు | ,, | ,, |
| 6. | రక్త పింజెర | ,, | సృజన ఫిబ్రవరి, 1982 |
| 7. | జెండా కథ | ,, | సృజన ఏప్రిల్, 1982 |
| 8. | నిర్ణయం | ,, | ,, |
| 9. | ఆకలి | ,, | ,, |
| 10. | అడవిలో వెన్నెల | బి.ఎస్.రాములు | అరుణతార ఆగస్టు, 1984 |
| 11. | తుడుం | అల్లం రాజయ్య | |
| 12. | మరట్ తుడుం పాయానా | సాహు | సృజన ఆగస్టు-సెప్టెంబర్, 1983 |



| | | | |
|---|---|---|---|
| 13. | రగల్ జెండా మైసివాకట్ | అల్లం రాజయ్య | |
| 14. | గంగజిమ్మ | కాంతి తుషార్ భట్టాచార్య | సృజన 1983 |
| 15. | గెరిల్లా | పి.చంద్ | |

పై కథల్లో ఒకటి నుండి తొమ్మిది కథలను, మరట్ తుడుం పాయానా కథలను సాహు రాశారు. ఇందులోని ఎక్కువ కథలు సాహు రాసినవే. 'అడవిలో వెన్నెల' కథను సామాజిక తత్వవేత్త బి.ఎస్.రాములు రాయగా, 'తుడుం', 'రగల్ జెండా మైసివాకట్' కథలను అల్లం రాజయ్య, 'గంగజిమ్మ' కథను కాంతి తుషార్ భట్టాచార్య, 'గెరిల్లా' కథను పి.చంద్ రాశారు. ఈ పుస్తకానికి బాలగోపాల్ 'గిరిజనులు-గిరిజన సంస్కృతి', కె.వి.ఆర్. 'వేడివెన్నెల' ముందుమాటలను రాశారు. ముందుమాటలు గిరిజనుల చరిత్రను, సంస్కృతిని, ఉద్యమాలను ఆదిలాబాద్ గిరిజనుల కోసం కృషి చేసి హేమన్‌డార్ఫ్ కృషిని వివరించారు.

ఈ కథల ద్వారా గోండు గిరిజనులు కొండల్లో, కోనల్లో, అడవే సర్వస్వంగా భావించి తినడానికి తిండిలేక, ఉండడానికి గూడులేక, కట్టకోవడానికి బట్టలేక ఏళ్ళ తరబడి అనేక సమస్యల మధ్య నలిగి, ఎదుగూ, బదుగూ లేకుండా జీవనం కొనసాగిస్తూ వస్తున్న క్రమం తెలుస్తుంది. ఆ క్రమంలో ఉద్యమ కారుల రాకతో చైతన్యం పొంది తమ సమస్యల పరిష్కారం కోసం ఉద్యమిస్తూ ముందుకు సాగిన పోరాటాలు, ఉద్యమ స్వరూప, స్వభావాలు తెలుస్తాయి.

మానవుడికి బ్రతకడానికి ప్రధానంగా కొన్ని కనీస అవసరాలు ఉంటాయి. వాటిలో "భూమి, నీరు, అటవీ సంపద, ప్రకృతి, కూడు, గుడ్డ, నీడ" ప్రధానమైనవి. ఆదివాసులు భూమికోసం అటవీ సంపదపై హక్కు నిలబెట్టుకోవం కోసం నిరంతరం అటు క్రూర మృగాలతో, ఇటు ప్రభుత్వంతో, కాంట్రాక్టర్లతో, ఘర్షణలు పడాల్సి వస్తుంది. అట్లాంటి ఘర్షణలో ఒక్కొక్కసారి ప్రాణాలు కూడా కోల్పోవలసివస్తుంది. ఇలాంటి అనేక సమస్యలను కథా వస్తువులుగా గ్రహించి సాహు, బి.ఎస్. రాములు, అల్లం రాజయ్య, తుషార్ భట్టాచార్య ఈ కథలు రాశారు.

వస్తువు దృష్ట్యానే కాకుండా, శిల్పపరంగానూ ఈ కథల సంకలనంలో చాలా మంచి కథలు ఉన్నాయని విమర్శకులు ప్రశంసించారు"[1] వాటిని ప్రత్యేక అధ్యాయంలో పరిశీలించడం జరుగుతుంది. ఈ అధ్యాయంలో కథల్లో గల వస్తు వైవిధ్యాన్నీ, స్థూల పరిచయాలను వివరించడం జరుగుతుంది.

## కన్నీటి కథ - నీటి కథ

'కన్నీటి కథ - నీటి కథ' లోని ప్రధాన ఇతివృత్తం అడవుల్లో నివసించే గిరిజనులు నీళ్ళ కోసం ప్రాణాలు పోగొట్టుకోవడం.

ఈ కథలో ప్రధాన పాత్ర ఆత్రం సుక్కుబాయి. కొంత మంది వ్యక్తులు మిట్ట మధ్యాహ్నం సూర్యునితోపాటు అడవుల్లో ప్రయాణిస్తూ వుంటారు. ఆ అడవి అందంగా ఉంటుంది. అడవి మధ్య మధ్యలో కొండలు ఉంటాయి. ఆ కొండల పైన మనుషులు వున్నారంటే ఎవరూ నమ్మరు.

ఆ దట్టమైన అడవిలో ఒక గిరిజన తెగ బతుకు యాత్ర సాగిస్తూ ఉంటుంది. ఆ గిరిజన తెగ నీళ్ళ కోసం పడే అవస్థలు వర్ణనాతీతం. ఆ గూడెంలో చిన్న చేదబావి కూడా ఉండదు. వాళ్ళు ఏళ్ళ తరబడి నీళ్ళ కోసం యుద్ధం చేస్తూనే ఉంటారు. నిద్ర కళ్ళతో లేచి కొండ మీదకెళ్ళి సూర్యోదయానికల్లా గుట్ట దిగుతుంటారు. పిల్లా జెల్లా, ముసలి ముతకా, అనే భేదం లేకుండా అందరూ నీళ్ళ కోసం బాధలు పడుతుంటారు.

అది ఒక ఊట. దాంట్లో నీళ్ళు ఊరిన కొద్ది నింపుకోవాలి. మనుషులకి, పశువులకి కూడా అవే నీళ్ళు. ఒక రోజు ఆత్రం సుక్కుబాయి నీళ్ళ కోసం బయలు దేరుతుంది. సుక్కుబాయి గర్భంతో ఉండడం వల్ల ఆయాసంతో నడవలేకపోతుంది. "గుట్ట దిగలేక కడుపు మంటతో కన్న వారిని, కుట్టుకున్న వాడిని, జులంతో పన్నులు గుంజే సర్కార్‌ను సత్తెనాసయిపోను"[2] అని శాపం పెడుతుంది. అంతలో ఒక భయంకరమైన శబ్దం వినిపిస్తుంది. సుక్కుబాయి అటు ఇటు చూస్తుంది. గుడ్డెలుగు కనిపిస్తుంది. సుక్కుబాయి భయపడి, అరచి బొబ్బలు పెడుతుంది. "గుడ్డెలుగు కొట్టిన దెబ్బకు కడుపులో బిడ్డ నేలతల్లి ఒడిలో"[3] పడుతుంది.

ఈ కథ చదివితే.... చివరికి కళ్ళ నీళ్ళు వస్తాయి. చదువు సంధ్యలు లేకపోవడం వల్ల గిరిజనులు అడవుల్లో ఏ చిన్న సౌకర్యం లేకుండా జీవితాన్ని గడపడం బాధాకరమనిపిస్తుంది. వాళ్ళు ఆ అడవుల్లో ఒక్క కడవ నీళ్ళ కోసం అడవి మృగాలతో పోరాడాల్సి ఉంటుంది. ఆ పోరాటంలో వాళ్ళు ప్రాణాలు కూడా కోల్పోతుంటారు.

ఎంతో ప్రగతి సాగించామని ప్రకటించే ప్రభుత్వ ప్రభుత్వేతర సంస్థలు



వీటి గురించి లోతైన ఆలోచన చేయాల్సి ఉంది. బావులు తవ్విస్తామని లంచాలు తీసుకున్న అధికారులు, చివరకు ఆ ప్రాంతం వదలి వెళ్ళమని చెప్పడం ఎంత అర్థరహితమో చెప్పలేం. ఇవన్నీ అధికారులు తీసుకునే అర్థ రహితమైన నిర్ణయాలను తెలుపుతున్నాయి. అనాధికారికంగా చేసే ఇలాంటి నిర్ణయాలు గిరిజనులకు ప్రభుత్వం చేస్తున్న కార్యక్రమాలను సమీక్షించుకోవాలని లేకపోతే గిరిజనులు ప్రభుత్వంపై నిరసనను తెలియజేస్తూ, చివరికి విప్లవ సంస్థలలో కలిసిపోతారనే స్పృహను ఈ కథ కల్గిస్తుంది.

## పెళ్ళికావాలి కథలో...

పేదరైతు పెళ్ళి పేరిట, పెళ్లికోసం ఎలాంటి బాధలు ఎదుర్కొంటాడో 'పెళ్ళి కావాలి' కథలో చూడచ్చు. ఈ కథలో ఒకే ఒక పాత్ర కనిపిస్తుంది. అదే దీని ప్రత్యేకత. గిరిజన కుటుంబానికి చెందిన ఒక వ్యక్తి 'జుగ్నాక బొజ్జు' అతడికి ఒక ప్రక్క సంప్రదాయం (కాయిదా) గురించి మరో ప్రక్క వయసుకు వచ్చిన కొడుకు పెళ్ళి చేయమని కోరడంతో సమస్యలు మొదలవుతాయి. గోండు వ్యవహారిక భాషలో కాయిదా అంటే సంప్రదాయం. కాయిదా గురించి అతని మనస్సు నెగడులా (నెగడు అంటే గోండి వ్యవహారంలో మంట అని అర్థం) మండి పోతూవుంటుంది. కాని ఒక్కడే ఏమీ చేయలేడు. జాతి పరంగా వస్తూ వుంది ఈ కాయిదా. తన కొడుకు, పెళ్ళి కావాలనేసరికి తన పూర్వ జీవితం గుర్తుకు వచ్చి, 'నా కొడుకు నాలా కావద్దు' అని అనుకుంటాడు. పూర్వం జుగ్నాక బొజ్జు తన తండ్రి పెళ్ళి చేయకపోతే ఇల్లు విడిచి వెళ్లిపోతాడు. బొజ్జు తన కొడుక్కి పెళ్ళి చేద్దామంటే ఒక ప్రక్క ఆడపిల్లకిచ్చే డబ్బులేక పోవడం వల్ల మదన పడిపోతాడు. రాత్రి నిద్ర కూడా పోడు. తన దగ్గర మామగారు చనిపోతూ ఇచ్చిన అయిదెకరాల భూమి రెండు ఎడ్లు ఉంటాయి. పెళ్ళి కోసం ఎడ్లు అమ్ముకోవాల్సి వస్తుంది. భూమి షావుకారి సొంతం అయిపోతుంది. దాంతో తన కొడుక్కి పెళ్ళి చేయ గలుగుతాడు. అతని మనసులో ఉన్న ఆలోచనలు, ఆలోచనలుగానే ఉంటాయి. తనకి గుండె కోత మాత్రమే మిగుల్తుంది. గిరిజనుల్లో నేటికీ చాలా మందిలో ఆడపిల్లకే కట్నం ఇచ్చే ఆచారం ఉంది. కట్నం, కానుకలు, వాటి మధ్య నలిగిపోయే గిరిజన జీవితాల్ని సాహు ఈ కథలో వర్ణించే ప్రయత్నం చేశాడు. గిరిజన సంస్కృతిలోని ఒక పార్శ్వాన్ని సృజనీకరించిన కథ ఇది.

ఈ కథ ద్వారా మాతృ స్వామిక జీవన విధానాన్ని చెప్పే ప్రయత్నం చేసినట్లు కన్పిస్తుంది. క్రింది వర్గాల్లో సర్వ సాధారణంగా మాతృ స్వామ్య కుటుంబాలే ఉంటాయి. స్త్రీ ఆధిపత్యమే పితృస్వామ్య కుటుంబంలో ప్రధానం. తద్వారా స్త్రీకి గౌరవం ఉన్నది. మాతృస్వామ్య కుటుంబం అది నేటికీ గిరిజనుల్లో కొనసాగుతుందనేది ఈ కథ ద్వారా స్పష్టమౌతుంది.

## కాయిదా (సంప్రదాయం) కథలో...

'కాయిదా' (సంప్రదాయం) ముసుగులో గిరిజనులు ఎలా తమ జీవితాల్ని అప్పులపాలు చేసుకుంటున్నారో వివరించే కథ.

గిరిజనులు తన దగ్గర చేతిలో ఒక రూపాయి లేకపోయినా, దుక్కి దున్నాలన్నా, విత్తనం వేయాలన్నా, కలుపు తీయాలన్నా, కోడిని కోయాల్సిందే. దాని కోసం షావుకారు (జంకార్) దగ్గర అప్పు చేయాల్సిందే. అలా దుక్కి ప్రారంభించినప్పటి నుండీ, పంట చేతికొచ్చే వరకు సాంప్రదాయం అనే పేరుతో పూజలు చేస్తుంటారు గిరిజనులు. చేయకపోతే గూడెంలో చిన్నచూపు. అంటే సాంఘిక హోదాకోసం అవన్నీ చేయాల్సిందే. మర్యాదకోసం రైతు తన జీవితం ధారపోస్తున్నాడు. చివరికి చేతికొచ్చిన పంటలో సగభాగం షావుకారికి, సగభాగం రైతుకు. భూమి మాత్రం షావుకారిది అయిపోతుంది. దానికి కారణం కాయిదా కోసం షావుకారి దగ్గర తీర్చలేనంత అప్పుచేయడమే. ఈ కాయిదాలు (సాంప్రదాయాలు) గిరిజనుడి మూలుగులు పీల్చేసి వాడి జీవితాన్ని ఎలా ఛిద్రం చేస్తున్నాయో కాయిదా కథలో చిత్రించడం జరుగుతుంది.

## ఐదు రూపాయల కథ

మైదాన ప్రాంతం నుంచి వచ్చిన వ్యాపారులు, పెత్తందార్లు గోండులను వారి భూముల్లోనే పాలేర్లుగా మార్చిన వైనం ఈ కథలోని ప్రధాన ఇతివృత్తం.

పుట్టిన చోటనే పరాయి వాళ్ళు కావడం గోండుల జీవితాల్లో ఒక పెద్ద విషాదం. ఉప్పు, పప్పు, మిరపకాయ అమ్ముకునే సాకుతో మైదాన ప్రాంతాల నుంచి గోండు తండాల్లోకి వచ్చిన వ్యాపారులు, క్రమంగా అటవీ భూముల్ని స్వాధీనం చేసుకోవడం, వాళ్ళని రకరకాలుగా దోచుకోవడం ఈ కథలో చూడచ్చు.

స్థూలంగా కథను చూసినట్లయితే కాసం రామయ్య ఈ కథలో ప్రధాన



పాత్ర. కాసం రామయ్య పెద్ద షావుకారు. గూడేనికొచ్చి వ్యాపారం చేసుకొని వెళుతుంటాడు. కొమరం జంగు షావుకారికి అప్పుపడతాడు. జంగు కొడుకు రాంసావు. కాసం రామయ్యతోపాటు ఈ రెండు పాత్రలు కూడా కథలో కనిపిస్తాయి.

కథనడిచే గూడెంలో ఒక బంగ్లా ఉంటుంది. ఆ ఊళ్ళోకి కొత్త వారెవరొచ్చినా ఆ బంగ్లాలో వుంటారు. వచ్చిన వాళ్ళను ఊరి పెద్ద సత్కరిస్తూ వుంటాడు. నిజానికి ఆ గూడెంలోని గిరిజనులకు ఎలాంటి క్రూరమృగమన్నా భయంలేదు గాని, షావుకారు కాసం రామయ్య అంటే చచ్చేంత భయం.

కాసం రామయ్య ఆ గూడెంపై కన్నేసి ఉండడంతో సోలెడు ఇచ్చి, అద్దెడు తీసుకొని, చివరికి వాళ్ళకు అప్పులుకూడా ఇవ్వడం మొదలు పెడతాడు. వస్తువులకు ధరలు తన ఇష్టం వచ్చినట్లు వేసుకుంటా వుంటాడు. గిరిజనుల నిరక్ష్యరాస్యత వల్ల, అదేమిటని ఎవరూ నోరు తెరచి కాసం రామయ్యను అడగలేక పోతారు. గిరిజనుల నమ్మకాన్ని కాసం రామయ్య సొమ్ము చేసుకుంటూ వుంటాడు. చూస్తూ వుండగానే కాసం రామయ్య వందెకరాల భూమికి ఆసామి అవుతాడు. జంగు దగ్గర వున్న మేకలు, ఆవులు, జొన్నలు మొదలైనవి అన్నీ రామయ్య పరమైపోతాయి. కాని జంగు అప్పు తీరదు. జంగు చనిపోతాడు. అతని కొడుకు రాంసావు ఆ అప్పుకట్టలేక వున్న భూమిని షావుకారికిచ్చి చివరికి అతడి పొలాల్లో పని చేసుకుంటూ ఉండిపోతాడు. బాకీ తీరదు. జంగు ఖాతాలోని అయిదు రూపాయలు అప్పు అలానే మిగిలిపోతుంది.

బతుకు తెరువుకోసం గిరిజనుల గుండెల్లోకి వచ్చిన గిరిజనేతరులు ఎలా ఆధిపత్యాన్ని చెలాయిస్తున్నారో చెప్పే మంచి కథ ఇది.

## భూమికొరకు కథలో...

'భూమి కొరకు' అనే ఈ కథలో ప్రధాన పాత్రలు లేవు. అయితే గూడెమే ఇందులోని ప్రధాన పాత్ర. భూమికోసం చివరికి గూడెం మొత్తం ప్రాణాలను వదిలేస్తుంది. ఇదే కథలో ప్రధానమైన అంశం.

భూమి సమస్య నిన్న మొన్నది కాదు. అనాదిగా మానవపుట్టి వెంటాడుతున్న సమస్య. మానవ ప్రపంచం ఎదుర్కొంటున్న సమస్యల్లో అతి ప్రధానమైంది తీవ్రమైంది, కూడా భూమి సమస్యే.

భూమికోసం గిరిజనులు తమ రక్తాన్ని చిందించి, పంట భూములుగా తయారు చేసుకున్నాక, ఆ భూములపై ప్రభుత్వ కాంట్రాక్టర్ల దృష్టి పడుతుంది. వీరే కాకుండా పోలీస్ ఆఫీసర్ల దృష్టి కూడా పడుతుంది. బంగారు పతకం కోసం ఆ ఏరియా రేంజర్ ఆశపడతాడు. అవన్నీ కలగలిసి " తుంబాగూడెం" మొత్తాన్ని మంటల్లో కలిపేస్తాయి.

బంగారం పండే భూముల్లో ప్రభుత్వం, ప్రభుత్వ మనుషులు పిచ్చి తుమ్మలను నాటుతారు. చివరికి గూడెం వాళ్ళు ఏమీ చేయలేక "ప్రభుత్వాన్ని" నాశనం చేయాలనే ఉద్దేశంతో ఎర్రమందు కనిపెడతారు. భూమి సాధించుకోవడం కోసం గూడెం వాళ్ళు విప్లవ వీరులను స్మరించుకొంటూ ముందుకు వెళ్ళడంతో కథ ముగుస్తుంది.

## రక్త పింజెర కథ

ఫారెస్ట్‌లో పని చేసే సూపర్ వైజర్‌లను ఎదిరించే ధైర్యంలేక ఆకలితో, రాత్రిచలితో, భయంతో పనిలో మునిగి చివరికి పాము కాటు వల్ల గిరిజనులు మరణించిన తీరు ఈ కథలో ప్రధానమైంది.

ఈ కథలో శిడాంశిత్రు, మల్కుబాయి ప్రధాన పాత్రలు. ఈ కథలో ఒక పెద్ద అడవి, ఆ అడవిలో ఒక గూడెం ఉంటుంది. ఆ గూడెంలో నాలుగు గిరిజన గుడిసెలుంటాయి. ఆ గూడెంలోని వాళ్ళు భయంకరమైన చలితో బాధపడుతూ వుంటారు. ఆ గూడాల్లో చిట్టచివరి గుడిసె శిడాం శిత్రుది. ఇతని భార్య పేరు మల్కుబాయి. వీళ్ళకు ఒక కూతురు కూడా వుంటుంది. ఆ గూడెంలో వున్న ముసలివాళ్ళు చలికారణంగా ప్రాణాలు కళ్ళల్లో పెట్టుకొని బతుకుతుంటారు. భయంకరమైన చలిరాత్రిల్లో ఆ గుడిసెల్లో దీపాలు కూడా ఉండవు. వాళ్ళ దగ్గర దీపాలు వున్నా దీపాల్లో సమరు (చమురు) లేక దానిని కొనడానికి డబ్బులుండవు. ఆ సమయంలో ఇందిరమ్మను గుర్తుకు తెచ్చుకుంటారు. ఆమె ఇచ్చిన హామీలు, హామీలు గానే ఉంటాయి.

శిత్రు కళ్లు నెగడులా మండుతుంటాయి. నిద్ర పట్టదు. ఏవేవో ఆలోచనలు ముసురుకుంటాయి. చలికి వణుకుతూ పండుకున్న కూతుర్ని, భార్యని చూస్తూ ఆలోచనలో పడతాడు. అసహనంగా ఇటు అటు తిరుగుతుంటాడు.



కప్పుకుందామంటే బొంత కూడా ఉండదు. ఆ సంవత్సరం ఎలాగైనా గుడిసె బాగు చేసుకోవాలనుకుంటాడు. వెంటనే పోలీసోళ్ళు, చౌకి దార్లు గుర్తుకువచ్చి వణికిపోతాడు. ఆ చలిరాత్రిలో జీవితం గురించి భార్యా భర్తలు రెండు మాటలు మాట్లాడుకుంటారు.

శిత్రు, మల్కుబాయితో "నిన్ను సుఖ పెట్టకపోయినా, చూపుకు కనీసం ఒక చీరైనా కొనివ్వ లేక పోయా"[4] నని భార్యతో చెప్పి, కాంట్రాక్టరు ఇచ్చిన అడ్వాన్సులో ఒక చీరా తెస్తానని చెప్పి ఆమె వండిన గట్కతిని వెళతాడు. మల్కుబాయి ఆనందంతో పనికి పోతుంది. అప్పటికి పట్టణ ప్రాంతాలలో చాలా మార్పులు వచ్చింటాయి. మల్కుబాయి కళ్ళకి రంగు రంగుల చీరలు కనిపిస్తాయి. ఆ చీర సంబరాన పనిలో మునిగిపోతుంది.

మల్కుబాయి పని చేస్తున్న దగ్గరికి సూపర్‌వైజర్ శర్మ వస్తాడు. దాంతో అందరూ భయం, భయంగా పనులు చేస్తూవుంటారు.

అందరూ పనికి వచ్చారా లేదా అని మొకద్దమ్‌ను శర్మ అడిగి జుగ్నాక బొజ్జు ఎందుకు రాలేదని అడిగి వెంటనే తీసుకొని రమ్మని పంపిస్తాడు. ఇంతలో అలిసిపోయి చెట్టు కింద కూర్చున్న డోబి చుట్టతాగుతూ శర్మ కంటబడతాడు. డోబిని, శర్మ తిట్టరాని మాటలు తిడతాడు.

బొజ్జు ఎంతకు రాలేదని కోపంతో ఊగిపోతుంటాడు. బొజ్జు చలి జ్వరంతో బాధ పడుతుంటాడు జంగు, బొజ్జుని శవంలా మోసుకెళ్తాడు. శర్మ అల్లంత దూరంలో బొజ్జును చూసి పులి మేక పిల్లను చూసినట్లు చూస్తాడు. బొజ్జు ఒళ్ళు హూనమవుతుంది. "ఎవరైనా అడ్వాన్సు తీసుకొని రాక పోతిరో ఇదే గతి పడుతుంది[5]" అని హెచ్చరించి వెళ్ళిపోతాడు. రకరకాల ప్రశ్నలు వాళ్ళ మనస్సులో సుడులు తిరుగుతాయి.

ఇంతలో పెకలించాల్సిన "పెద్దబండొకటి" మిగిలిపోతుంది. అందరి కళ్ళు బండ మీదనే ఉంటాయి. దానికింద వున్న రక్త పింజెరను గమనించలేకపోతారు. అది మల్కుబాయిని కాటేస్తుంది. మల్కుబాయి అక్కడికక్కడే చనిపోతుంది.

శర్మ ఇస్తానన్న కూలి ఇవ్వకపోవడం, మల్కుబాయి చనిపోవడం కళ్ళారాచూసిన గిరిజనులు కట్టలు తెంచుకున్నా కోపంతో తిరగబడతారు. చివరకు వాళ్ళు జైలు పాలవుతారు. స్థూలంగా రక్తపింజెరలోని కథ ఇది.

## జెండా కథ

'దాబిలొద్ది' ఒక గిరిజన గూడెం. ఆ గూడెం నాయకుడు జంగు. వర్షాలు లేక దేవుళ్ళకు మొక్కి ఆ దేవుళ్ళ పేరుతో ఎర్ర జెండాలను ఎగుర వేస్తుంటారు. ఆ గూడెం వాళ్ళు. డి.యస్.పి. ఆ జెండాలు దేవుళ్ళ జెండాలు అని తెలియక మోస పోతాడు. ఇది ప్రధాన ఇతివృత్తం.

ఈ కథలో ప్రధాన పాత్ర జంగు. వర్షాకాలం గడిచిపోయినా, సరైన వర్షాలు పడవు. వర్షాలను నమ్ముకున్న గిరిజనులకు వర్షాలు పడక పోయేసరికి పూట గడవడం కష్టమైపోతుంది. దున్నిన భూములు, వేసిన పంటలు ఎండిపోతుంటాయి.

ఆ గూడెం వాళ్ళు వానలు కురవాలంటే వెంటనే దేవునికి పూజ చేయాలని నిర్ణయించుకుంటారు. ఆ మరుసటి రోజు అందరు కలిసి దేవుని పూజకోసం ఊరు వెలుపల చెట్ల క్రిందికి చేరుకుంటారు. ఆ చెట్ల క్రింద తమకు తోచిన పూజలు చేసి, వానలు కురవాలని దేవున్ని మొక్కుకుంటారు.

ఆ గూడెం నాయకుడైన జంగు దేవుని జెండా ఎగరేస్తాడు. కొద్ది సేపు దేవునిలో లీనమయి ఆడతారు, పాడతారు, చివరిగా ఎర్రని, తెల్లని జెండాలు ఎగురవేసి, తెచ్చిన సారె (ఒకరకమైన ధాన్యం)తో నైవేద్యం వండి దేవుని ముందు పెట్టి వెళ్ళిపోతారు. వానలు మాత్రం పడవు.

ఆ ఊరి డి.ఎస్.పి.కి. వారం రోజుల తర్వాత, గిరిజనులు ఎర్ర జెండాలు ఎగరేసినట్లు తెలుస్తుంది. వెంటనే డి.యస్.పి. కోపంతో ముప్పై మంది పోలీసులతో గిరిజన గూడెం చేరుకుంటాడు.

డి.యస్.పి. జరిగిన విషయాన్ని జంగు ద్వారా తెలుసుకుంటాడు. జెండాలు ఎక్కడ ఎగురవేశారని డి.యస్.పి. జంగును అడుగుతాడు. జంగు ఎగరేసిన చోటు చూపిస్తాడు. ఆ ఎగురేసిన జెండాలు ఎర్రజెండాలు. ఆ జెండాలను చూసే సరికి డి.ఎస్.పి. మనసు కోపంతో ఉడికిపోతుంది. తన కోపాన్ని గిరిజనుల మీద చూపిస్తాడు. నిజానికి ఆ ఎర్ర జెండాలు దేవుని జెండాలు. అది తెలియక డి.యస్.పి. పొరబడతారు. గిరిజనుల తెలివితేటల ముందు డి.యస్.పి., చిన్నపోతాడు. కథ ముగింపులో గూడెం గిరిజనులు డి.యస్.పి కి భయాన్ని కల్గచేస్తారు.



## ఆకలి కథలో...

జైతు ఈ కథలో ప్రధాన పాత్ర. జైతు అన్న జానన్న. ఇతని భార్య సీత. వీళ్ళకు పిల్లలతో పాటు ముసలవ్వ కూడా వుంటుంది. తిండి తినడానికి ఏమి లేక ఆకలితో జైతు కుటుంబం బాధపడుతుంటారు. జానన్నకు డబ్బు ఇస్తానని ఆశ పెట్టిన ప్రభుత్వం చివరికి మోసం చేస్తుంది. ఆ డబ్బునే నమ్ముకున్న జానన్న ప్రభుత్వం ఇవ్వక పోయేసరికి వాళ్ళ ఆకలి, ఆకలి గానే మిగిలిపోతుంది.

ఆసిఫాబాద్ నుండి ఆదిలాబాద్ పోయేదారిలో ఒక చిన్న గూడెం వుంటుంది. ఆ గూడెంకు దూరంగా ఒక పెద్ద గుట్ట వుంటుంది. ముసలవ్వ కట్టెలకోసం గుట్ట వైపు వెళ్తుంది. ఆకలి తీరాలంటే ఆడ, మగ అనే భేదం లేకుండా పనికిపోతుంటారు. ఇంటి దగ్గర చిన్న పిల్లలు ఆకలితో ఏడుస్తుంటారు. ఇంట్లో ఏమి ఉండవు. ఆ ముసలవ్వ చిన్న పిల్లల ఆకలి బాధ చూడలేక గట్క (జావా) వండి పెడదామనుకుంటుంది. జావా కోసం బయలు దేరుతుంది. జైతు జొన్న చేను కాపలా వుంటాడు. ఆనందమో, బాధ తెలియక జైతు పాటపాడుతుంటాడు. గొడ్డలితో బొంగు నరుకుతుంటాడు. గొడ్డలి శబ్దం పాటకు మద్దెల దరువు లాగుంటుంది. తోటి వాళ్ళందరు పనికి వెళ్ళారని, జైతు చేను కాపలా నుండి పనికి బయలు దేరుతాడు. దారిలో ముసలవ్వ కనబడుతుంది. జైతు మొదట పాడిన పాట తిరిగి "మారాజ్యం కిందికిపోయింది" అని మళ్ళీపాడాడు. ఆ ముసలవ్వ పాట విని రాజ్యం పోకుంట వుంటుందా, కోమరం భీం లాంటి వీరులు చని పోవంగ అని అంటుంది. పాట పాడింది జైతునని ముసలవ్వ గుర్తు పట్టుతుంది.

జైతు, అవ్వ ఇద్దరు కొద్ది సేపు మాట్లాడుకుంటారు. జైతు "పనికి వెళ్ళుతున్నా"నని ముసలవ్వతో చెపుతాడు. 'కూలీ పైసలు పెంచారా' అని అడుగుతుంది. జైతు 'పదిపైసలు పెంచారు' అని చెపుతాడు. అవ్వ ప్రభుత్వం పై వున్న అభిప్రాయాన్ని "సావు కారే నయం, ఇత్తే ఇత్తానంటాడు, లేకపోతే లేవంటాడు. గీ సర్కారోడు సావు కార్లకన్న పెద్ద దొంగన్నట్టున్నది"[6] అని అంటుంది. ముసలవ్వ జైతుతో జానన్న పోయిన పని అవుతదా అని అడిగి, కాంట్రాక్టరు దగ్గర అడ్వాన్సు తీసుకొని పనికి పోకపోయే అని బాధపడుతూ ఉంటుంది.

జైతు వెంటనే అక్కడి నుండి పనికిపోతాడు. ముసలవ్వ ఇంటికి వస్తుంది. పిల్లలందరూ ఆకలి తెలువకుండ వుండడానికి గంతులు వేసి ఆటలాడుకుంటు

వుంటారు. అవ్వ ముదారి మొకల్ని కొట్టి జావా చేస్తుంది. ఆకలిని తట్టుకోలేక పిల్లలందరూ చుట్టూ చేరుతారు. పిల్లలను తిడుతూ అవ్వ నీళ్ళకు పోతుంది. దారిలో కాలు జారి పడుతుంది. కోపంతో దేవున్ని తిట్టుకుంటుంది. తిరిగి వచ్చే సరికి జావా కుక్కతిని పోతుంది. దానిని చూసి పిల్లలందరూ ఆకలితో అలాగే వుండిపోతారు. ఆ పూటకు వాళ్ళందరికి నీళ్ళే ఆహారం అవుతుంది.

ఎర్రగా మండుతున్న నెగడు చుట్టూచేరి పండుకుంటుంది జైతు కుటుంబం. అర్ధరాత్రి అవుతుంది. చలికాలం వల్ల భయంకరంగా చలి పెడుతుంటుంది. పిల్లవాడు ఏడవగానే సీత మేల్కుంటుంది. పాలు ఇస్తుంది. పిల్లవాడు చేసిన శబ్దంతో ముసలవ్వ కూడా నిద్రలేస్తుంది. నడిరాత్రి అయింది, జాను రాకపోయో అని అవ్వ, సీతను అడుగుతుంది. ఇంతలో వీధిలో కుక్కలు మొరుగుతుంటాయి. ఈ కుక్కలు పనిలేకుండానే మొరుగుతుంటాయి అని అవ్వ చీదరించుకుంటుంది. కాని వీధిలో నుండి జానన్న ఇంటికి వస్తాడు. "పోయిన పని కాలేదు, ఇంకా పది రోజులు పడుతుందటా"[7], అని అవ్వతో చెపుతాడు. వెంటనే ముసలవ్వకు ఎక్కడలేని కోపం వస్తుంది. ఎందుకంటే గిరిజనులకు ప్రభుత్వం చేస్తున్న అన్యాయాన్ని చూసి, 'మనిషికో న్యాయం' అని ప్రభుత్వాన్ని తిడుతూ ఉంటుంది. తిట్టితే బ్రతుకులు మారవు అని జానన్న చెప్తాడు. ఇంద్రవెల్లిని చూసి నేర్చుకోండి అని సలహా ఇస్తుంది. లేకపోతే మేము తుపాకులు పడతాము అని జానన్నతో అవ్వ చెప్తుంది. ఒక వైపు ఆకలితో పడుకున్న పిల్లలను చూసి, మరోవైపు దోపిడి చేస్తున్న ప్రభుత్వాన్ని చూసి నిద్రపట్టదు జాన్ననకు. తన తండ్రి అనారోగ్యంతో మరణిస్తాడు. తల్లి మందులు కొనే స్థోమత లేక గుడ్డిదవుతుంది. వీటన్నింటికి తోడు జానన్నకు డబ్బులు ఇస్తానని చెప్పిన ప్రభుత్వం చివరకు ఇవ్వదు. వాళ్ళు ఆకలితో అలానే నిద్రపోతారు.

గిరిజనులు పనిచేసినా, వాళ్ళ ఆకలి తీరక పోవడానికి, ప్రభుత్వ విధి విధానాలకే సంబంధం ఉందని చెప్పే కథ ఇది. 'ఇంద్రవెల్లి'ని చూసి నేర్చుకోండని ఒక ముసలవ్వ చేత రచయిత చెప్పించడంలో ఎంతో గొప్ప నైపుణ్యం ఉంది. ఏమి చేయలేని వాళ్ళు సైతం ప్రభుత్వ విధానాలకు తిరగబడే పరిస్థితులు గిరిజన జీవితాల్లో కనిపిస్తున్నాయని చెప్పే వాస్తవిక దృక్పథం కథనిండా కనిపిస్తుంది. స్థూలంగా ఇందులోని కథ ఇది.



## నిర్ణయం కథలో...

ఈ కథలో పాత్రలు శీడం గన్ను, లక్ష్మీ, కేసు గాగురు, మల్కు ప్రధానమైనవి.

నిర్ణయం కథను చదవినట్లయితే పటార్ (గుట్ట) కు కొద్ది దూరంలో గూడెం వుంటుంది. ఆ గూడెంలో నాలుగే గుడిసెలు వుంటాయి. భూమి ఎక్కువ వుండదు. పశువుల్ని మేపుకుంటూ, పట్వారిలకు లంచం, చౌకిదార్లకు లంచం ఇస్తూ ప్రభుత్వానికి పన్ను కడుతూ ఉంటారు. అయినా కాని భూమి గిరిజనుల సొంతం కాలేక పోతుంది. దాంతో గూడెం వాళ్ళందరూ కలిసి మాట్లాడుకుంటారు. పన్ను చెల్లించ కూడదని నిర్ణయించుకుంటారు.

శీడంగన్ను వయస్సు మీద పడిన వ్యక్తి. గన్ను పటార్ మీద ఆకలితో పరికిపండ్లు తింటు పశువుల్ని మేపుతూ వుంటాడు. ఒక రోజు చిరుత పులి పటార్ మీదికి వచ్చి ఎద్దును పట్టేస్తుంది. గన్ను ముసలివాడు కాబట్టి ఏమి చేయలేక అలా చూస్తుండి పోతాడు. ఒక వైపు చౌకిదార్లు చేస్తున్న అన్యాయం, ఇప్పుడు చిరుత పులి చేసిన దౌర్జన్యం అన్నింటితో గన్ను మనసు బాధపడుతుంది.

ఇంటికి రాగానే బాధతో వున్న శీడంగన్ను, గాగురుతో జరిగిన విషయం చెపుతాడు. గన్ను భార్య లక్ష్మీ. ఆ మాటలు విని లక్ష్మీ బాధ పడిపోతుంది. తిండి తినడానికి కనీసం జొన్నలు కూడా లేక బాధపడుతుంటే, గూడెంలో చౌకిదార్లు పెడుతున్న బాధలు వారు భరించలేకపోతారు.

దాంతో ఆ గూడెం పెద్దలు గాగురు, మల్కు, కేసు, ఇంకా ఆ గూడెంలో వుండే వారందరితో మనమందరం కలిసి వుండాలని నిర్ణయించుకుంటారు. గూడెంలోకి ఎవరు వచ్చిన కలిసి తరిమికొట్టాలి. ప్రభుత్వానికి పన్ను చెల్లించ కూడదు. తరతరాల నుండి సర్కారు వాళ్ళు తరిమినా మనం పన్ను చెల్లిస్తూ ఇక్కడే వుంటున్నాం. అందువల్ల దున్నే వానికి భూమి కావాలని, మనమే భూమిని గెల్వాలనీ అనుకుంటారు. నెగడు (మంట) లా ఆ గూడెం వాళ్ళందరి హృదయాలు మండిపోతాయి. నెగడు చుట్టూ అందరూ చేరి కలిసి మెలిసి వుండాలని నిర్ణయించుకుంటారు. ఇది ఇందులో వుండే కథ.

దున్నేవానికి భూమి దక్కాలనే నినాదాన్ని కథలో మార్చి, గిరిజనుల్లో చైతన్యాన్ని పెంచే దిశగా కథ కొనసాగింది.

## అడవిలో వెన్నెల కథ

'అడవిలో వెన్నెల' కథ గిరిజన పోరాట కథా సాహిత్యంలో ఒక దృశ్య కావ్యం. ఈ కథ గిరిజన జీవితాలకు దగ్గరగా ఉండి, రచయిత గిరిజన జీవితంతో బాగా మమేకమై రాసిన కథ ఇది.

ఈకథలో గిరిజనులు షావుకార్ల, ఆఫీసర్ల (ఫారెస్టు) మోసానికి గురికావడం, తమ భూములు, ఉత్పత్తులు తమవి కాకుండా పోవడం, గిరిజనుల్లో దాగివున్న పోలీసు భయాన్ని పోగొట్టడానికి నక్సలైట్స్ రావడం కథలో కన్పించే ప్రధాన ఇతివృత్తం.

ఈ కథలో ప్రధాన పాత్ర ఇస్రూ. ఇతడు గిరిజన గూడెంకు చెందిన వారిలో తెలివైనవాడు. ఇతని భార్య అనారోగ్య కారణంగా చనిపోతుంది. ఇస్రూకు ఇద్దరు పిల్లలు. వారు ఏసు, మోతి. ఇస్రూ కుటుంబం రోజు వారి కూలీలుగా, ఇప్పపూలు అమ్ముకొని జీవనం సాగిస్తూ వ్యవసాయం చేస్తుంటారు. ఇస్రూ రెండెకరాల బంజర్ భూముల్లో 'కంకి' వేసుకుంటూ ఉంటాడు. వేసిన పంటను తన ప్రాణంకన్నా ఎక్కువగా చూసుకుంటూ ఉంటాడు. రాత్రి, పగలు దానికి కాపలాదారునిగా వుంటాడుకూడా. ఇస్రూకు ఆ పొలంతో పాటు అయిదు మేకలు వుంటాయి. ఒకసారి ఇస్రూకు చేపలు తినాలనే కోరిక కలుగుతుంది. ఇస్రూ చేపలు కోసం వెళతాడు. అదే సందర్భంలో ఫారెస్టు వాళ్ళు వచ్చి మేకలు తోలుకు పోతారు. జరిమానాల వేధింపు, ఫారెస్టోళ్ళ దెబ్బలు ఇస్రూని ఆలోచింప చేస్తాయి. ఫారెస్టు వాళ్ళ దాడి వలన తాను తెచ్చిన చేపలు, మోతి వండిన అంబలి నేల పాలవుతుంది. మరుసటి రోజు గూడెం వాళ్ళు సమావేశమై సమస్యకు పరిష్కారం వెతుకుతారు.

ఆ గూడానికి ఒక మహరాజ్ వుంటాడు. దసరా ఉత్సావాల్లో వాళ్ళ సమస్యలను ఢిల్లీ దాకా తీసుకెళ్తానని మాయ మాటలు చెప్పి ఆ మహారాజ్ అమాయక ప్రజలను నమ్మించి మోసం చేస్తుంటాడు. మహారాజ్‌కు, గిరిజనులకు మధ్యవర్తిగా 'కుర్దు' అనే వ్యక్తి వుంటాడు. ఇవన్నీ జరుగుతున్నా ఇస్రూ కొడుకుకు మాత్రం బాధ్యత తెలిసినట్లు లేదు. అందువల్ల ఇస్రూ 'ఏసుకు' పెళ్ళి చేయాలని అను కుంటాడు. దసరా ఉత్సవాలలో ఏసు, లంకిబాయి ప్రేమలో పడతాడు. దాంతో లంకిబాయి ఏసు ఇల్లు చేరుతుంది. ఇస్రూ మాత్రం కన్యాశుల్కం ఇవ్వలేను అని ఆరాట పడతాడు.



లంకిబాయి తండ్రి 'బాబురావు మడే' విచిత్రమైన స్వభావం కలవాడు. నిరంతరం సర్కారు వాళ్ళ దాడి వల్ల విసుగు చెందిపోతాడు. ఇస్రూని అటు ప్రభుత్వం, ఇటు షావు కార్లు మోసం చేస్తారు. అనేక కష్టాలను ఎదుర్కొంటాడు. చివరకు తాను పండించిన పంట కూడా తనకు దక్కదు. దాంతో కుటుంబం గడవడం కూడా కష్టమైపోతుంది. అందువల్ల ఎవరైతే తమకు సహాయం చేస్తారో, వాళ్ల వైపు గిరిజనులు ఆసక్తి చూపుతారు. అడవిలో వెన్నెల కథ ముగింపులో తమకు సహాయం చేయడానికి వచ్చిన 'అన్నల' కు మద్దతుగా గిరిజనులు నిలబడి, వారితో కలిసిపోతారు. ఇక నుంచి కష్టాల వుండవని ఆనందంలో తేలియాడతారు. అడవిలో ఆ రాత్రి తమ గూడెం పై వెన్నెల విరబూస్తున్న దృశ్యాన్ని చూస్తూ వుండిపోతారు ఆ అమాయక ప్రజలు. బి.యస్. రాములు కళానైపుణ్యానానికి ఈ కథ అద్దం పడుతోంది.

విప్లవోద్యమం వల్ల గిరిజనుల జీవితాల్లో కొత్త వెలుగులు పుడతాయని ప్రబోధించే కథ ఇది.

## తుడుం కథలో...

గిరిజనులు పండుగ సమయంల్లో లేదా, గిరిజనేతర్లు గూడెం సిరిహద్దులను దాటివచ్చే సందర్భంలో 'తుడుం' మోగిస్తుంటారు. తమ గూడెంలో శత్రుసైన్యం (గిరిజనేతరులను లేదా గిరిజనులను నాశనం చేయుటకు వచ్చేవారు) వస్తుందన్న సంగతి తెలియజేయడానికి తుడుం కొడతారు. 'తుడుం' కథలో గిరిజనులు శత్రుసైన్యాన్ని సరిహద్దు దాటేంత వరకు తరిమిన విధానం చిత్రించబడింది.

ఈ కథలో ప్రధాన పాత్ర 'భీక్యా'. గిరిజనులు బతకడం కోసం అడవుల్లో అనేక సాహసాలు చేస్తుంటారు. గూడెన్నికి నక్సలైట్లు వస్తున్నారనీ, గిరిజనులను చైతన్యవంతుల్ని చేస్తున్నారనీ తెలుసుకొని పోలీసులు గూడెంకు వస్తారు. తేనెకోసం భీక్యా కొండ మీదికి వెళతాడు. ఎందుకో భీక్యా ఒక్క సారి కొండ కిందికి చూస్తాడు. ఖాకి బట్టలోల్లు, తెల్లబట్టలోల్లు కలిసి గూడెంకు వస్తుంటారు. అది చూసిన భీక్యా గాలి కంటే వేగంగా గూడెంకు పరుగెత్తుకుంటూ వస్తాడు. ఆ గూడేల్లో నలుగురైదుగురు జ్వరంతో బాధపడుతున్న వారు తప్ప ఎవరూ కన్పించరు. అటు ఇటు తిరిగి చూస్తాడు. చివరికి ఇంట్లో వున్న ఎర్రజెండాను దాస్తాడు. అప్పుడే ఆ గుడిసెలో తుడుం కన్పిస్తే దానిని తీసుకొని కొండపైకి వెళ్తాడు.

శత్రువులు గూడెం సరిహద్దులు దాటడం, తుడుం మోగడం ఒకసారే జరుగుతాయి. తుడుం మోతవిని పోలీసులకు భయం కల్గుతుంది. పోలీసులు వచ్చి చూస్తారు. ఆ గూడెంలో ఎవరు కన్పించరు. కనీసం ఆడపిల్లయైన లేకపాయే అని ఆలోచిస్తారు. గూడెంలో ఎవరు కన్పించకపోయేసరికి ప్రమోషన్ ఆశ, ఆశగానే మిగిలిపోతుంది.

మరికాసేపటికి జనం కంది చేన్లో నుండి మట్టి పెళ్ళలు దొర్లుతున్నాట్లుగా పెరుగత్తుకొస్తారు. వెంటనే ఖాకీబట్టలోల్లు సర్దుకొని నిలుచుంటారు. గూడేంవారు, పోలీసోల్లు కలిసి మాట్లాడుకుంటారు. మీకు ప్రభుత్వ, సహాయం చేస్తుందని, అంతేగాక కోటి రూపాయలు కూడా మంజూరు చేసింది అని మాయమాటలు చెపుతారు. కాని గిరిజనులు మీ సహాయం మాకొద్దని తిరిగి సమాధానం చెపుతారు. వెంటనే ఖాకీ నాయకుడికి కోపం వస్తుంది. "నక్సలైట్లను ఎక్కడ దాచారో చెప్పండి, లేదంటే మిమ్మల్ని కాల్చి చంపేస్తాను"[8] అని బెదిరిస్తాడు.

ఇంకా జనం వస్తూనే ఉంటారు. గిరిజనులు ఒకరి మొఖం ఒకరు చూస్తుండి పోతారు. పోలీసులు ముందు వరసల్లో వున్న వాళ్ళని కొడుతారు. దాంతో విసుగుచెందిన గిరిజనులు శత్రువులైన పోలీసోల్లను, తెల్లబట్టలోల్లను గూడెం సరిహద్దులు దాటేంత వరకు తరిమికొడతారు. స్థూలంగా 'తుడుం' కథలో సారాంశం యిది.

## మరట్ తుడుం పాయానా (మనందరం తుడుం గొట్టాలె) కథలో...

గిరిజనులు అష్టకష్టాలు పడి సంపాయించుకున్న భూముల్లో పంటలు పండించు కుంటూ వుంటే, పంట పండే సమయంల్లో భూమిని వదలి వెళ్ళిపోవాలని ప్రభుత్వాధి కారులు నోటిసులిస్తుంటారు. ఆ సమయంలో గూడెం వాళ్ళంతా కలిసి పోరాటం చేసి భూమిని కాపాడుకోవాలని నిర్ణయించు కుంటారు. చైతన్యంతో 'మనందరం' కలిసి తుడుం కొట్టాలి' అని అనుకోవడమే కథలోని ప్రధాన ఇతివృత్తం.

కథలోని పాత్రలు సోయింలింగు, చిన్ని, హన్మంతరావ్, రాజేశ్వరావు, రాజు సోనేరావు, అంబతి రావులు. స్థూలంగా చూసినట్లయితే సోయింలింగు ఎంతోకొంత తెలివికలవాడు. పొట్ట కూటికోసం వేసిన పంటను రామచిలుకల, గోరింకల బారి నుండి కాపాడుకోవడానికి సోయింలింగు కాపల కాస్తుంటాడు. అట్లా కాపల



కాస్తున్న వేళలో గోరింకల్ని కుందేళ్ళను పడుతుంటాడు.

సోయింలింగు వలె చిన్ని కూడా తెలివిగలదే. చిన్ని లింగుకు ఆలోచనల్లో అప్పుడప్పుడు సహాయపడుతుంటుంది. ఒకరోజు చిన్ని భర్తతో "నువ్వు ఇక్కడ పిట్టలను పడుతువుంటే, గూడెంలో మాత్రం పోలీసులు వచ్చి నోటీసులిస్తున్నారు"[9] అని అంటుంది.

సోయింలింగుకు అప్పటికే ఆకలితో కడుపు మండుతున్నా, చిన్ని మాటలు విన్న తర్వాత నోట్లో ముద్ద కూడా పెట్టలేకపోతాడు. ఆలోచనల్లో పడతాడు. పోలీసులు మాత్రం గూడెం మొత్తం కాగితాలు వేసిపోతారు. లింగుకు ఏమీ తోచక పోవడంతో 'హన్మంతరావ్ దాదాలేడా' అని చిన్నిని అడుగుతాడు. 'ఎవరు లేరు' అని చిన్ని చెప్పేసరికి మనసు బరువైపోతుంది. ఈ భూముల్లో 'మళ్ళీ పచ్చి తుమ్మల ప్లాంటేషన్ చేస్తారన్నమాట' అని లింగు తన బాల్యంలోని సంఘటనల్ని గుర్తుకు తెచ్చుకుంటాడు. ప్రక్కనే రాజేశ్వరావు వున్నాడేమోనని చూస్తాడు.

రాజేశ్వరావు అని పిలిచే సరికి, తన భార్య చిన్ని 'అతని అడగవచ్చుకదా' అని సలహా ఇస్తుంది. కాని లింగు దృష్టిలో రాజేశ్వరావు ఒక దొంగ, సర్కార్ బంటు. ఇంతలో గూడెంలో పోలీసులు వచ్చిన వార్తాంతా పంట కాపల కాస్తున్న వారందరికి తెలుస్తుంది. వెంటనే రాజు, సోయింలింగు ఇద్దరు కలిసి మాట్లాడుకుంటూ దారిలో వెళ్తుంటే చాలా మంది కలుస్తారు. లింగు గూడెం వచ్చి 'సోనేరావు ఉన్నాడని అడిగితే 'ఇంటి దగ్గర లేదు' అని చెప్తారు. మళ్ళీ కానిస్టేబులు వచ్చి నోటీసులు ఇచ్చి వెళతాడు. సోనేరావు ఇంటి దగ్గరే వున్నా, 'లేదు' అని చెప్తారు. దానికి కారణం లింగు వెంట పోలీసులు వుంటారు. పోలీసులు వెళ్లిపోయిన తర్వాత సోనేరావు కలగజేసుకొని 'లింగు ఈ సమస్యకు పరిష్కారం నువ్వే ఏమైనా చూడాల'ని అంటాడు. లింగు అమాయకంగా తనకు ఏమి తెలుస్తుంది అని నటిస్తాడు. అందరు కలిసి సమావేశమై మాట్లాడుకుంటారు. లింగు కోపంతో "మనందరం భూములు వచ్చాయ్ అని ఆనందంతో, పొరకల సార్లను దూరం చేసుకున్నాము. మనలో మనకు భూమికోసం తగాదాలు పడుతున్నాం' అనే సరికి మధ్యలో సోనేరావు కలగజేసుకొని 'పాత విషయాలు అలా పెట్టు, ఇప్పుడు పొరకల సార్లు ఎక్కడుంటారు"[10] అని అడుగుతాడు. సోయింలింగు చెపుతాడు, పొరకల సార్లు వచ్చి సమస్యలను తీరుస్తారు.

ఇక నుంచి గిరిజనులంతా "మనమందరం కలిసి మెలసి ఉండాలను"కుంటారు. భూముల్లో పంటలు పండించుకోవడానికి ఎంత కష్టపడుతామో భూమి దక్కించుకోవడానికి అంతకంటే ఎక్కువ కష్టం పడాలంటారు. అందుకు పోలీసోల్లు తుపాకులు పడితే మనమూ తుపాకులు పట్టాలి. వాళ్ళు దాడి చేస్తే మనమూ దాడి చేయాలను కుంటారు. నువ్వు నేను అని భేదం లేకుండా ప్రతి చిన్న సమస్యను అందరూ కలిసి ఎదుర్కోవాలని నిర్ణయించు కుంటారు. అందుకు అందరు కలిసి తుడుం కొట్టాలని కూడా నిర్ణయించుకుంటారు.

## రగల్ రాజ్జెం మైసివాకట్ కథ

ఈ కథలోని ప్రధాన ఇతివృత్తం – గిరిజనుల మధ్య తలఎత్తె భూతగాదాలు, ఆ తగాదాలు తీర్చడానికి వచ్చే అన్నలు (నక్సలైట్లు) అన్నల మూలంగా ఏర్పడే చైతన్యం ... చివరకు గిరిజనులు తమ భూములను తామే కాపాడుకోవడం కోసం పోలీసుల్ని, కాంట్రాక్టర్లను తరిమికొట్టడం.

ఈ కథలో గిరిజన ప్రజలే పాత్రలుగా కనిపించడం విశేషం. గోండులు తరతరాలుగా అడవి భూములకు అధిపతులమని అనుకుంటారు. గోండు వాళ్ళ తర్వాత మరాఠీలు, లంబాడీలు తెలుగువాళ్ళు చేరి బంజర్ భూములను ఆక్రమించుకుంటూ ఉంటారు. దాని వల్ల గిరిజనుల్లో భూమికి సంబంధించిన తగాదాలు ప్రారంభమవుతాయి. ఈ తగాదాలను తీర్చేందుకు పొరకల పార్టీవారు (పొరకల పార్టీ అంటే గోండి భాషలో నక్సలైట్ల పార్టీ అని అర్థం) ఆ గూడెంకు వస్తువుంటారు.

ఆ గూడెం పెద్ద ఎగోదిరావు. పొద్దునే గూడెం బయటికి వచ్చి ఎగోదిరావు అవతల వైపు చూడగానే అంబలి తింటు ఇస్రూ కన్పిస్తాడు. ఇస్రూతో 'ఈ రోజు పంచాది (పంచాయితి) వుంది కదా మరిచిపోయావా' తుడుం గొట్టుపో అని పంపుతాడు. ఇస్రూ 'టట్టర ... టట్టర' అని తూడుం కొట్టుతాడు. చుట్టు ప్రక్కల వున్న గూడెం వారందరు ఆ తూడుం మోత విని వస్తుంటారు. వచ్చిన వారందరు ఒక దగ్గర చేరి, రెండు గుంపులుగా విడిపోయి కూర్చుంటారు.

అడవికి వచ్చిన వారిలో మరాఠి, లంబాడా, గోండు, తెలుగు, గిరిజనేతరులు ఉంటారు. వచ్చిన తెగల వాళ్ళు, తమలో తాము మాట్లాడుకుంటు తగాదాలకు



దిగుతారు. గోండు నాయకుడు 'భగవతిరావు' వచ్చి మంచి మాటలు చెప్తాడు. దాంతో తగాదా సద్దుమణుగుతుంది.

గిరిజన తెగలు కూర్చున్న చోటుకి పొరకల సార్లు వస్తారు. రాగానే గిరిజన ఆచారం ప్రకారం 'రామ్ ...రామ్' అని చెప్తారు. పొరకల సార్లు గిరిజనుల్లో జరుగుతున్న తగాదాల గురించి, విషయాలను తెలుసుకొని ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తారు. లంబాడా రైతు కలగజేసుకొని 'మీ పొరకల పార్టీ కేవలం గోండు వాళ్ళకోసమే' అని అంటాడు.

పొరకల పార్టీ కేవలం గోండు వాళ్ళ కోసమే కాదు, మనందరి కోసం అని ఆ పార్టీ నాయకుడు చెప్తాడు. ఆ తర్వాత అందరు వాళ్ళ, వాళ్ళ సమస్యలను చెప్పుకుంటు వుంటారు. ఇంతలో పొరకల పార్టీ నాయకుడు రెండు తెగల నుంచి ఎవరో ఒక నాయకుడు లేచి చెప్పండి అని అంటాడు. రెండు తెగల నుంచి లేచి చెపుతూ వుంటారు. గోండు నాయకుడు 'ఎగోదిరావు' పూర్వ కాలం నుండి నేటి వరకు జరిగిన అన్యాయాలు, అవమానాలు, తగాదాలు, భూ ఆక్రమణాల గురించి చెప్తాడు.

పొరకల పార్టీ నాయకుడు గిరిజనులందరిని ఉద్దేశించి మనలో మనం తగాదాలు పెట్టుకోవడం వల్లే మన తగాదాలు పోలీసులకు ఆయుదాలుగా మారుతున్నాయి. అందువల్ల "మనమంతా కలిసి నడువాలి. కలిసి భూములను పంచుకోవాలి, కలిసి అడవి నరకాలి, కలిసి తుడుం కొట్టాలి. మన శత్రువుల రాజ్యం అంతరించే దాకా, దున్నే వానికి భూమి వచ్చేదాకా"[11] అని చెప్తాడు. పొరకల పార్టీ నాయకుడు చెప్పిన మాటల వల్ల వాళ్ళలో ఐకమత్యం వస్తుంది. చైతన్యం కల్గి గిరిజనులందరు కలిసినడుస్తారు. తమ గూడేనికి లారీతో వచ్చిన కాంట్రాక్టరు (మార్వాడే చున్నిలాల్) గిరిజనుల ఐకమత్యం చూసి నివ్వెర పోతాడు. వాళ్ళ ముందు తమ తెలివి తేటలు ఏమి పని చేయవని భావిస్తాడు. చివరికి కాంట్రాక్టరు తన్నులు తిని పారిపోయి, పోలీసులకు చెప్తాడు. దాంతో ఆ గూడెనికి పోలీసువాళ్ళు రావడం జరుగుతుంది. గిరిజనులందరు కలిసి పోలీసు వాళ్ళను తరిమికొడతారు.

అన్యాయంగా నాశనం చేస్తున్న కాంట్రాక్టర్ల యొక్క ప్రాజెక్టు పనులను గిరిజనులు నిలిపివేస్తారు. దాంతో ప్రభుత్వం దిగివస్తుంది. ఆ జిల్లా కలెక్టరు

గిరిజనులకు కొన్ని ఆశలు చూపి ఒప్పించడానికి ప్రయత్నిస్తాడు. మొదట కలెక్టరు మాటలు తిరస్కరించినా, తర్వాత ఒప్పుకుంటారు.

చివరికి ఆ గూడెం వాళ్ళు నక్సలైట్లకు సహాయం చేస్తున్నారని పోలీసు వాళ్ళు తెలుసుకుంటారు. దాంతో ఆ గిరిజన గూడేన్ని పట్టుకోవడానికి ప్రభుత్వం పోలీసువాళ్ళను రెండు గ్రూపులుగా నియమిస్తుంది. కాని దున్నే వాడికే భూమి అనే నినాదంతో గిరిజనులు పోలీసులను తరిమికొడతారు. అయిన పోలీసులు కొంత మంది గిరిజనులను అరెస్టు చేస్తారు. కాని వాళ్ళలో దాగివున్న విప్లవ చైతన్యం ఆగిపోదు. అది ముందుకు అడుగులు వేస్తూనే ఉంటుంది.

## గంగజిమ్మ కథ

'గంగజిమ్మ' కథలోని ప్రధాన ఇతి వృత్తం – గిరిజనులకు, నక్సలైట్లకు మధ్య అనుబంధాలను, మానవీయ సంబంధాలు. ఎంత నిర్బంధంలోనూ కష్టాల్లో, జ్వరాల్లో ఆదివాసీలను ఉద్యమకారులు ఆదుకునే సంకల్పం, నిరక్ష్యరాస్యులైన గిరిజనుల తెలివి తేటల్ని వెలికి తీసి చూపడం ఈ కథలో ప్రధాన అంశం. ప్రకృతి వర్ణన, సన్నివేశ చిత్రణ ఈ కథలో అపూర్వం. అనిర్వచనీయం. కథలో లీనమైపోతాం.

ఈ కథలో ప్రధాన పాత్ర చిన్నన్న. పాపన్న, అక్కమ్మ, నర్సిగాడు, అంజి, సమ్మన్న, ఇస్తారక్క ఉపపాత్రలు.

గోదావరికి కొంత దూరంలో ఒక కోయగూడెం ఉంటుంది. గోదావరి కాలువ నిరంతరం పారుతున్న గాని, ఆ గూడెం మాత్రం అభివృద్ధి చెందదు.

పాపన్నకు ఒక అన్నయ్య, ఇద్దరు చెల్లెలు ఉంటారు. అన్నయ్య పెళ్ళి చేసుకుని వేరుగా వుంటున్నాడు. పాపన్న పెద్ద చెల్లి అక్కమ్మ. ఆమె చాలా తెలివైనది. చిన్న తనంలోనే ఉద్యమం అంటే చాలా ఆసక్తి చూపుతూవుంటుంది. కాని అనారోగ్యంతో మంచం పడుతుంది. ఆమెను డాక్టర్‌కు చూపించాలనే ఉద్దేశ్యంతో పాపన్న అడవికి వచ్చి చిన్నన్న దళాన్ని కలుసుకుంటాడు. దళంలో ఉన్న వారందరికి అక్కమ్మ అంటే చాలా ఇష్టం. ఎందుకంటే మొట్ట మొదటిసారిగా దళం వారు కోయ గూడెంకు వచ్చినప్పుడు ఆ గూడెంలో వుండే వారెవరికి అనుమానం రాకుండా మా పెద్దమ్మ కొడుకులని చెప్పి అందరిని నమ్మించి, ఆ పూటకు కావలిసిన ఆహారాన్ని వాళ్ళకు ఇచ్చి ఊరు దాటిస్తుంది.అక్కమ్మ ఆ సమయంలో చేసిన సహాయం మరువలేనిదని అనుకుంటారు దళ సభ్యులు.

ఆ దళ నాయకుడు చిన్నన్న (చిన్నన్న డాక్టరుకూడా). దళ బాధ్యతలు బాబన్నకిచ్చి పాపన్నతో కలిసి చిన్నన్న, అక్కమ్మకు వైద్యం చేయడానికి గూడెంకు వస్తాడు. గూడెంకు రాగానే జ్వరంతో బాధపడుతున్న అక్కమ్మను చూస్తాడు. వైద్యం చేసి మందులిస్తాడు. దాంతో అయిదు నిమిషాల్లో తేరుకుంటుంది. చిన్నన్న వచ్చారని గూడెం వాళ్ళు తెలుసుకుని అందరూ వస్తారు. చిన్నన్నతో ఆ గూడెం వాళ్ళు తమ బాధలను చెప్పకుంటారు. చిన్నన్న గూడెంకు వచ్చిన విషయం 'సాలె సాంబయ్య' పోలీసులకు చెప్తాడు. వెంటనే పోలీసులు ఆ గూడెంకు వస్తారు.

ఆ గూడెంలో ఎంతో కొంత పేరున్న వ్యక్తి మాంజి. అతనితో మేజర్ 'మీరు నక్సలైట్లను ఎక్కడ దాచారని' బెదరించి అడుగుతాడు. వెంటనే మేజర్ తన వెంట వచ్చిన పోలీసులను 'గుడిసె గుడిసె'లో వెతకండి దొరుకుతాడు' చెప్పి అతడు అక్కడే కూర్చుంటాడు. తర్వాత ఆ గూడెంలో వుండే బడిపంతులు కలుగ చేసుకొని పోలీసులను వారిస్తాడు.

చిన్నన్న గురించి మాంజి, కనుసైగలతో నర్సిగానికి చెప్పాడు. నర్సిగాడు ఆ సమయంలో చాలా చురుకుగా అర్థం చేసుకుని పాపయ్యతో కలిసి ఎదురుగా వస్తున్న పశువులను సర్కార్ బావి వైపు తోలుకెళ్తాడు. పోలీసులకు కన్పించి కన్పించనట్లుగా వుండి, తమ వెంట చిన్నన్నను తీసుకొని పోతాడు. దారిలో వస్తున్న సమ్మన్నకు, చిన్నన్నను అప్పగిస్తాడు. సమ్మన్న, చిన్నన్నను తమ ఇంటికి తీసుకెళ్తాడు. అప్పటికే సమ్మన్న ఇల్లును పోలీసులు చూసి వెళ్ళి పోయి వుంటారు.

సమ్మన్న భార్య పేరు ఇస్తారక్క. ఆమెకు ఉద్యమం అంటే ప్రాణం. చిన్నన్న ఇస్తారక్కను చూడగానే అనారోగ్యంగా ఉందని గమనిస్తాడు. వెంటనే తన దగ్గర ఉన్న మందులు ఇస్తారక్కకు ఇస్తాడు. ఇంతలో సమ్మన్న ఇంటి ముందు కాళ్ళ చప్పుడు అవుతుంది. కాని వచ్చింది సమ్మన్న తమ్ముడు. ఆ సమయంలో ఇస్తారక్క చిన్నన్నను కాపాడుకోవడానికి చేసిన ప్రయత్నం ప్రత్యేకమైనది. ఏమిటంటే ఇంటి ముందు వచ్చిన వారు పోలీసులు అయితే, తప్పించుకోవడానికి గుడిసెలోపలి నుండే దారిని చేస్తుంది. ఆ సమయంలో ఇస్తారక్క చేస్తున్న పనిని చూసి చిన్నన్న మనస్సు కృతజ్ఞతలతో నిండి పోతుంది. ఆ పని చేయడానికి ఇస్తారక్కకు ఎంతో

సమయం పట్టదు. గూడెంలో పోలీసు వాళ్ళు వెతికి, వెతికి అలసిపోతారు. తర్వాత సమ్మన్న చిన్నన్నను తీసుకొనిపోయి పాపన్నకు అప్పగిస్తాడు. ఆ రాత్రి ఇద్దరికి అడవిలోకే భోజనం వస్తుంది. పాపన్న, చిన్నన్న ఇద్దరు కలిసి వెన్నెల రాత్రిలో అడవిలో అలా నడుచుకుంటూ వెళ్ళడంతో కథ ముగుస్తుంది.

## గెరిల్లా కథలో...

'గెరిల్లా' కథలో ప్రధాన ఇతివృత్తం అడవుల్లో నివసిస్తున్న గిరిజనులు. వీరి వెంటవున్న అన్నలు, మైదాన ప్రాంతాల నుండి నిరంతరం అడవులపై దాడి చేసే పోలీసువాళ్ళు, వీరందరు ఒకరి కోసం ఒకరు, పదవుల కోసం మరికొందరు, ఆ అడవుల్లో పడే బాధలను చిత్రించడం. 'గెరిల్లా' కథలో ఉద్యమకారులు పూర్తికాలం కార్యకర్తలుగా, దళాలుగా తిరుగుతూ ప్రజల మధ్య ఉంటూ గెరిల్లా సైన్యంగా ఎదుగుతూ ప్రజల నుండి గెరిల్లా సైన్యాన్ని తయారు చేసే క్రమం చిత్రించారు.

ఉద్యమ కాలంలో గిరిజనుల వెంటుండేది నక్సలైట్లు మాత్రమే. వారికి విద్యను, వైద్యాన్ని అందించాలన్నా, చివరికి వాళ్ళకు జీవనాధారమైన భూమిని రక్షించాలన్నా అన్నలు మాత్రమే తోడు వుండేవారు. దళ సభ్యులు రెండు రోజుల నుండి తిండిలేక అడవుల్లో నడుస్తూ వుంటారు. ఒక్కసారి దళకమాండర్ దళ సభ్యులకేసి చూస్తాడు. కొత్తగా దళంలో చేరిన 'రవి' ముఖాన్ని చూస్తే చాలా జాలేస్తుంది దళకమాండర్‌కు. అయినా నడవక తప్పదు. అలానే నడుచుకుంటు దళసభ్యులు, వాళ్ళని వెతుకుతూ పోలీసువాళ్ళు వెళ్తుంటారు. మధ్యలో పోలీసువాళ్ళు దారి తప్పి చివరికి వెనుతిరిగి వస్తారు.

పోలీస్ నాయకుడు రివార్డ్ కోసం తహ తహలాడుతుంటాడు. అతని కోరిక, కోరికలాగే మిగిలిపోతుంది. పోలీస్‌వాళ్ళు నడచి నడచి అలిసిపోయి గిరిజన గూడెంకు వస్తారు. ఆ గూడెంలో పది ఇండ్ల దాకా ఉంటాయి.

కమాండర్ 'నీళ్ళు తెండని' మిగిత వారికి ఆజ్ఞ చేస్తాడు. ఆ గూడెంలో ఎవరు ఉండరు. ఎంత వెతికిన చివరికి ఎవరు కన్పించరు. అయితే కోపంతో పోలీస్‌వాళ్ళు ఇంట్లో ఉన్న అమాయక గిరిజన స్త్రీలపై అసహ్యంగా ప్రవర్తిస్తారు. ఆ గూడెంలో జ్వరంతో బాధపడుతున్న గిరిజన యువకుడ్ని కొట్టి, అరెస్ట్ చేసి జీపులో ఎక్కించుకు పోతారు. మరి కొద్ది సేపటికి 'తుడుంమోత' వినిపిస్తుంది. వందలాది మంది జీపు చుట్టు చేరుతారు. పోలీస్ నాయకుడికి ఒక్కొక్కరిని కాల్చి



చంపాలని వుంటుంది. కాని తనకు బలంగా ముందు వెనుక ఎవరులేరు. అందువల్ల మాటలతో రాజీపడి యువకుడ్ని వదిలిసి వెళ్ళిపోతాడు. కాని అన్నలు మాత్రం తమ వెంట పోలీసులు వస్తున్నారనే ఉద్దేశంతో అలానే నడుస్తూ వుంటారు. దారిలో నీళ్ళు తాగి విశ్రాంతి తీసుకుంటారు.

దళం వాళ్ళు ఒక ప్రాంతంలో చేరిన తర్వాత పార్టీవాళ్ళు వచ్చారని, గూడెంవాళ్ళు తెలుసుకొని చాలా మంది వస్తారు. వచ్చినవారిలో 'బడేరావు' 'జంగు' 'బీమ్‌రావు' 'హన్మంతు' మొదలైన వారు కూడా వుంటారు. గూడెం వాళ్ళు తమకి జరిగిన అన్యాయం అవమానాలు గురించి దళ సభ్యులకి చెప్పి, ఆ తర్వాత వాళ్ళని భోజనానికి పిలుస్తారు. దళ సభ్యులు ఒక్కొక్కరింటికి ఒక్కొక్కరు వెళుతారు. దళనాయకుడు, రవి మాత్రం హన్మంతు వాళ్ళ ఇంటికి పోతారు. హన్మంతుకు నాలుగు సంవత్సరాల కొడుకు వుంటాడు. దళ నాయకుడు, రవి అన్నం తింటున్నప్పుడే హన్మంతు కొడుకు ఆకలితో వాళ్ళవైపు చూస్తాడు. వారు పిలిచి అన్నం తినిపిస్తారు. తిన్న తర్వాత అక్కడి నుండి బయలు దేరారు.

తిరిగి వెళ్తుంటే దారిలో మొక్క జొన్నలు దొరికితే ఆహారంగా తయారు చేస్తారు. మొక్క జొన్న ఆహారాన్ని చూసి వాళ్ళ ఆకలి మరింత ఎక్కువవుతుంది. ఎందుకంటే గూడెంలో చాలినంత ఆహారం దొరకదు. ఇంతలో సెంట్రి డ్యూటి మీదవున్న దళసభ్యుడు ప్రమాద, ఉందన్న సంగతిని చెప్పేసరికి క్షణంలో తిరిగి యుద్ధానికి తయారవుతారు. ఉడికిన జొన్నలను కామ్రేడ్ రైతు తువ్వాలతో పట్టుకొని వాళ్ళ వెంట నడుస్తాడు. శత్రువు రానంత దూరం అడవిలోకి వెళ్ళిపోతారు. అంతవరకు గిన్నెను చేతిలో పట్టుకున్న కామ్రేడ్, ఎండిన ఆకులను తెంపి చుట్టగా మలిచి నెత్తిమీద పెట్టుకుంటాడు. ఎండిపోయిన 'సెలి యేటి ఇసుక' లో నాటుకుపోతున్న పాదాలను ఈడ్చుకుంటు ఒక్కసారి తూలుతాడు. ఆ ఊపుకు నెత్తి మీద వున్న 'గిన్నె' ఇసుకలో పడుతుంది. ఆ గిన్నెలో ఉన్న గింజలన్ని ఇసుకలో కలిసిపోతాయి. దానిని చూసి దళ సభ్యుల ఆకలి చుక్కల్లో కలిసిపోతుంది.

ఈ కథను చదివితే అడవిలో దళ సభ్యులు పడే బాధలు, వాళ్ళను పట్టుకోవడంలో పోలీసులు ఎదుర్కొనే కష్టాలు ఎంత భయంకరంగా వుంటాయో తెలుస్తాయి. దీనితోపాటు గిరిజనులు దళ సభ్యులతో ఎలా కలిసిపోతున్నారో స్పష్టమవుతుంది.

ఈ కథలు గిరిజన జీవితంతో బాగా మమేకమై జీవించిన వ్యక్తులు తప్ప మరెవరు రాయలేరు.

## కథల వస్తు విశ్లేషణ

ఈ కథలను పరిశీలించిన తర్వాత కథా వస్తువుతో పాటు కథా శిల్పం, శైలి అంతా గిరిజన జీవితాలను పెనవేసుకుని వున్నదని స్పష్టమవుతుంది. గిరిజన జీవితాల్లోని అనేక చీకటి కోణాలను అందుకు గల కారణాలను, వ్యవస్థను ఈ కథలు విశ్లేషించాయి. ఆధునిక నాగరిక సమాజాలలో మానవులు అత్యంత విలాసవంతమైన జీవితాలను అనుభవిస్తుంటే, గిరిజనులు మాత్రం ఇంకా కనీస అవసరాలైన కూడు, గూడు, గుడ్డలకోసం పోరాటం చేయాల్సిన పరిస్థితిని ఈ కథల్లో ఎంతో ప్రతిభావంతంగా రచయితలు అందించ గల్గారు. అడవిలో వెన్నెల కథల ముఖ చిత్రంపై 'గిరిజన పోరాట కథలు' గా వీటిని పేర్కొన్నారు. ఈ పోరాటం అనేక కోణాల్లో వైవిధ్యపూరితంగా కొనసాగింది. ముఖ్యంగా

1. ప్రకృతితో పోరాటం
2. సంప్రదాయాలతో పోరాటం
3. గిరిజనేతర సామాజిక వ్యవస్థలతో, అధికారులతో పోరాటం చేయడం

ఈ కథల్లో కనపడుతుంది.

## ప్రకృతితో పోరాటం

గిరిజనులకు ప్రకృతి తల్లి ఒడిలాంటిది. గిరిజనులు అడవినే నమ్ముకుని జీవిస్తారని, పోడు వ్యవసాయం చేసుకుంటారని, సంచార, జీవితం కూడా గడుపుతారని వారి జీవన విధానం గురించి ముందే తెలుసుకున్నాం. అలా జీవించేటప్పుడు గిరిజనులకు అనివార్యంగా ప్రకృతిలోని భాగాలైన జంతువులు, విషసర్పాలు మొదలైన వాటితో పోరాటం చేయక తప్పదు. ఆ పోరాటంలో ప్రాణాలు కూడా కోల్పోవాల్సిన పరిస్థితి వస్తుంది. 'రక్తపింజెర' కథలో 'మల్కుబాయి' పాము కాటుకు మరణిస్తుంది. సమాజంలో ఒక వైపు ఆధునాతన వైద్యం, ప్రయాణ సాధనాలు వేగవంతం అవుతున్నా, గిరిజనులకు సరైన వైద్యం లేదు. ప్రయాణ సౌకర్యాలు లేవు. ప్రకృతిలోని ఆకుపసర్లనే ఔషధాలుగా మార్చుకోవాల్సి వస్తుంది. 'మల్కుబాయి' కి అలాగే జరిగింది. ఆ ఆకుపసరు వైద్యం వికటించింది. ఈ ప్రకృతి పోరాటంలో గిరిజన స్త్రీ ప్రాణం కోల్పోవాల్సివచ్చింది. అలాగే 'కన్నీటి



కథ – నీటి కథ' లో 'ఆత్రం సుక్కుబాయి' గుడ్డేలుగు చేసిన దాడిలో చనిపోవాల్సి వచ్చింది. ఇలాంటి కథలు ఈ సంపుటిలో చాలా వున్నాయి. సమాజంలోని సౌకర్యాలు ఏ తరగతులవారికి అందుబాటులోకి వస్తున్నాయో ఆలోచించు కోవాల్సిన అవసరాలను గిరిజనులు ప్రకృతిలో చేసే పోరాట గాథలు మనకు స్పష్టం చేస్తున్నాయి.

## సంప్రదాయాలతో పోరాటం

ప్రకృతికి మానవుడికి మధ్య అవినాభావ సంబంధం వుంటే, ప్రకృతిలోని అనేక అంశాల పట్ల మానవుడు నమ్మకాన్ని కల్గి ఉంటాడు. తన నిత్య జీవితంలో ఎదురయ్యే అనుభవాల నుండి ఆ నమ్మకాలు ఏర్పడవచ్చు. మరికొన్ని సార్లు ఇతరుల అనుభవాలను పంచుకోవడం ద్వారా ఏర్పడవచ్చు. శాస్త్రీయత, అశాస్త్రీయత అనే తార్కిక సంబంధంతో నిమిత్తం లేకుండానే ఆ నమ్మకాలు కొనసాగించవచ్చు. వర్షం కురవడం వల్ల నీళ్ళు లభిస్తున్నాయి. వాటి వలన అనేక జీవాలు దాహం తీర్చుకుంటున్నాయి. మానవుడితో సంబంధం లేకుండానే మొక్కలు పెరుగుతున్నాయి. వృక్షాలు ఫలిస్తున్నాయి. అవి మానవులకు ఆహారం అవుతున్నాయి. ఇవన్నీ వర్షం వలనే సాధ్యమవుతున్నాయి. కాబట్టి వర్షం మానవులు జీవించటానికి అత్యవసరం.

మనకు కావల్సినపుడు వర్షాలు కురవాలంటే మొక్కలు నాటాలి, చెట్లు పెంచాలి, వాటిని పరిరక్షించుకోవాలి. ఇవన్నీ సామాన్య ప్రజలకు చెప్పడం కంటే వృక్షాలను కొట్టకూడదని, అవి దైవ స్వరూపాలని ఒక నమ్మకాన్ని కల్గిస్తారు. దాని వలన చెట్లను కాపాడుతాం. వాటిని రక్షించడమే కాకుండా, వాటిని పూజిస్తాం. నిజానికి చెట్లను పూజించడం అనే ఒక నమ్మకం. వర్షం కురవాలంటే చెట్లు వుండాలి అనేది శాస్త్రీయమైన అంశం ఇవన్నీ అందరికి తెలిసే పూజలు చేయడం వంటివి చేయరు, అవి నమ్మకాలుగా స్థిరపడిపోతాయి. ఆ నమ్మకాలు గిరిజనులలో ఎక్కువ. చెట్లను నరికేయడం, జంతువులను చంపడానికి ఇష్టపడరు. అవి వారి జీవితంలో ఒక భాగం. వారి నమ్మకం వెనుక ఒక జీవన విధానమే ఆధారపడివుంది. అలా పంచభూతాలతో మానవుడికి గల అనుభవాన్ని వివిధ నమ్మకాలుగా కొనసాగిస్తున్నారు. ఈ నమ్మకాలను గిరిజనులు ఎక్కువగా విశ్వసిస్తారు. కొన్ని సార్లు వారి నమ్మకాలను ఎంత శాస్త్రీయంగా వివరించినా అర్థం చేసుకోరు.

తమ అస్తిత్వం ఏదో నాశనం అవుతున్నట్లు భావిస్తారు. ఆ నమ్మకాలు కొనసాగకపోతే కీడుగా భావిస్తారు. వాటిని నేరవేర్చడానికి ఎంత ఖర్చు చేయడానికైనా వెనకడుగువేయరు. కొన్ని నమ్మకాలు వైద్యంతో కూడా ముడిపడివుంటాయి. అవి వారి మానసిక బలహీనతలను బట్టి ఏర్పడవచ్చు. వాటిని కొంత మంది తెలిసి వారి బలహీనతలను సొమ్ము చేసుకోవడానికి ఉపయోగించుకుంటారు. మరికొంత మంది వారి ఆర్థిక, మానసిక స్థితులను, ప్రకృతి వైద్యాన్ని నమ్మేటట్లు చేస్తారు. అవి భిన్న సంఘర్షణలకు కారణమవుతాయి. నమ్మకాలు ఆచారాలుగా మారిపోయి సామాజిక వ్యవస్థను మరింత కఠిన తరం చేస్తాయి. అలాంటప్పుడు కూడా ఈ సంఘర్షణలు తప్పవు. ఏదో కారణాన్ని చూపి మరో దానితో సమన్వయం చేస్తూ జీవితానుభవాలను దర్శించుకోవడం గిరిజనుల్లో ఎక్కువగా కన్పిస్తుంది. ఎవరో చెప్పిన మాటను బట్టి చదువుకుంటే తమ ఇంటికి కీడని తరతరాలుగా చదువుకు దూరం అవుతారు. ఎవరైనా తెగించి ముందుకువస్తే, ఆ వ్యవస్థతో తీవ్రంగా ఘర్షణ పడక తప్పదు. అలాగే వైద్యంలో కూడా జరుగుతూవుంటుంది. ఆర్థిక పరిస్థితులు అవగాహన రాహిత్యం ప్రకృతి వైద్యాన్ని నమ్మేటట్లు చేస్తుంది. చదువుకున్న వాళ్ళు ఆర్థికంగా సహాయం చేసి వైద్యం చేయించాలని ప్రయత్నించినా తమలో శాస్త్రీయంగా జీర్ణించుకున్న నమ్మకాల వలన శాస్త్రీయ వైద్యాన్ని నిరాకరిస్తూవుంటారు. ఆర్థిక పరిస్థితి బాగుండక పోయిన తమ సంప్రదాయం ప్రకారం కుటుంబంలో జరిగే అనేక కార్యక్రమాలకు అధిక మొత్తంలో ఖర్చు చేస్తుంటారు. అలా చేయకపోతే కీడు వెంటాడుతుంటుందని నమ్ముతూవుంటారు. ఇలాంటి వాటిని కూడా కొన్ని కథల్లో రచయితలు చిత్రించే ప్రయత్నంచేశారు. 'కాయిదా' కథలో ప్రకృతి బీభత్సల నుండి పంటను కాపాడుకోవడానికి కోళ్ళను కోయడం వంటివి చేశారు. 'జెండా' కథలో వర్షం కోసం కార్యక్రమం చేయడం, అవి చేసేటప్పుడు చెట్టుని రాయిని దైవంగా భావించడం జరుగుతుంది. 'పెళ్ళికావాలి' కథలో 'జుగ్నాక బొజ్జు' తన కొడుకు పెళ్ళి చేయడం కోసం ఎదురు కట్నం 'ఓలి' ఇవ్వడానికి తన జీవనాధార మైన పశువుల్ని అమ్మేయవలసి వస్తుంది. మనం ఏర్పరచుకున్న సంప్రదాయాలు, నమ్మకాలే మన పాలిట గుది బండలుగా తయారయ్యే విధానం ఈ కథలో కన్పిస్తుంది. ఇవన్నీ ఒక విధంగా గిరిజనులు తమ నమ్మకాలతో చేసే పోరాట నేపథ్యాన్ని వివరించే కథలు.



## గిరిజనేతర సామాజిక వ్యవస్థలతో పోరాటం

మానవులకు భౌగోళికంగా, వర్ణాలపరంగా, భాషాపరంగా, లింగపరంగా, రూపురేఖలను అనుసరించి వివిధ విభాగాలుగా సామాజిక శాస్త్రవేత్తలు విభజిస్తూవుంటారు. అలా గిరిజనులను కూడా ఒక ప్రత్యేక వర్గంగా విభజించారని ఇంతకు ముందే వివరించుకున్నాం. వారి జీవన విధానం, భౌగోళిక పరిస్థితులు, భాష వారిని గుర్తించడానికి ప్రధాన ఆధారం.

ప్రపంచ వ్యాప్తంగా వున్నా గిరిజనులకు కొన్ని ప్రత్యేక ఆచారాలు కొనసాగుతున్నాయి. తమ జీవన విధానానికి అవసరమైన ఒక ప్రత్యేక వ్యవస్థ ప్రతి గిరిజనులకు వుంటుంది. నాగరిక సమాజం నుండి గిరిజనుల ప్రత్యేక అస్తిత్వాన్ని గుర్తించేది ఆ ప్రత్యేక వ్యవస్థే. గిరిజన సంస్కృతి ఆ ప్రత్యేక వ్యవస్థలో ఒక భాగం మాత్రమే. కనుక గిరిజన సంస్కృతినే గిరిజన వ్యవస్థగా చెప్పలేం. గిరిజనులు నాగరిక సమాజం అనుసరించే చట్టాలకంటే, న్యాయం కంటే ఒక ప్రత్యేక వ్యవస్థను కల్గి ఉంటుంది. ఆ వ్యవస్థ తమ జీవన విధానానికి అత్యంత సమీపంలో వుంటుంది. అత్యంత ఆచరణ యోగ్యంగా వుంటుంది. అంతే కాదు వారి దృష్టిలో సరళంగా వుంటుంది. ఆ వ్యవస్థకు అలవాటు పడిన గిరిజనుడు, గిరిజనేతర వ్యవస్థలతో సంఘర్షణ పడక తప్పటం లేదు. తాము ఏర్పరచుకున్న వ్యవస్థ ప్రకారం వివాహ సమయంలో కట్నకానుకలు వుంటాయి. అవి గిరిజనేతర వ్యవస్థ ప్రకారం నేరం. అంటే ప్రభుత్వ చట్టాల ప్రకారం నేరంగా భావిస్తారు. అలాగే ప్రకృతిలో దొరికే ఫలాలను అనుభవించడం, పక్షులను, చేపలను వేటాడి జీవించడం గిరిజన వ్యవస్థలో ఒక భాగం. కాని గిరిజనేతర వ్యవస్థ అంటే చట్టం ప్రకారం అడవులను నరకడం, వాటి ఫలాలను అనుభవించడం, చేపలను పట్టడం, తాము పెంచుకున్న పక్షులను తామే తినడం వంటి వాటి విషయంలో చట్టం ప్రకారం కొన్ని నియమ నిబంధనలు పాటించడం జరుగుతుంది. అలాగే తమ ఇష్టం వచ్చిన చోట నివసించే సౌకర్యం గిరిజన వ్యవస్థలో కొనసాగిస్తుండగా, చట్ట ప్రకారం చూసినప్పుడు నివాసం వుండడానికి, ఇల్లు కట్టుకోవడానికి అనేక నియమ నిబంధనలు పాటించాలి. ఇవన్నీ తమ జీవితాలల్లో సంక్లిష్టతకు కారణాలవుతున్నాయి. సంఘర్షణకు మార్గం వేస్తున్నాయి. గిరిజన జీవిత అనుభవాలతో, జీవన విధానంతో సరైన అవగాహన లేకుండా రూపొందే చట్టాలు,

శాసనాలు, గిరిజనుల పాలిట శాపాలుగా మారుతున్నాయి. నిర్లక్ష్యరాస్యత, ఆర్థిక పరిపుష్టి లేకపోవడం వంటి కారణాల వల్ల ఆ చట్టాలనూ, ఆ శాసనాలను అర్థం చేసుకోలేక పోతున్నారు. దళారులు బయలుదేరి గిరిజనులను దోపిడి చేస్తున్నాయి. తమ వ్యవస్థను నాశనం చేస్తున్నాయి. చట్టాలు, న్యాయాలు పట్ల గిరిజనులుఅనివార్యంగా పోరాటం చేయక తప్పడం లేదు. వీటికి ప్రతిరూపాలే గిరిజనులను వేధించే పోలీసులు, కాంట్రాక్టర్లు మొదలైన వారు.

అడవిలో వెన్నెల' కథా సంకలనంలో చాలా కథల్లో ఈ సమస్యలను విశ్లేషించారు. 'జెండా కథ' లో వర్షంకోసం తమ సంప్రదాయం ప్రకారం చేసే పూజలో భాగంగా జెండాలు ఎగురవేస్తారు. అవి పోలీసులు చూసి నక్సలైట్లు గృహాక్రమణ కోసం గిరిజనుల చేత నక్సలైట్లే ఆ పనులు చేయించారని గిరిజనులను శిక్షించడానికి ప్రయత్నిస్తారు. వర్షంకోసం పూజలో భాగంగా జెండాలు పాతారని తర్వాత విచారణలో తేలుతుంది. ఈ మధ్యలో గిరిజనులు అనేక కష్టనష్టాలకు గురైయ్యారు. దీనికి కారణం గిరిజన వ్యవస్థను అర్థం చేసుకోలేని గిరిజనేతర వ్యవస్థ చర్యల ఫలితం. కనుక గిరిజనులకు ఉన్న వ్యవస్థను అర్థం చేసుకోకుండా, గిరిజనేత వ్యవస్థలయిన ఆధునిక సమాజం, రాజ్యాంగం, చట్టాలు వ్యవహరిస్తున్నాయని ఈ కథలో స్పష్టం అవుతున్నాయి.

'రక్తపింజెర' కథలో గిరిజనులపై భూస్వాములు ఆక్రమణ కేసులు బనాయించి వారిని ఇబ్బందులకు గురిచేయడం జరుగుతుంది. ప్రకృతిలో వున్న రక్తపింజెర్ల వంటి భూస్వాములతోనే గిరిజనులకు అత్యంత ప్రమాదంవుందని ఈ కథలో స్పష్టమవుతుంది. రక్తపింజెర కథలో గిరిజనేతర వ్యవస్థలయిన చట్టాలు, ఆ చట్టాలు తెలియని గిరిజనులను హింసించడానికి ఉపయోగపడుతున్నాయి. అంతే తప్ప గిరిజనులకు రక్షణగా నిలువడం లేదు. ఇలాంటి పరిస్థితుల్లో గిరిజనులకు నక్సలైట్లు అండగా నిలుస్తున్నారు. నిజానికి గిరిజనులకు నక్సలైట్లు సిద్ధాంతాలు కూడా పూర్తిగా ఏమి అర్థంకావు. కాని ప్రభుత్వం చేస్తున్న చట్టబద్ధ హింసల నుండి, తమ వ్యవస్థతో కలిసి పనిచేస్తున్న నక్సలిజం వ్యవస్థకి గిరిజనులు సహకరించడం జరుగుతుంది. గిరిజనేతర సామాజిక వ్యవస్థలపై, ప్రభుత్వ యంత్రాంగాలపై, వాటి ఆధిపత్యంపై గిరిజనులు, గిరిజన సామాజిక వ్యవస్థ చేస్తున్న పోరాట సంఘర్షణ ఈ కథల నిండా పరచుకొంది.



'అడవిలో వెన్నెల' కథ గిరిజనేతర సామాజిక వ్యవస్థలు, గిరిజనులపై దోపిడీని, అణచివేతను కొనసాగించే తీరును విశ్లేషించాయి. అడవిలోని వెన్నెల వృధా వెన్నెల అని నానుడి. కానీ ఈ కథల సంపుటి ఆ నిర్వచనాన్ని తిరగరాసింది. అడవిలో వెన్నెలగా ఉద్యమకారులు ఆదివాసీల జీవితాల్లో వెలుగు నింపారని, అడవిలోని వెన్నెల అపూర్వంగా ఉంటుందని, ప్రకృతి రమణీయతను చిత్రించారు. వీటికి స్ఫూర్తినిచ్చిన శివసాగర్ కవితను కథా సంపుటిలో తొలి పేజీల్లో ఇలా పేర్కొన్నారు.

'అడవిలోని వెన్నెల
ఆలోచనల పర్వత శిఖరాగ్రం మీద
నిటారుగా నిలబడింది
అది అడవిలోని
ఊళ్ళపై, లేళ్ళపై
సెలయేళ్ళపై నేడు ప్రసరిస్తోంది
అది నిర్బంధాల పెనుచలిలో
ఆశయాల ఉక్కు కవచం తొడుక్కొని
ట్రిగ్గర్ మీద వేలితో
ఇప్పుడు నడుస్తున్న చరిత్రకు
రేయింబవలు సెంట్రీ కాస్తోంది
అది జనశక్తికి
కత్తుల కవాతు నేర్పుతోంది
అది కాలానికి
కాషన్ పలుకుతోంది
అడవిలోని వెన్నెల
బహుపసందయిన వెన్నెల!
అది త్యాగాల యూనిఫారం ధరించి
మేఘాలను నేలకు దించుతోంది.'[12]

గిరిజనులకు నక్సలైట్ వ్యవస్థ వెన్నెలలో చల్లదనాన్ని ఇస్తుందని ప్రేరేపిస్తుంది. ఇక్కడ గిరిజనులు మూడు వ్యవస్థల మధ్య నలిగిపోతున్నారు.

1. తాము నిర్మించుకున్న గిరిజన కట్టుబాటుతో కూడిన వ్యవస్థ 2. తమకు రక్షణగా నిలవవలసిన చట్టం, 3. న్యాయం తమకు వ్యతిరేకంగా పనిచేస్తున్నందుకు నక్సల్ వ్యవస్థ గిరిజనులకు సహకరిస్తుంది.

కె.వి.ఆర్. ముందుమాటలో పేర్కొన్నట్టు "పోరాటం తలెత్తే కొద్ది సాహిత్యం తన వస్తువునీ, రూపాన్నీ మార్చుకుంది. జనం నుంచి మొనగాళ్లలానే ఎందరెందరో మనకు తెలీనే తెలీని 'సహజ' కవులూ, 'సహజ' రచయితలూ పుట్టుకొచ్చారు... వీటిలో ప్రాదేశిక చిత్రణ, ప్రకృతి వర్ణన మానవ జీవిత కథనంలో కలగలసి పోతున్నాయి... ఈ సాహిత్యం ఎలా విలక్షణమైందీ అంటే రచనకూ సామాజికాచరణకూ మధ్య ఉండే అంతరం బాగా కుదించుకుపోయి రచన కూడా సామాజికాచరణగా రూపొందుతుంది. అలా ఈ రచయితలు జైళ్లల్లో మగ్గుతూనో, అడవిలో వెన్నెలలు పరుస్తూనో నిర్బంధాల నెదుర్కొంటూనో, ఆ క్రమంలో పయనిస్తూనో విప్లవాచరణకూ సాహిత్య సృజనకూ విడదీయరాని సంబంధాన్ని స్థాపించగలుగుతున్నారు. అలా తతిమ్మా విప్లవ రచయితలకు ఉన్నతమై వాస్తవ ప్రమాణాలను నెలకొల్పుతున్నారు."[13]

ఆదివాసీ ప్రాంతాల్లో చట్టబద్ధమైన ప్రభుత్వ యంత్రాంగం ఆదివాసీలకు సహకరించాల్సింది పోయి వారిని అణచివేసేదిగా, దోపిడీ చేసేదిగా మారింది. అది ఆధునిక అభివృద్ధి ఆదివాసులు అందుకొని ఎదగకుండా చేస్తున్నది. భారతీయ సమాజం అన్ని భౌగోళిక ప్రాంతాలకు, జాతులకు, పౌరసత్వం కల్గిన ప్రతి పౌరునికి సమాన అవకాశాలు కల్పించాయి. కాని అవి అందుబాటులోకి రావడం లేదు. వాటిని అందుకోవడానికి పోరాటం తప్పడం లేదు. ఈ నేపథ్యంలో జరిగిన, జరుగుతున్న ఆదివాసీ ఉద్యమాలకు మద్దతుగా 'అడవిలో వెన్నెల' కథల సంపుటి వారి ఆశలను, ఆరాటాలను, పోరాటాలను అక్షరీకరించింది. సాహిత్యంలో ఆదివాసులకు సమున్నత స్థానాన్ని కలిగించింది.



మూడవ అధ్యాయం

# అడవిలో వెన్నెల కథలు శైలీ, శిల్ప పరిశీలన

"కథ అల్లడం అనేది బుట్టలు అల్లడం, చెప్పులు కుట్టడం, బట్టలు నేయడం, రంగులు అద్దడం వంటివి. ఈత ఆకు తెచ్చి చీపుర్లు చేయడం వంటివి. బట్ట కత్తిరించి డ్రస్సులు కుట్టడం వంటివి. పొలం దున్ని విత్తనాలు వేసి పంట తీయడం వంటివి. ఎంత శ్రద్ధతో చేస్తే అంత మంచి పంట చేతికొస్తుంది. ఏ విత్తనాలేస్తే ఆ ధాన్యమే పండుతుంది. ఏ రంగు అద్దితే ఆ రంగులో కనపడుతుంది... పాఠకుల్లో రకరకాల స్థాయిల వారుంటారు. మనం ఏ పాఠకులను దృష్టిలో పెట్టుకొని రాస్తామో దాన్ననుసరించి కథ చెప్పే పద్ధతి శిల్పం మారుతుంది. సాధారణంగా మానవ సంబంధాల్ని, స్వభావాన్ని, లోకాన్ని మరింత అర్థం చేసుకోవాలని కోరే పాఠకులు కథల్ని చదువుతుంటారు"[1] అని అంటారు బి.ఎస్.రాములు.

ఆయా వర్గాలు, కులాలు, ప్రాంతాలననుసరించి సాహిత్య విలువల ప్రమాణాలు ఏర్పడుతుంటాయి. మధ్య తరగతి సాహిత్య ప్రమాణాలు వేరు. కార్మిక వర్గ దృక్పథం గల ప్రజల సాహిత్య ప్రమాణాలు వేరు. దళిత, బహుజన దృక్పథం గల ప్రజల సాహిత్య ప్రమాణాలు వేరు. వారి ప్రాధాన్యతలు, సంస్కృతి, విలువలు ఇతరులు అంగీకరించలేనప్పుడు వాటిలో సాహిత్య ప్రమాణాలు లేవని, శైలి, శిల్పం ఉన్నతంగా లేదని వ్యాఖ్యానిస్తుంటారు. నిజానికి అది వారు చూసే సాహిత్య విలువల్లోనూ తేడా తప్ప మరొకటి కాదు. కార్మికవర్గ, విప్లవ సాహిత్య వస్తువు నచ్చినప్పుడు వ్యతిరేకించేటప్పుడు ప్రగతి శీలంగా కనపడాలనుకొని వస్తువును వ్యతిరేకిస్తే ప్రజా వ్యతిరేకి అంటారని శిల్పం శైలీ బాగాలేదని ఆయా రచనలను కించపరిచి గొప్ప సాహిత్యం కాదని, ప్రచార సాహిత్యమని, ముడి పదార్థ సాహిత్యమని వ్యాఖ్యానిస్తుంటారు. అయితే జీన్‌పాల్ సార్త్రే చెప్పినట్టు సాహిత్య ప్రభావం చదివే పాఠకులను అనుసరించి వేర్వేరుగా వుంటుంది. మధ్య తరగతి

పాఠకులు, ఉద్యమంతో సంబంధం లేని వారు, దాన్ని వ్యతిరేకించే వారు ఉద్యమ సాహిత్యాన్ని సహృదయతతో అర్థం చేసుకోవడం, సానుకూలంగా స్పందించడం కష్టం. కార్మికవర్గ దృక్పథంతో ఆలోచించే వారు, బడుగు వర్గాలు, ఉద్యమ కారులు, ఉద్యమించే ప్రజలు ఉద్యమ సాహిత్యంతో ఇతరుల కన్నా ఎన్నో రెట్లు స్ఫూర్తి, ఉత్తేజం పొందుతారు.

## శైలీ, శిల్పం అంటే...

"కథలో ఏమేం వుంటాయంటే... కథలో కథ వుంటుంది. కథ చెప్పే తీరు వుంటుంది. కథ చెప్పే తీరు చెప్పే మనిషిని బట్టి, రచయితను బట్టి, వినేవారి, చదివే వారి ఆసక్తిని బట్టీ మారుతూ వుంటుంది. ఎవరిని ఉద్దేశించి కథ చెపుతారో ఎవరిని ఉద్దేశించి కథ రాస్తారో, దాని బట్టి కథ చెప్పే తీరు శైలీ, శిల్పం, కథా నిర్మాణం, కథ ప్రారంభం, ముగింపు, కొనసాగింపు వుంటాయి. దీన్నే శైలీ, శిల్పం అంటారు. కథకు కథా వస్తువే మౌలికం. అయితే శిల్పం కథ యొక్క రూపాన్ని, ప్రక్రియను నిర్దేశిస్తుంది. అందువల్ల కథ ప్రక్రియ పరిధి, పరిమితిననుసరించి సాగే వాటినే కథలుగా పేర్కొంటారు. మిగతా వాటిని కథనాలుగా, డాక్యుమెంటరీలుగా, గల్పికలుగా పేర్కొంటారు. అందువల్ల కథానిక శైలీ, శిల్ప విశ్లేషణ, కథన పద్ధతులు, కథా నిర్మాణం, కథను ప్రారంభించే ఎత్తుగడ, కొనసాగింపు, కథ ముగింపు గురించి చర్చించడం, విశ్లేషించడం అవసరమని సాహితీ వేత్తలు భావిస్తారు.[2]

## సాహిత్య వస్తు శిల్పాల్లో విప్లవం

"1970 దశాబ్ది నుంచి కథల ప్రయోజనాన్ని ఎక్కువగా పట్టించుకోవడం మొదలైంది. కథను మరింత శక్తివంతంగా, పరిపూర్ణంగా తీర్చిదిద్దే ప్రయత్నం కూడా వ్యక్తులుగా కాకుండా ఉద్యమాలు నిర్వహించాయి. సంస్థలు, ముఖ్యంగా విప్లవ సాహిత్య సంస్థలు ఈ పని చేశాయి. దానిలో విరసం కథల ప్రయోజనాన్ని ఎక్కువగా పట్టించుకుంది..... మామూలుగా అంతవరకూ సాహిత్య విమర్శకులు అంగీకరించిన కథానిక లక్షణాలకీ, ఆ కాలంలో వచ్చిన కథానికల లక్షణాలకీ అనే చోట్ల పొంతన కుదరదు. కథానిక లక్షణాలలో ముఖ్యమైనదిగా భావించే వస్తువు, భాష, ఎత్తుగడ, నడక, ముగింపు అనే లక్షణాలని మాత్రమే పరిశీలించి 70వ దశాబ్దం నుంచి వచ్చిన కథల్ని అంచనా వేయడం అసంపూర్ణమవుతుంది...



70వ దశకంలోనూ, ఆ తర్వాత వచ్చిన విప్లవ కథల్లోనూ అటు వస్తువును, ఇటు శిల్పాన్నీ విప్లవీకరించింది, ప్రయోగాలు చేసింది. 1970లలో వస్తు విప్లవం వచ్చింది. వస్తువును గురించిన చర్చలు ముమ్మరంగా జరిగాయి. వస్తు ప్రాధాన్యత పెరిగింది. విరసం, సృజన, అరుణతార వంటి పత్రికల్లోనూ నక్సలబరీ అవగాహనతో రాస్తున్న రచయితల్లోనూ వస్తువే ప్రధానమైంది. కథ ఓ ఆయుధంగా మారి విప్లవోద్యమంలో భాగస్వామ్యం వహించింది."[3] ఇలా విప్లవ రచయితలు తెలుగు సాహిత్య వస్తు శిల్పాల్లో మౌలికమైన మార్పులు తీసుకువచ్చారు. తెలంగాణా భాషను, ఆదివాసీల భాషను సాహిత్యీకరించారు. పాట, కథ, కవిత, వ్యాసం, ప్రసంగం, సాహిత్య విమర్శ, ప్రక్రియలను, ప్రజాకళారూపాలను ఉద్యమంలో చురుకైన కార్యకర్తల వలే విప్లవంలో అంతర్భాగం చేశారు.

## సాహిత్య ప్రయోజనం

బి.ఎస్.రాములు 'కథ-రచన' పాఠాల్లో సాహిత్య ప్రయోజనం గురించి ఇలా వివరించారు. "కథ అన్యాయాన్ని ఎదిరించే ధైర్యాన్నివ్వాలి. ఉన్నతమైన భావాలు కలవారిగా తీర్చిదిద్దాలి. ఈ సమాజం ఎలా వుంటే బాగుంటుందో కథలో, నవలలో చిత్రించాలి. ఆదర్శ పాత్రలు, ఆదర్శ సమాజం కళ్ళకు కట్టించాలి. సామాజిక న్యాయం కోసం, సామాజిక మార్పు కోసం ఉపయోగపడాలి. కరుడు గట్టిన హృదయాన్ని కూడా కరుణార్ద్రంగా మార్చాలి. మంచి పట్ల స్పందించాలి. వ్యక్తిత్వాన్ని తీర్చి దిద్దాలి. జీవితానికి మార్గదర్శనం చేయాలి. కర్తవ్యం సూచించాలి. మానవ స్వభావాలను అర్థం చేయించాలి. కష్టాలను ధైర్యంతో ఎదుర్కొని ముందుకు సాగే మద్దతు ఇవ్వాలి. నిస్సహాయుల్లో నైతిక స్థయిర్యాన్ని, ధైర్యాన్ని కలిగించాలి. సాహిత్య ప్రయోజనం ఇంతకన్నా వేరే ఏముంటుంది? బాల సాహిత్యం పిల్లల్లో తీయని ఊహలు కలిగించాలి. మంచిపట్ల, సాహసం పట్ల ఉత్సాహం కలిగించాలి."[4]

'అడవిలో వెన్నెల' కథలు ఆదివాసీలకు, ఉద్యమకారులకు ఒక గొప్ప నైతిక మద్దతును అందించాయి. సాహిత్యంలో వారి జీవితాలను, సంస్కృతిని, పోరాటాలను నిక్షిప్తం చేసి నిజమైన సాహిత్య ప్రయోజనాన్ని నెరవేర్చాయి. సమాజంలో గిరిజనుల పట్ల ఆలోచించే తీరును మలుపు తిప్పి వారి పట్ల సానుకూలంగా స్పందించే స్వభావాన్ని, సహృదయతను పెంచాయి. సహృదయతను

పెంచడం సాహిత్యం యొక్క ముఖ్య లక్షణాల్లో ఒకటి. దాన్ని 'అడవిలో వెన్నెల' కథల సంపుటి ఎంతగానో సాధించింది. ఎంతోమంది యువరచయితలు కలం పట్టి రాయడానికి స్ఫూర్తినిచ్చింది. ఈ విధంగా ఈ కథల సంపుటి సాధించిన సాహిత్య ప్రయోజనాలు సాహిత్య ప్రమాణాలకు అందని ఉన్నత స్థాయిలో సామాజిక మార్పులో భాగమయ్యాయి.

"కథలు... తెలియని దాన్ని తెలుసుకోవడానికి. సమాజంలోని భిన్న వ్యక్తులు, సమూహాలు, మనుషుల సైకాలజీ, ఆశ, నిరాశలు, పరిధులు, పరిమితులు, మనుషుల అభివ్యక్తి తెలుసుకోవడానికి, తెలుసుకొని ముందుకు సాగడానికి, మంచిని ఆచరించడానికి కథలు చదవాలనుకుంటాను. ముఖ్యంగా మనుషులను అర్థం చేసుకోవడంతో పాటు కథలు మనుషుల మధ్య సాన్నిహిత్యాన్ని పెంచుతాయి. ఏ దేశంలో వున్నా వారంతా మనకు సన్నిహితులుగా, తెలిసిన వారుగా ఫీలవుతుంటాము. అలా ప్రపంచం సాహిత్యం, కళలు ద్వారా మనకు సన్నిహితమవుతుంది."[5]

ఆంగ్లంలోని 'టెక్నిక్' అనే మాటకు సమానార్థకంగా 'శిల్పం' అనే మాటను వాడుతున్నాం. "రచయిత చెప్పదల్చుకున్న విషయం వస్తువు. చెప్పదల్చుకున్న విషయాన్ని ప్రత్యేక పద్ధతిలో చెప్పడమే శిల్పం"[6] అంటారు రామకృష్ణ. కథ ఒక నిర్మాణం కలిగి ఉంటుంది. వస్తువును కథగా మలచడంలోనే కథకుడి పనితనం కన్పిస్తుంది. కేవలం వస్తువు వల్ల కథ రూపొందదు. ఆ వస్తువును అందంగా ఆకర్షణీయంగా తీర్చి దిద్దినపుడే ఒక మంచి కళాఖండం రూపుదిద్దు కొంటుంది. "వస్తువు ఉన్నంత మాత్రం చేత కథకాదు.రాతిని చెక్కితేనే కదా విగ్రహం అయ్యేది. ఒకేరాయి అద్భుతమయిన కళాఖండంగానూ కావచ్చు, ఇంటి ముందు మెట్ల రాయిగా పాదాలకింద పడినలిగి పోనూవచ్చు. అది శిల్పి చేతి పనితనం మీద ఆధారపడి ఉంటుంది. కథకు మూలమైనది వస్తువైనా దాన్ని కథగా మార్చే పనితనమే ముఖ్యమైనది. ఇదే నిర్మాణ శిల్పం. కథకైనా, నవలకైనా, మరింకే రచనా ప్రక్రియకైనా ఇది అవసరమే"[7] అంటారు శీలా వీర్రాజు.

ఈ వాక్యాలు కథా రచనలో శిల్పం యొక్క అవసరాన్ని, ప్రాముఖ్యాన్ని తెలియజేస్తున్నాయి. అడవిలో వెన్నెల కథలు వస్తు వైవిధ్యం తో పాటు శిల్ప వైవిధ్యాన్నీ కలిగి ఉన్నాయి. ఈ కథల్లో శిల్పం నిర్దిష్ట నిర్మాణంలో అచ్చుపోసినట్లు



గాక వస్తువును కథగా మలిచే క్రమంలో దానికదే రూపుదిద్దుకుంటూ వచ్చినట్లు తెలుస్తోంది.

## జానపద కథ - శైలీ, శిల్పం

"కథ చెప్పే ప్రక్రియలో కనీసం ఇద్దరుంటారు. చెప్పేవాడు, వినేవాడు. ఎవరికి ఆసక్తిపోయినా కథ కంచెకు పోతుంది. రాసే కథ అలాకాదు. ఒకసారి రాస్తే పత్రిక ద్వారా లక్షల ప్రతులు అందరికీ చేరుతుంది. అచ్చుగుద్దుడు పెరిగినకొద్దీ కథలు కూడా వేలకువేలు అచ్చవుతాయి. చెప్పే కథలో విన్న కథ మళ్లీ చెప్పడం అందరికీ ఒకే తీరురాదు. నాణ్యత లోపించవచ్చు. కొత్తవి కల్పించి ఆసక్తికరంగా చెప్పవచ్చు. రాసే కథకు ఈ రెండు అవకాశాలు లేవు... పాఠకుల్లో రకరకాల స్థాయిల వారు ఉంటారు. ఏ పాఠకులను దృష్టిలో పెట్టుకొని రాస్తున్నారో దానిని అనుసరించి చెప్పే పద్ధతి లేదా శిల్పం మారుతుంది. సాధారణంగా మానవ సంబంధాల్ని, వారి భావాల్ని, స్వభావాల్ని, సంస్కృతిని, జీవితాల్ని, లోకాన్ని మరింత అర్థం చేసుకోవాలని కోరే పాఠకులు కథల్ని చదువుతుంటారు."[8]

'అడవిలో వెన్నెల' కథలు అచ్చురూపంలో వచ్చిన మౌఖిక సాంప్రదాయ కథలు. అవి కథను రాసినట్టుగా కాకుండా కథను చెపుతున్న శైలి, శిల్పంలో కొనసాగుతుంటాయి. సాహు రాసిన మొదటి కథలు డిస్కవరీ ఛానల్‌లో ఆయా ప్రదేశాల గురించి, సన్నివేశాల గురించి చెపుతూ వెళ్లే యాంకర్‌ను చూపిస్తూ ఆయా ప్రదేశాలను, సన్నివేశాలను, జీవితాలను, సంస్కృతిని వర్ణిస్తూ, దృశ్యీకరిస్తూ సాగే పద్ధతిలో రాశారు. ఈ కథలు రాసే నాటికి తెలుగులో అలాంటి టీవీ ఛానళ్ల సీరియల్స్ లేవు. మౌఖిక సాంప్రదాయం నుండే టీవీ ఛానళ్లు ఆ రూపాన్ని, ప్రక్రియలను అభివృద్ధి పర్చుకున్నాయి. హరికథ, బుర్రకథ, శారద కాళ్ల కథ, బీరప్ప కథలు, పటం కథలు వంటి జానపద, ఆదివాసీ కళా రూపాల ప్రక్రియల నుండి టీవీలో ఆయా ప్రక్రియలు అభివృద్ధి చెందాయి. ఇలా జానపద శైలీ, శిల్పాలు, కళారూపాలు ఆధునిక టెక్నాలజీలో ఆధునిక రూపాల్లో విస్తరిస్తూ వేలకోట్ల వ్యాపారానికి ఉపయోగపడుతున్నాయి. కానీ వాటిని రూపొందించిన ఆయా ప్రజలకు ఆ సొమ్ములో భాగస్వామ్యం ఏమీ లేదు.

జానపద కథా శైలీ, శిల్పంతో పాటు "సాహు కథల్లో అనుభూతి, అనుభవం రెండూ గాఢంగా కనిపిస్తాయి. అందువల్ల ఇవి కథలైనా కతల లక్షణాలని

వదిలించుకొని భిన్నంగా కనబడతాయి.... ఇది సాహు శిల్పంలో ఒక విలక్షణత. తన శిల్పంతో పాఠకుల్ని తన్మయుల్ని చేయాలనో, తన ప్రతిభను నిరూపించుకోవలనో కాక వాస్తవాన్ని స్పష్టంగా కళ్ళకు కట్టే ప్రయత్నం చేస్తాడు.... ఈ కథల్లో వాస్తవ చిత్రణ ఎంత చిక్కగా వుంటుందో, విప్లవ కాల్పనికత అంత గాఢంగా వుంటుంది. ఇవి కేవలం కథలు మాత్రమే కావు. అంతకన్నా ఎక్కువైనవి. సామాజిక ఆచరణకు, వాస్తవాలకు నడుమ అంతరం కుదించిన ఈ కథలు కేవలం కథలని ఎలా అనగలం?... తాను అడవిలోనూ, జైళ్ళలోనూ ఉద్యమాలు, నిర్బంధాలలో జీవిస్తూ సృజించిన సాహిత్యం 'కేవలం సాహిత్యం' అనే మాటలతో, కొలమానాలతో ఎలా తూచగలం. అందుకే సాధారణమైన, సాంప్రదాయ సిద్ధమైన కథానిఇక విలువల కొలబద్దలు వీటిని కొలవడానికి పనికి రావని చెప్పడం.... సాహు కథల్లో దిగ్భ్రమ కలిగించే శిల్ప నిర్మాణం వుండదు. గుండెను కెలికే పచ్చి వాస్తవికత అనే కథాంశం ప్రధానంగా వుంటుంది. తనున్న పరిస్థితుల్లో, తన చుట్టూ వున్న వాతావరణంలో శిల్పం పట్ల ఇంకా శ్రద్ధ వహించే పరిస్థితి సాహుకు లేకపోయింది. అయినా భాషాపరంగానూ, వర్ణనలోనూ తెలంగాణా వాస్తవికతను తనదైన పద్ధతిలో ప్రదర్శించడంలో సాహు తన సహజమైన పోరాట పద్ధతిని అనుసరించాడు. సాహు తన కథల్లో ప్రజల్నే కథా నాయకుడిగా చేశాడు. వారినే నిజమైన విప్లవ కారులుగా నిరూపించారు."[9]

## వర్ణనతో ప్రారంభం అయ్యే సాహు కథలు

ఆదివాసులు ప్రకృతితో సహజీవనం చేస్తారు. అందుకనువుగా ఈ సంపుటిలోని కథలన్నింటిలో పరిసరాలు, వాతావరణం చిత్రించి కథలకు సహజత్వాన్ని అద్దారు. చాలా కథలు పరిసర ప్రాంత వర్ణనతో ప్రారంభమవుతాయి. సాహు రాసిన 'కన్నీటికథ – నీటికథ' దళకమాండర్‌గా పర్యటిస్తూ తెలుసుకున్న ఆదివాసీల జీవితాలను మనకు వివరించే తీరులో కథ చెపుతూ... వర్ణనతో ఇలా ప్రారంభిస్తారు. "అది వేసవి కాలం, సూర్యునితో పాటు మేము ప్రయాణం చేస్తున్నాం–అడవి అందంగా వుంది. నిశ్శబ్దంగా భయంకరంగా ఉంది – గంభీరంగా వుంది – ఎత్తయిన కొండలు... ఆ కొండల్ని చూస్తే మానవమాత్రులు ఆ కొండల పైన వున్నారని, వుంటారని వూహించలేం... అక్కడ అడవి వుంది... మనుషులు వున్నారు..."[10]



'భూమికొరకు' కథ ప్రారంభం, ఎత్తుగడ శీర్షికతో పాటు కథా వస్తువును సూచిస్తుంది. "యుగాలుగా ఈ భూమికోసం ఎందరి రక్తం వరదలు పారిందో తప్పదు"[11] గిరిజనులు అడవిని పంట భూములను తయారుచేసిన తర్వాత అవి ప్రభుత్వ భూములని అంటూ అధికారులు గిరిజన గూడాన్ని నాశనం చేసిన తీరు వర్ణనతో ఈ కథ ప్రారంభమవుతుంది.

## 'జెండా కథ' ప్రారంభం

'జెండా కథ' వర్ణనతో ఇలా ప్రారంభమవుతుంది. "ఉట్నూరు నుంచి ఈశాన్యంగా నలభై కి.మీ. నడిస్తే డాబిలొద్ది. ఆలొద్ది మధ్య నుంచి కుదేరు (వాగు) పారుతుంటది. కుదేరుకు ఆ పక్క ఈ పక్క పంట భూములు. ఆ భూములల్ల లొద్ది నానుకొని పిట్టగూళ్ల తీరు ఎనిమిది గూడాలు. అది వివడి (అక్టోబరు) మాసం. వానాకాలం గడిచి పోయినా వానలు బాగా పడలేదు. మక్కకర్రలు నీళ్లినీళ్లి పీనులయినంక వగ్గి (ఎండి) పోతున్నయ్. మక్కలు పండుతె ఆ నాలుగు పూటలన్నా గడుక దొరుకుద్దనుకున్న జనానికి గుండెల్ల బండపడ్డది.... పద్ద వానలైనా బుడ్‌బావే (జూన్‌లో) పడిపోయినయి. ఆ తరువాత అడపాదడపా వానలు గొట్టినా పంటలు పండనే లేదు – రబీ (వేసంగి) పంట కోసం దున్ని భూములు నల్లగా గొంగడి పరిచినట్టుగున్నయ్.... వానలు గొట్టాలని పెరుసపేనుకు (పెద్ద దేవునికి) కొలువాలని పెద్ద గూడెంలోని మంటపం (దేవుని కోసం కప్పుతప్ప పక్కల కేమీ లేని గుడిశె) వైపు కదిలి వస్తున్నారు.... డప్పులు దదదడలాడుతున్నాయి. డోళ్ళు జమిడికెడిమిడికేమంటున్నాయి. జనం ఆడుతూ పాడుతూ వస్తున్నారు."[12]

"శిల్ప రీత్యా మానవ జీవితం, ప్రకతి వర్ణనలు, ప్రాదేశిక చిత్రణ అత్యంత వాస్తవికంగా కళ్ళకు కట్టినట్టు చెప్పే శిల్పం సాహు కథల్లో కనబడుతుంది. ప్రజల భాష పాత్రోచితమైన రీతిలో దర్శనమిస్తుంది. ముఖ్యంగా గిరిజన పాత్రలు, గిరిజన పదాలు, వాక్యాలు పాఠకుల్ని ఆ లోకంలోకి, ఆ వాతావరణంలోకి తీసుకెళ్తాయి... క్లుప్తీకరించడం కథల లక్ష్యం, లక్షణం. కథకు కేంద్రం సంఘటన. సాహు కథలో కుప్లీకరణ ప్రధాన లక్షణంగా కనబడుతుంది. కానీ ఆ క్లుప్తీకరణ కథను కత్తిరించినట్లుగా ఉండదు. ఇక చెప్పడానికి ఇంకేమీ మిగలలేదనే భావన కల్గిస్తుంది. కథ క్లుప్తంగా వుంటూనే లోతుగానూ, సాంద్రంగానూ ఉండడం సాహు శిల్ప లక్షణం...."[13]

## 'అడవిలో వెన్నెల' కథ ప్రారంభం

'అడవిలో వెన్నెల' కథ వర్ణనతో ప్రారంభమవుతుంది. "వర్షం కురిసి కురిసి ఆ రోజు వుదయాన్నే తెరిపియిచ్చింది. ఆకాశం పండిన పత్తిచేను గాలికి కదులుతున్నట్టు గా వుంది. గాలికి టేకు ఆకులు కదలాడాయి. ఏనుగు చెవుల్లాంటి ఆ ఆకుల మొరటు నారలలో అంటుకొని ఆగిపోయిన చినుకులు తంపరగా రాలుతున్నాయి. ఏపుగా పెరిగిన పచ్చగడ్డిలో రాలిన చినుకులు గడ్డిపోసలపై అమరిన ముత్యాల్లా మెరుస్తున్నాయి. అందమైన ప్రకృతి దృశ్యాల మధ్య పడుకొన్న పెద్ద మేకలు లేచి నిలబడి ఒళ్ళు విరుచుకున్నాయి"[14] ఈ మాటలు చూసినట్లయితే వర్ణనతో ప్రారంభమైన కథగా తెలుస్తుంది.

"వస్తువు శైలీ, శిల్పం దృష్ట్యా సమగ్రత, స్థల కాలాల ఐక్యత వంటి గుణౌచిత్యాలన్నీ నిగ్గుదేరి రాణించాయి 'అడవిలో వెన్నెల' కథలో. రచయిత ప్రాపంచిక, మానసిక, వైయుక్తక దృక్పథాలు కూడా కత అంతటా వెన్నెల్లా పరచుకొని దీన్ని గొప్ప రచనగా చేసినై. బి.ఎస్.రాములు గారి సూక్ష్మాంశ పరిశీలన, వాతావరణ పరిసరాల వర్ణనా, వివరణా, గిరిజన జీవితాలతో మమేకమై పోయిన పారదర్శకత – అక్షరాక్షంలో ప్రస్ఫుటీకరిస్తున్నాయి. శతసహస్ర తెలుగు కథల్లో నుంచి ఏ పదో ఏరి ఒక కథా మణిహారాన్ని కూర్చుకోవాలంటే 'అడవి వెన్నెల' కథని ఒకటిగా ఎంచుకోవల్సిందే... కథకుడుగా బి.ఎస్.గారు గొప్ప ప్రజా రచయిత. బహుజన హితాన్ని కాంక్షిస్తూ చైతన్య పథంలో సాగుతున్న వారి రచనా ప్రస్థానానికి సామాజిక తాత్వికత, దార్శనికతలే చోదక శక్తి."[15]

## 'గంగజిమ్మ' కథ ప్రారంభం

'గంగజిమ్మ' కథలోని ప్రకృతి వర్ణన, పరిసరాల వర్ణన మనం ఆ ప్రాంతాల్లో పర్యటిస్తున్న భావం కలిగిస్తుంది. వారి జీవితాల్లోకి వెళ్ళినట్లు అన్పిస్తుంది. "పచ్చగా ఒక గీత గీసినట్లు కన్పిస్తున్నది. ఆవలివడ్డు – బీరమాయ గుట్ట కింది ప్రదేశం. గోదావరి నది ఇక్కడ ఆవలి వడ్డుకు ఈవలి ఒడ్డుకు నడుమ దాదాపు మైలున్నర దూరం వుంటుంది. బీరమాయ గుట్టకు కుడిచేతివైపు వరుసగా మద్దిగూడెం, గంగవల్లి, రాళ్ళపేట వూర్లు వున్నాయి. ఈవలి వడ్డు మీద వుండి చూస్తే ఆ గ్రామాలు బొమ్మరిళ్ళ లాగా కనిపిస్తున్నాయి. గుట్టమీది నుండి పోయె తోవకటీటు పల్చగా వున్న చెట్లు – దిట్టంగా పెరిగిన అడవి మధ్యన తోవ వున్నట్లు సాటి



చెప్తుతున్నై.... ఇక్కడ గోదావరి పెద్ద మలుపు తిరిగింది. పడమటి నుండి వస్తున్న గోదావరి ఎగువన మూడు మైళ్లు పైకి పోతే వూరెన్క గుట్ట, దుర్గం గుట్టలు రెండు దిక్కుల నుండి అడ్డం వచ్చినందుకు ఇరుకులో పడి ఉత్తరంవైపు తిరిగి ఈ బీరమాయ గుట్టకు తాకి మళ్లీ దక్షిణానికి మరలింది గోదావరి. వానాకాలంలో దుర్గంగుట్ట, ఊరెన్క గుట్టల నడుమ పెద్ద పెద్ద సుడులు తిరుగుతుంటై."[16]

## 'రక్తపింజెర' కథ ప్రారంభం

'రక్తపింజెర' కథ ప్రకృతి వర్ణనతో ఇలా ప్రారంభం అవుతుంది. "చలికాలం బయటనిలబడితే దాదాపు ఇరవై నిమిషాల్లో తడిసి ముద్దయి వజవజ వెన్ను పొంట వణుకొస్తుంది. గోండుల బతుకుపోరాటమంత దీర్ఘచలి రాత్రి. భయంకరంగా గడ్డకట్టుకుపోయిన నిశ్శబ్దం.... అలాంటి భయంకరమైన చలి రాత్రి – చుట్టూ కోటగోడల్లాగా ఎత్తయిన కొండల మధ్య నాలుగు గూడాలు – ఆ నాలుగు గూడాల్లో మిగిలిన వాటికన్న కాస్త పెద్దదైన గూడెంలో పదిహేను గుడిసెలుంటాయి. ఇప్పుడో అప్పుడో కూలిపోవడానికి సిద్ధంగా ఉండి తలుపు గొళ్లెంలేక కాటికి కాళ్లుబారజాపుకొని గోండు ముసలోళ్లలాగా గుడిసెలు కూరుకుతున్నాయి. ఏ గుడిసెలో కూడా దీపంలేదు. దీపాలు లేకకాదు. దీపాల్లో సమురు లేక సమరు కొనేందుకు కొత్తల్లేక...."[17]

## 'తుడుం' కథ ప్రారంభం

'తుడుం' కథ ఇలా ప్రారంభం అవుతుంది. "నారేపచెట్టు కొనకంటపాకి మరోమారు గొంగడిమునుగు సరి చేసుకొని తేనె తుట్టెవేపు దృష్టి సారించాడు భిక్యా. ఇంకొంచెం పాకాలి – అట్లా పాకుతుండగానే అనుకోకుండా కొండకిందికి దృష్టి సారించాడు. అల్లంత దూరాన ఖాకిబట్టలోల్ల గుంపు కనిపించింది– ఖాకిబట్టలోల్ల ముందు ఇద్దరు తెల్లబట్టలోల్లు నడుస్తున్నారు. భిక్యా జర్రున కిందికి జారి కొండమీది నుండి కిందికి పరుగెత్తసాగిండు గాలికన్న వేగంగా."[18]

## 'రగల్‌రాజ్జెం మైసివాకట్' కథ ప్రారంభం

'రగల్‌రాజ్జెం మైసివాకట్' కథ ప్రారంభమే ఉద్యమించే ప్రజల వలెనే ఉద్వేగపూరితంగా, ఆవేశ పూరితంగా ఇలా సాగుతుంది. "పశువుల కాపర్లు పశువులను లొద్దుల్లకు తరలిస్తున్నారు. పశువుల అరుపులకు లొద్ది ప్రతిధ్వనిస్తోంది.

కోపంగా, అసహనంగా పశువుల కాపర్లు వేసే కేకలు, ఎక్కడెక్కడ జీవాలు తిరుగుతున్నాయో ఒకరికొకరు చెప్పుకునే హెచ్చరికలు ఒక పక్క, ఇంకొక పక్క మేకలను అడవికి తోలుకెల్లుతూ పిల్లలు పాడే పాటలు, మేకల తుమ్ములు... మొత్తానికి ఊరి బయట యమసందడిగానే ఉన్నది. మామూలుగానైతే ఈపాటికి ఊళ్ళో ముసలివాళ్లు మంచాల మీది పసిపిల్లలు తప్ప మరో పురుగు ఉండేది కాదు. కాని ఈ రోజు వూరు వూరంతా తుకతుక ఉడుకుతంది. మరాఠా రైతులు పిసపిసలాడుతూ గుడిసెల చూర్లకింద సాగిసాగి ముచ్చెట్లు బెడ్తండ్లు. తెలుగువాళ్లు మరాఠా వాళ్ళలాగే ఓరోర చూస్తూ వాళ్ల గుజులు కదుతున్నారు. ఇంకోపక్క గోండ్లు అట్లాగే తమ జాతి వాళ్లతో కలిసి ఎడతెగని ముచ్చెట్లు బెడుతున్నారు. ఆ వూరుకు దక్షిణం, తూర్పు దిక్కు పలుచగా విప్పచెట్ల మధ్య కనుచూపు మేరదాకా వ్యాపించిన పంటభూములు."[19]

'సమాజంలోని ఒక వైఫల్యాన్నో, ఒక దుస్థితినో, ఒక సమస్యనో వార్తగా, వ్యాఖ్యగా, వ్యాసంగా రాయగలగటం ఒక ఎత్తు. కాగా, సమాజ నేపథ్యంలో ఆ పరిస్థితిని చిత్రిస్తూ, ఆ స్థితికి గల కారణాన్ని అంతర్లయంగా ధ్వనింపజేస్తూ కథలాంటి జీవితాన్నీ, జీవితంలాంటి కథనీ రచించడం ఒక ఎత్తు. కథా రచన పట్ల చిత్తశుద్ధి, సమాజం పట్ల బాధ్యతా భావన కలిగిన రచయితలే ఇంతటి అసిధారా వ్రతానికి పూనుకోగలుగుతారు. అలాంటి రచయితల్లో అగ్రశేణి కథకుడు అల్లం రాజయ్య.... దేశీయత, స్థానీయత, వాస్తవికత త్రివేణిగా సాగిన కథా వాహిని రాజయ్య రచనలు. ఒక సామాజిక జీవన సంరంభంలో అంతర్జ్వాలగా రగులుతున్న సంఘర్షణకి కథాత్మక చిత్రాలు రాజయ్య రచనలు. విశ్వకథా ప్రపంచానికి తెలుగు 'వాడి' కంట్రిబ్యూషన్."[20]

## 'గెరిల్లా' కథ ప్రారంభం

'గెరిల్లా' కథ కథా వస్తువుననుసరించి ప్రారంభమే గెరిల్లాల జీవితాన్ని పరిచయం చేస్తూ ఇలా సాగుతుంది. "మేమాసం ఎండ నిప్పులు చెరుగుతావుంది, కనుచూపు మేరలో నీడన్నదె లేదు. సముద్రము తలాపుకు పెట్టుకొని చాపనీళ్ళ కేడ్చిందంటే యిదేనేమొా? అడివిలో నీడకోసము వెతుకులాట, అది గొంతులెండిపోయి, ఒక్కచుక్క నీటి కోసము నోరు వెంపర్లాడుతున్న వేళ... ఒక్క క్షణం ఆకులు రాల్చిన చెట్టుకింద నైన నిల్చుంటె ఎంతహాయిగా వుండేది... వీపుమీది



"కిట్టిబ్యాగ్" మరింత కృంగదీస్తున్నది... భుజం మీది తుపాకి తాప తాపకు భుజాలు మార్చుకొంటేగాని కదలలేకపోతున్నారు. దానికి తోడు రెండు రోజుల నుండి తిండిలేదు.... ముందు నడుస్తున్న దళ నాయకుడు తన దళ సభ్యులకేసి చూసిండు. అందరి మొఖాలు వాడిపోయినయి. ముఖ్యంగా అందరికంటె చిన్నవాడయిన రవి ఎర్రటి మొఖం పూర్తిగా నల్లబారింది. పెదవుల మీద వేడి పొక్కులు వచ్చియి. అతన్ని చూస్తుంటే జాలి కల్గింది."[21]

## 'అడవిలో వెన్నెల' కథలు – శైలీ, శిల్పాల్లో వైవిధ్యం

'అడవిలో వెన్నెల' కథలు శైలీ, శిల్పాలు వైవిధ్యపూరితంగా కొనసాగాయి. వేర్వేరు రచయితలు, వేర్వేరు సందర్భాల్లో రాసిన కథలు కావడం వల్ల ఈ వైవిధ్యం మరింత హెచ్చు. 'రక్తపింజెర' కథ కథ రాసే శిల్పంలో కొనసాగింది. 'అడవిలో వెన్నెల' కథ ఆదివాసీ ప్రజల కోణంలో, ఆదివాసీల కంఠస్వరంతో నడిచిన దృశ్య కావ్యం. 'మరట్‌తుడుం పాయానా', 'రగల్ రాజ్యెం మైస్‌వాకట్' కథలు నేడు ఆయా సంఘటనల్లో, ఉద్యమాల్లో టీవీ యాంకర్లు, కెమెరాలు ఎప్పటికప్పుడు వ్యాఖ్యానిస్తూ ప్రజల్ని వెంటదివెంట స్పందింప చేసే తీరులో లైవ్ టెలీకాస్ట్ చేస్తున్న తీరులో శైలీ, శిల్పం అపూర్వంగా సాగుతుంది. అవి ఒక గొప్ప ప్రసంగం వలె ఉత్తేజపూరితంగా సాగే కథన ప్రక్రియ. ఆ భావాలతో ఏకీభవించే వారిని ఎంతో గొప్పగా కదిలించే కథా శిల్పం. ఈ శిల్పాన్ని సాధారణ సాహిత్య శిల్పంతో పోల్చడం వీలుకాదు. ఎందుకంటే చదివే పాఠకులను బట్టి రసాలు, సంవేదనలు ఉత్పన్నమవుతాయి. జీన్‌పాల్ సాత్రే సాహిత్య శాస్త్రంలో ఈ విషయాలను విపులంగా చర్చించారు. అందువల్ల ఈ కథలు గిరిజనులతో, ఉద్యమాలతో ఏకీభవించే వారికి, సానుభూతిగా ఆలోచించే వారికి ఇచ్చే స్ఫూర్తి వేరు, వాటి పట్ల సానుభూతి లేని వారికి కలిగే స్పందనలు వేరు. రెండూ ఒకే స్థాయిలో వుండవు. ఇది పాఠకుల చైతన్యానికి సంబంధించిన శైలీ, శిల్పం అని జీన్‌పాల్ సాత్రే సాహిత్య శాస్త్రం స్పష్టం చేస్తుంది.

"మనుషుల జీవితాలు, అనుభవాలు, ఆచరణ, ఆలోచనలు, స్వభావాలు వుంటాయి. మనస్తత్వ చిత్రణ ఉంటుంది. కథలో భాష ఉంటుంది. సంభాషణ లుంటాయి. సంఘటనలుంటాయి, సన్నివేశాలుంటాయి. పాత్రలుంటాయి. భావాలుంటాయి. భావావేశాలుంటాయి. కరుణ, శృంగారం, హాస్య, సాహస వంటి

స్పందనలు, సంవేదనలుంటాయి. మానవ స్వభావాలుంటాయి, వారి భావాలుంటాయి. వాటి మధ్య వైవిధ్యం, వైరుధ్యం మరియు ఘర్షణ ఉంటుంది. ప్రకృతి చిత్రణ వుంటుంది. మానవ సంబంధాల పరిణామాలుంటాయి. కథలో కథ చెప్పే తీరు, శైలీ, శిల్పం ఉంటుంది. కథలో రచయిత దృక్పథం, విషయం, నీతి, ధర్మం, ధ్వని ఉంటుంది. కథలో సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, చరిత్ర, పరిణామం వుంటుంది."[22] ఇవన్నీ ఆదివాసీ ఆశలు, ఆరాటాలు, పోరాటాలు కోణంలో ఈ కథల్లో కనపడతాయి.

ఆదివాసీ సామాజిక వ్యవస్థ, సంస్కృతి, జీవన విధానం, ఆలోచనల సంపుటి ప్రత్యేకమైనది. దాన్ని ఒరిస్సాకు చెందిన జ్ఞానపీఠ అవార్డు గ్రహీత గోపీనాథ్ మొహంతి రాసిన 'పరజ, అమృత సంతానం' వంటి నవలల్లో అపూర్వంగా చిత్రించారు. కథా ప్రక్రియ పరిమితుల్లో 'అడవిలో వెన్నెల' కథల్లో ఈ ప్రత్యేకతలను రచయితలు చక్కగా పట్టుకున్నారు. విశ్లేషించారు.

## సాహిత్య వాస్తవికత - సాహిత్య న్యాయం

"సామాజిక వాస్తవికతతో పాటు ఆ సామాజిక వాస్తవికత ఆదర్శవంతంగా ఎలా వుంటే బాగుంటుందో కూడా చిత్రించడం సోషలిస్టు వాస్తవికత అంటారు. జీవితం ఎలా వుందో చెప్పడంతో పాటు ఎలా వుంటే బాగుంటుందో కూడా చెప్పడాన్ని సోషలిస్టు వాస్తవికత అంటారు. సామాజిక వాస్తవికతకు లేదా సహజత్వానికి కాస్తభిన్నంగా ఉన్నప్పటికీ కథ జీవితం చక్కగా వున్నప్పుడు దాన్ని సాహిత్య వాస్తవికత అంటారు. విలువలను, సంస్కృతిని, పరిష్కారాలను ఆదర్శవంతంగా వాస్తవాలకు కాస్త భిన్నంగా చిత్రించినప్పుడు సాహిత్య వాస్తవికతగా గుర్తించి గౌరవిస్తారు. మంచే గెలవడం, కష్టాల్లో కూడా ఆశే నిలపడం కోసం రాసే అంశాలను సాహిత్య వాస్తవికతగా చెప్పవచ్చు. వాటిని సాహిత్య న్యాయం అంటారు. సాహిత్యంలో జీవితంలో వున్న దాని కన్నా ఆదర్శవంతంగా సాహిత్య న్యాయం చేకూర్చడం అవసరం."[23]

'అడవిలో వెన్నెల' కథల్లో ఆదివాసీల జీవితం ఎలా వుందో చిత్రించడంతో పాటు ఎలా వుంటే బాగుంటుందో, అందుకు ఉద్యమించాల్సిన అవసరం ఏమిటో, ఆయా ఉద్యమాల దృక్పథాల నేపథ్యంలో చిత్రించారు. ఆదివాసీలు స్వయంగా ఆలోచించే తీరును కూడా కథల్లో ఆయా పాత్రల ద్వారా అక్షరీకరించారు.



## పాత్ర చిత్రణ

"పాత్రల్లేకుండా కథ రాయడం కష్టం. ఏ స్థాయి పాత్రను తీసుకుంటే ఆ స్థాయి జీవితాన్ని చిత్రించాల్సి వుంటుంది. దీన్నే సహజత్వం అంటారు. రక్తసంబంధాలు, స్నేహాలు పేదల మధ్య చూపవచ్చు, నగర జీవుల మధ్య చూపవచ్చు. గ్రామీణుల మధ్య చూపవచ్చు. అగ్రకుల కుటుంబం మధ్య చూపవచ్చు. బడుగు వర్గాల మధ్య చూపవచ్చు. ఏ పాత్రలను తీసుకుంటామో వారికి సంబంధించిన ఆలోచనా విధానం, సంస్కృతి, ఆర్థిక స్తోమత, వారికి సంబంధించిన సంఘటనలు చిత్రించాల్సి వుంటుంది."[24]

అందువల్ల గిరిజన జీవితాలు, వారి పేదరికం, వారి వంట తీరు, ఆహార సేకరణ, వారి పరిసరాలు, వారి కుటుంబ సంబంధాలు, పెళ్ళిళ్ళు, ప్రేమలు వారి స్థాయిలోనే చిత్రించడం అనివార్యం. 'అడవిలో వెన్నెల' కథల్లో ప్రధాన పాత్రలు వారి చైతన్యాన్ని అనుసరించి కథ శైలీ, శిల్పం, కథా నిర్మాణం సాగడం చూడవచ్చు. 'అడవిలో వెన్నెల' కథలో సుక్రు తరఫున కథ నడుస్తుంది.

"జీవితంలో ఎదురయ్యే సంఘటనను ఇతివృత్తంగా, కథా వస్తువుగా తీసుకోవాలను కున్నప్పుడు అందుకు ఎన్ని అంశాలు చేర్చుకోవాల్సి వుంటుందో ఎన్ని సన్నివేశాలు, పాత్రలు, స్వభావాలు సృష్టించాల్సి వుంటుందో తెలుస్తుంది. పాత్రల మధ్య సంభాషణలు వుంటాయి. సంబంధాలు వుంటాయి.

ఒకే సంఘటనపట్ల ఎవరెవరు ఎట్లా ప్రవర్తిస్తారో మనం గమనించాలి. అందులో వారి ఆర్థికం, హోదా, వ్యక్తిత్వం, కులం, వయస్సుల పాత్ర దేనిదెంత అని లెక్కించుకోవాలి. ఒకే సంఘటన విభిన్న వ్యక్తుల జీవితాల్లో ఎదురైనపుడు ఎవరు ఎట్లా ప్రవర్తిస్తారు. ఒక సంఘటన తన గురించైతే ఎట్లా స్పందిస్తాడు. ఇతరుల గురించైతే ఎట్లా స్పందిస్తాడు. ఒక్కొక్కరి మనస్తత్వం ఎట్లా వుంటుంది. అందులో వారి చదువు పదవి, వయస్సు, కులం, సందర్భం పాత్ర ఎంత? ఎలా వుంటుంది పరిశీలించాలి. కథకు సరిపడే పరిసరాల ఎన్నిక, పాత్రల ఎన్నిక

ఏ కథను ఏ పరిసరాల్లో చిత్రిస్తే బాగుంటుంది? ఒక భావాన్ని లేదా తాత్విక అంశాన్ని మనస్తత్వ అంశాన్ని చెప్పాలనిపించినపుడు - ఎలాంటి కథను అల్లాలి? పరిసరాలు, ప్రాంతం, పాత్రలు ఎలా సృష్టించాలి? వాటి మధ్య పోటీ, సమన్వయం సంఘర్షణ - మానవ సంబంధాల పరిణామాల్ని ఎలా

మలచాలి? ఏది ప్రధాన పాత్రో అనే అంశం చాలా కథల్లో సులభంగానే తెలుస్తుంది. ఎవరి వెంట (కేంద్రంగా) కథ సాగుతుందో అది ప్రధాన పాత్ర. ఆ పాత్ర లేకపోతే కథ సాగదు. అది ప్రధాన పాత్ర.

కథకు కేంద్రం కాకపోయినా ఏ పాత్ర లేకపోతే కథ సాగదో అది రెండో ప్రధాన పాత్ర. అలా కొన్ని కథల్లో రెండు, మూడు ప్రధాన పాత్రలు వుండవచ్చు. కొన్ని కథల్లో ఏది ప్రధాన పాత్రో చెప్పలేకపోవచ్చు. కొన్ని కథల్లో ఇతివృత్తం, థీమ్, సమస్య, పరిసరాలు, సమాజం, సామాజిక పరిణామాలు దానికదే ప్రధాన పాత్రగా వుండవచ్చు."[25]

కథల్లో పాత్ర చిత్రణను పరిశీలించినప్పుడు ఒకే కథలో అనేక పాత్రలు ఉన్నప్పటికి వేటికి ఉండే ప్రత్యేకత వాటికి ఉండనే ఉంటుంది. ఆ పాత్ర స్వభావాన్ని ఆద్యంతమూ కాపాడుకోవటాన్ని పాత్ర చిత్రణ అంటారు. ఆయా ఘట్టాలలో పాత్ర వ్యవహరించే తీరు సహజత్వానికి వీలయినంత దగ్గరగా ఉండాలి. రచనలోని పాత్రలను సృష్టించేటప్పుడు రచయిత తన పరిశీలనపైనే ఆధారపడటం మాత్రమే గాక తన అనుభవం, చెప్పదల్చుకున్న విషయం, దృష్టికోణంపై కూడా ఆధారపడతాడు. పాత్రచిత్రణ అనేది శిల్పంలో భాగం. 'అడవిలో వెన్నెల' కథల్లోని పాత్రలు రచయితల అనుభవాల్లోంచి వచ్చినవే.

## 'కన్నీటికథ-నీటికథ'లో సుక్కుబాయి

'కన్నీటికథ-నీటికథ'లో సుక్కుబాయి హృదయ విదారక జీవితం మనను నిరంతరం వెంటాడుతుంది. "ఆమె ఏడుస్తుంది - కడుపుమంటతో కన్నవారిని తిట్టింది - కట్టుకొన్న వారిని తిట్టింది - జులుంతో పన్నులు గుంజే సర్కార్‌ను సత్తెనాసనమైపోను అని శాపం పెట్టింది... ఏదో అలికిడి అటు చూసింది. గుడ్డేలుగు, అరిచింది - పెడబొబ్బలు పెట్టింది. లాభంలేదు. కొట్లాడింది. రాయిరప్ప ఏది దొరికితే అది విసిరింది. కొరికింది. వాడిగోళ్ళు కండల్ని పీకాయి. పుర్రెమీద కొట్టింది. అప్పటికే ఆ యుద్ధభూమి రక్తసిక్తమైంది. గుడ్డెలుగు కొట్టిన దెబ్బకు పొట్ట పగిలి కడుపులో బిడ్డ, రక్తం ముద్ద నేలతల్లి వొడిలో పడింది. అది ఘోరమైన చావు."[26]

ఇది చదివాక ఏడ్పు రాకుండా వుండడం సాధ్యం కాదు. క్లుప్తంగా చిత్రించినప్పటికీ పాత్ర స్పష్టంగా మన కళ్ళముందు కనబడుతుంది.



## 'ఐదు రూపాయల' కథలో షావుకారు కాసం రామయ్య

'ఐదు రూపాయిల కథ' లో షావుకారి పాత్రచూసినట్లయితే పట్టణ ప్రాంతాల నుండి అడవుల్లోకి వచ్చి ఉప్పు, పప్పు, కారం అనే పేరుతో గిరిజనులను మోసగించే తీరు బోధపడుతుంది. "షావుకారు కాసం రామయ్యకు ఆ గూడేల మీద కన్ను పడింది. ఒకటా రెండా లెక్కలేదు గంప నెత్తినేసుకుని కొండలు కోనలు తిరిగాడు... పొగాకు రిక్కిచ్చి తవ్వెడు కందులు తీసుకొనేవాడు. చిన్న బెల్లం ముక్కిచ్చి సోడు నువ్వులు తీసుకునే వాడు. సోలెడు బియ్యమిచ్చి అడ్డెడు అవిశెలు తీసుకునే వాడు... ధరలు అతని ఇష్టం. చిన్న చిన్నగా అప్పులిస్తూ ఆ గూడేలకు దగ్గరలో పెద్ద పల్లెలో పెద్ద బంగ్లా కట్టుకున్నాడు. వంద ఎకరాల భూమికి ఆసామి అయ్యాడు. పది మంది జీతగాళ్ళు. పెద్ద కిరాణా దుకాణం. వెండి బంగారం కుదవపెట్టుకున్నదెంతో వాళ్ళకిచ్చిన అప్పుఎంతో, దానికి జప్తు చేసుకొన్న వెండి బంగారమెంతో లెక్కలేదు. పదితులాల బంగారుకంటెకి పదిపదులిస్తే మహా ఎక్కువ. అట్లా అతను యింతకు పెరిగాడు."[27] గిరిజన ప్రాంతాల్లోకి వెళ్ళిన వ్యాపారులు ఆదివాసీల అమాయకత్వాన్ని గమనించి ఎలా దోపిడీ చేశారో ఈ పాత్రలో చిత్రించారు. రగల్ జెండా బ్యాలెలో సాహు ఈ షావుకారు పాత్రను మరింత సమగ్రంగా చూపించాడు.

## 'రక్తపింజెర' కథలో సూపర్‌వైజర్ శర్మ

'రక్తపింజెర' కథలో సూపర్‌వైజర్ శర్మ పాత్రను కళ్ళముందు కట్టించాడు. "మొకద్దమ్‌ను పిలిచి ఎందరు పనికివచ్చార్రా" బొంగురు గొంతుతో నిర్లక్ష్యంగా ... మళ్ళీ శర్మ 'జుగ్నాకబొజ్జు' రాలేదని తెలుసుకొని "నడువ్‌బే.... ఇద్దర్ని తీసుకుపో, పోయివాన్ని ఈడ్చుకరాపో ............ ఏమనుకున్నడో"[28] దోపిడీ చేసే ఆధిపత్యం పాత్ర అహంకారాన్ని ఎలా ప్రదర్శిస్తుందో స్పష్టం చేశాడు. ఒక పక్క గిరిజనుల శ్రమను దోచుకుంటూ, వాళ్ళనిపని మనుషుల్లా చూస్తూ, పశువుల్ని సంబోధించినట్లు సంబోధించడం చూస్తే గిరిజనులపట్ల వాళ్ళ వైఖరి స్పష్టమవుతుంది.

## 'అడవిలో వెన్నెల' కథలో ఇస్రూ, ఏసు, లకింబాయి

'అడవిలో వెన్నెల' కథలోని ఇస్రూ, ఏసు, లకింబాయి పాత్రలు సజీవ పాత్రలుగా జీవితంలో మర్చిపోలేము. ఆదివాసీ కుటుంబం, యువతీ యువకులు,

వారి ప్రేమలు, ఆలోచనలు, ఆరాటాలు, వారి వ్యక్తిత్వాలు, నిర్మలమైన వారి హృదయాలు ప్రతి పాత్రను ప్రత్యేకంగా మలిచిన తీరు ఈ కథలో కనబడుతుంది. రసి కారే పుండుతో కాలును నీళ్ళలోకి దింపి దాని కోసం వచ్చే చేపలను పట్టే తీరు రచయిత పాత్ర చిత్రీకరణలో సునిశిత దృష్టి గోచరిస్తుంది.

## 'గెరిల్లా' కథలో ఎస్ఐ

'గెరిల్లా' కథలో యస్.ఐ గిరిజన స్త్రీతో జరిపిన సంభాషణలను గమనిస్తే ప్రభుత్వం, ప్రభుత్వ ఉద్యోగుల మాట తీరు తెలుస్తుంది. "లంజెల్లారా ! మీ మొగోల్లంతా యెటుపోయిండ్లే" అంటాడు యస్.ఐ. ఓ ముసల్ది ధైర్యంచేసి "బంకకు అడవిలకు పోయింద్రు గీయాలప్పుడు యెవరుంటారు బాంచెను" అంటుది. యస్.ఐ మళ్ళీ రెట్టిస్తూ "అడవిలకు పోయిండ్లానే లంజ. పొరకల సార్లతో కల్సిపోలేదే"[29] అంటాడు. గిరిజనులు అడవుల్లో ఉంటున్నారు కాబట్టి, ఆ అడవుల్లో పొరకలసార్లకు తిండి బెట్టి మరింక మావోయిజానికి పాల్పడుతున్నారనే ఉద్దేశ్యంతో రకరకాలుగా, పోలీసులు గిరిజనులను హింసించడం జరుగుతోంది. ఏ రోజు కూడా గిరిజనులను గౌరవంగా చూసిందిలేదు. ఈ కథలో పాత్రకు, స్వభావానికి అనుగుణంగానే సంభాషణ సాగినట్లు తెలుస్తోంది.

## ఇతర పాత్రలు

అలాగే 'తుడుం'లో భీక్యాపాత్ర, 'మరట్‌తుడుం పాయానా' లో సాయిలింగు పాత్ర, 'గంగజిమ్మ'లో చిన్నన్న, ఇస్తారక్క, అంకమ్మ పాత్రలు, 'జెండాకథ' లో 'నిర్ణయం' కథలోని పాత్రలు జీవితాంతం గుర్తుండిపోయే పాత్రలు. ఇలా ఏ కథను తీసుకున్నా ఆ కథలోని పాత్రలన్నీ సహజంగా, ఆ పాత్రోచిత చైతన్యంతో ఎదగడం కనిపిస్తుంది. రచయితలు తమ పాత్రల చేత ఎక్కడ పాత్ర చైతన్యాన్ని మించి మాట్లాడ నివ్వకపోవటాన్ని ఈ కథల్లో గమనించవచ్చు.

## సన్నివేశ చిత్రణ

ఒక సన్నివేశంలో పైన పేర్కొన్న అంశాలలో ఒకటి కానీ, అంతకంటే ఎక్కువకానీ ఉండవచ్చు. సన్నివేశకల్పన పూర్ణత సాధించాలంటే పై అంశాలు తప్పనిసరి. కథకు పాత్ర చిత్రణ, సంభాషణలాగే సన్నివేశ కల్పన కూడా ప్రాణం లాంటిది. 'అడవిలో వెన్నెల' కథల్లో అనేక సహజ సిద్ధమైన సన్నివేశాలు



కనిపిస్తాయి. "కథలో జరిగే వాటికి అనుగుణమైన పరిసరాలను నేపథ్యాలను, వాతావరణ స్థితిగతులను అత్యంత సహజంగా ప్రతీకాత్మకంగా చిత్రించటం"[30] సన్నివేశ కల్పన అన్నారు పోరంకి దక్షిణామూర్తి గారు.

## 'రక్త పింజెర'లో సన్నివేశ చిత్రణ

'రక్త పింజెర' కథను పరిశీలించినట్లయితే "శిత్ర చుట్ట ముట్టించు కున్నాడు – పొగతో పాటు గొంతు పెకిలి మాటొచ్చింది. వానపాయె, పంటపాయె, ఇంగనీయవ్వ తినన్కైతె లావుతిప్పలు గాలిపాయె, తక్లీబున్నది బయి ఎట్లనో ఏందో ఆరిపోతున్న చుట్టనుపీల్చి ఎందుకు పేన్కు (దేవుడు) గిట్ల సూత్తాండే బాయి" అని ఆరిపోయిన చుట్ట మళ్ళీ ముట్టిచ్చుకున్నాడు. అలానే "కూలీలంత రోడ్డు పనిచేస్తున్నారు. అడ్డంగా ఉన్న చెట్లు, తుప్పలు నరికేవారు నరుకుతున్నారు. బండలు పెకలించేవాళ్ళు ముక్కుతూ మూలుగుతూ పెరికేస్తూనే ఉన్నారు.

ఒక్కొక్క బండకు గూటనరాలు చిటపట లాడుతున్నాయి. మాగిన కుండల్లాంటి చెత్తల్లోంచి చెమట ధారలు కదుతోంది. మట్టి మోసేవాళ్ళు మోస్తూనే ఉన్నారు. అట్లా పనిచేస్తున్న వాళ్ల పనితీరు చూస్తే ఆకాశ మార్గం కూడా స్వర్గం చేరేటట్లున్నారు."[31]

శిత్ర కుటుంబం నిరుపేదకాబట్టి, పాత్రను గుణంగా పరిసర పరిస్థితులను చిత్రించడం జరిగింది. పాత్రాను గుణంగా సన్నివేశ కల్పన చేయటం వల్ల సహజత్వం ఈ కథల్లో ఉట్టిపడుతోంది.

## 'కన్నీటికథ – నీటికథ'లో సన్నివేశ చిత్రణ

సన్నివేశ కల్పనలో సహజత్వం ఉట్టిపడాలి. అప్పుడే సాహిత్యంలో వాస్తవికత ఉంటుంది. 'కన్నీటికథ – నీటికథ'లో సుక్కుబాయి నీటికోసం వెళ్లడం, ఎలుగుబంటి దాడి చేయడం, గర్భం నుండి పిండం బయటపడటం, పుర్రె లేచిపోవడం, కిందపడిపోవడం, గూడెం కదలడం మొదలైన సన్నివేశ చిత్రణ దృశ్యాలు బీభత్స రసంతో మన ముందుంచుతాయి.

'ఆకలి' కథలో ప్రభుత్వంపై ఆధారపడిన గిరిజన జీవితాలు, వారి బతుకులోని విషాదాలను తెలిపే అనేక సన్నివేశాలు ఉన్నాయి. స్థూలంగా అన్ని కథల్లోని సన్నివేశాలు, ఆయా కథలకు సహజంగా సరిపోయే విధంగా ఉన్నాయి.

## 'అడవిలో వెన్నెల'లో సన్నివేశ చిత్రణ

'అడవిలో వెన్నెల' కథలో "అడవిలో కాస్తున్న ఎండకూడా చల్లగా వెన్నెలలా ఉంది. ఎండ తగలకుండా ఆకాశమంత ఎత్తు ఎదిగిన వృక్షాలు వారికి గొడుగు పడుతున్నాయి. గాలికి అడవి అడివంతా కదులుతోంది. అపుడపుడు ఆకులొక్కొక్కటి రాలుతున్నాయి. అక్కడక్కడ వనంలోని పురుగుల రొద, ఉడతల పరుగులు, కిచకిచలు లయగా లయగా విన్పిస్తున్నాయి. ఆలా వీస్తున్న గాలిలో వాతావరణం అడవిలా గంభీరంగా వుంది."[32] ఈ మాటల ద్వారా ప్రకృతిలోని మార్పును సన్నివేశ గతంగా రచయిత వర్ణించారు.

## 'గంగజిమ్మ'లో సన్నివేశ చిత్రణ

'గంగజిమ్మ' కథలో ఒక సన్నివేశ చిత్రణ... "ఇంతలో గుడిసె బయట అడుగు చప్పుడైంది. సమ్మన్న సప్పున లేచి బయటికిపోతూ తడక బెట్టి వాకిట్లో నిలబడ్డాడు. ఇస్తారక్క లేచి సంకల బిడ్డను గడంచల పండుకోబెట్టి నెగడి కట్టెలు గుంజి మంట తగ్గించింది. గుడిసెంత ఇంకా చీకటైంది.

సంచిని గుడిసె ఎనక దిక్కు తడక దగ్గర బెట్టి మొగరానికి కట్టిన నారకట్టు విప్పి తడక సందు జేసింది. చిన్నన్న యింటెన్కకు పెరట్లకు పోవటానికి దారిజేస్తూ ఇదంతా జేయడానికి గడియ పట్టలేదు. చిన్నన్నను అవసరమొస్తే తప్పించటానికి ఆమె చొరవ ప్రయత్నాలు. చిన్నన్న మనసు కృతజ్ఞతతో నిండిపోయింది."[33] ఇటువంటి సన్నివేశ కల్పనలు కథకు మరింత బలాన్నిస్తాయని చెప్పవచ్చు.

## 'గెరిల్లా'లో సన్నివేశ చిత్రణ

'గెరిల్లా' కథలో "లంజకొడుకుల్లారా యింకేమి చూస్తారు వెనక్కిపద' అంటూ కానిస్టేబుల్స్ మీద కసురుకున్నాడు యస్.ఐ. ఆ ఎండలో తప్పడ తప్పడ బూట్లు ఆడించుకుంటూ తుపాకులు సవరించుకుంటూ గూడెంలకు వచ్చింద్రు పోలీసులు, దాహంతో గొంతెండి పోతుంది.

అందరికి మంచినీల్ల కోసం కేక వేస్తే ఒక్కడు కూడా గుడిసెల నుండి బయటికి రాలేదు. అసలు గూడెంలో ఎవరూ ఉన్నా జాడే కనిపించటము లేదు"[34] ఈ కథా శీర్షికకు సరిపోయే సన్నివేశ చిత్రణ పై ఉదాహరణలో చూడవచ్చు.



## సంఘటనల కూర్పు మచ్చుకు కొన్ని...

మనిషి జీవితంలో నిద్ర లేచింది మొదలు నిద్రపోయే వరకు అనేక సంఘటనలు జరుగుతుంటాయి. ఒక రోజు జరిగిన సంఘటనలన్నీ గుర్తుండవు. అసాధారణ పరిస్థితుల్లో జరిగిన సంఘటనే గుర్తుంటుంది.

రచయిత అనుభవంలోకి వచ్చిన సంఘటనల ఆధారంగానే రచన కొనసాగించడం సహజం. "ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని పాత్ర (ల)ను ప్రభావితం చేసేటట్లు జరిగిన విషయాన్ని 'సంఘటన' అనవచ్చు"[35]. అంటారు పోరంకి దక్షిణామూర్తి గారు. కొన్ని సంఘటనల సమాహారం వల్ల కథ నిర్మాణ మవుతుంది. కథానిక విస్తృతి చిన్నది కాబట్టి ఎక్కువ సంఘటనలుండే అవకాశం లేదు. ఉన్నా అందులో ప్రధాన సంఘటన కథలోని సంఘటనలకు ఆలంబనమవుతుంది. ఈ ప్రధాన సంఘటన పాత్రలోని మార్పుకో, ఒక ముగింపుకో, మలుపుకో తోడ్పడవచ్చు. కొన్ని కథలు అధికశాతం మానసిక చిత్రీకరణతోనే నడవవచ్చు. అది రచయిత అభిరుచిని బట్టి సాగుతుంది.

ఉదాహరణకు ఎన్నుకున్న కథల్లోని సంఘటనలు కొన్ని.....

"అ వూళ్లో సంఘ సూర్యుడు ఉదయించాడు

భూమి కొరకు నెత్తురంతా

కాల్వలైనా కదిలిపోదుము

జైల్లోన మమ్ములేసిన

అసలుకే వెను తిరిగిపోము"[36] అని తుంబాగూడెం పాట పాడిన సంఘటన ఎవరు మరువగలరు.

ఇది కథను పరాకాష్టకు తీసుకెళ్ళింది. ఉద్యమాలు పీడిత వర్గాల్లో తెచ్చిన చైతన్యానికి ఈ కథ సజీవ ఉదాహరణ.

అలాగే 'రక్తపింజెర' కథలో చనిపోయిన 'మల్కుబాయి' సంఘటన ఎవరినైనా కదిలిస్తుంది. రచయిత అధికారుల ఆధిపత్యం ఏ విధంగా కొనసాగుతుందో చెప్పదలిచాడు ఈ సంఘటన ద్వారా. 'మల్కుబాయి' చావు అధికార వ్యవస్థకు ప్రతీక.

### 'జెండాకథ' లో ఒక సంఘటన

"రివ్వున గాలి వీచింది. జండా రెపరెపలాడింది. అంతకన్నా గట్టిగా గోండ్లోల్లు ఘల్లున నవ్విండ్లు.

కళ్ళున్న పోలీసులు గుడ్డోలయ్యిండ్లు.

"అది మా జాతిజెండా సార్......." జంగు

"మరి పొరకల సార్లు రాలేదా ?"

"అన్ని గూడేలకచ్చినట్లు మాకాడికి అత్తండ్లు"

డి.యస్.పి.కి తల తిరుగుతోంది.

"ఇప్పుడేడున్నారు?"

"ఏడికిపోతరో మాకేడ తెలుత్తది సార్................అనచ్చేది పానం పోయేది తెలువనట్టె ఆళ్ళ సంగతి"[37] ఈ సంఘటన పోలీసుల నిజ స్వరూపాన్ని తెలియజేస్తుంది.

సంఘటన గురించి పరిశోధకులు ఇలా అంటారు. "సంఘటన అన్ని వేళలా కథకి అచ్చు గుద్దినట్టు సరిపోదు. జరిగిన సంఘటనకి కొన్ని మార్పులు చేర్పులు కావలిసివుంటుంది. ఒక్కొక్కప్పుడు అసలు సంఘటన కన్నా కల్పనే ఎక్కువ వుంటుంది. మరొకప్పుడు జరగని సంఘటననే జరిగినట్టు ఊహించుకోవాల్సి వుంటుంది. ఇందుకు కల్పన కావాలి. ఈ కల్పన రచయిత ప్రతిభ మీద ఆధారపడి వుంటుంది"[38]. 'అడవిలో వెన్నెల' లో ఉన్న ప్రతి కథా ఒక నిజజీవిత సంఘటనే. రచయితలు పోరాట సంఘటనలను ఆధారంగా చేసుకొని వాటికి తగిన పరిసర వాతావరణాల్నీ, పాత్రలనూ, సన్నివేశాలను వాస్తవికంగా, సహజత్వం ఉట్టిపడే విధంగా చిత్రించారు.

### సంభాషణలు - వ్యక్త సమాజం, అవ్యక్త సమాజం

'సాహు ఇంటర్వ్యూలు' పుస్తకానికి రాసిన ముందుమాటలో ఉషా.ఎస్.డానీ ఆదివాసులు అవ్యక్త సమాజమని, మైదాన ప్రాంత పౌర సమాజం వ్యక్త సమాజమని పేర్కొన్నారు. వ్యక్త సమాజం తమ భావాలను, ఆశలను వ్యక్తం చేస్తుంది. అవ్యక్త సమాజం వాటిని మాటల్లో వ్యక్తం చేయలేదు. అవ్యక్త సమాజాన్ని



చిత్రించేటప్పుడు వారి భావాలను మానసిక సంఘర్షణ రూపంలో, హావభావాల రూపంలో చిత్రిస్తారు. ఈ కథల్లో చాలా సందర్భాల్లో ఈ జాగ్రత్తలు తీసుకొని కథలను చిత్రించారు. వ్యక్త సమాజ అభివ్యక్తి వేరని, అవ్యక్త సమాజ అభివ్యక్తి వేరని ఈ రెండూ వేర్వేరు సమాజాలని డానీ పేర్కొన్న ప్రకారం చూస్తే ఈ కథలు, ఆయా ఆదివాసీల చిత్రణ వ్యక్త సమాజానికి సంబంధించిన శైలీ, శిల్పం, వస్తువు, కథా నిర్మాణం, కథా నిర్వహణ కన్నా భిన్నమైనది, ప్రత్యేకమైనది.[39]

కథా రచనలో సంభాషణాలు ఎక్కువ ప్రాముఖ్యం కలిగి ఉంటాయి. రెండులేక అంతకంటే ఎక్కువ పాత్రలు మాట్లాడుకుంటే సంభాషణ అవుతుంది. సంభాషణల ద్వారా కథ చెప్పడం రెండు రకాలు. ప్రధానంగా పాత్ర సంభాషణ ద్వారా లేదా ఇతర విషయాల ద్వారా కథ చెప్పడం ఒక పద్ధతి. మరో పద్ధతిలో వర్ణనలు, సన్నివేశకల్పనలు, పాత్ర చిత్రణ లాంటివి ఏమీ లేకుండా పాత్రల పేర్లును కూడా తెలపకుండా కేవలం పాత్రల సంభాషణల ద్వారానే కథ నడపడాన్ని సంభాషణలంటారు.

"సంభాషణ అనేది బట్టలోని ఒక నిలువుపోగు. ఒక అడ్డపోగు వంటిది. బుట్టలోని నిలువు నార, అడ్డనార వంటిది. ఇద్దరి సంభాషణ ఒకే తీరుగా సాగకూడదు. సంభాషణలో సంవాదం వుండాలి. సంవాదం ద్వారా బట్టనేసినట్టు విషయం తెలుస్తూ రావాలి.... సంభాషణతో కథ ప్రారంభించవచ్చు. సన్నివేశ చిత్రణ తరువాత సంభాషణ కథ కొనసాగింపుగా నడిపించవచ్చు. ఒకే విషయాన్ని సంభాషణలో చర్చించవచ్చు. ఒకే విషయంలోని భిన్న కోణాలను చర్చించవచ్చు. రెండు భిన్న కోణాలు సంభాషణలో సంఘర్షించవచ్చు....

చప్పట్లు కూడా మాట్లాడతాయి. ప్రసంగం వింటూ కొట్టే చప్పట్లలో అనేక అర్థాలు వుంటాయి. బాగుందని ఒక అర్థం. చాలు చాలు అని ఒక అర్థం. షేమ్ షేమ్ అని మరొక అర్థం. గురుబోధలో తలలు వూపడం కూడా సంభాషణే. సంపాదకీయాలు, వ్యాసాలు, కథలు, కవితలు, వార్తలు కూడా మనతో సంభాషణే. కొన్ని విషయాలు చెప్పడానికి నోరు ఆడదు. గుండె గొంతుకలోన కొట్లాడతాది కూసుండ నీదురా కూసింత సేపు అన్నాడో కవి. లోపల భావం వుంటుంది. అది వెలికి రాదు. హావ భావాల్లో, బాడీ లాంగ్వేజ్‌లో అది వ్యక్తమవుతుంటుంది. ప్రేమికులు పరస్పరం... అలాగే అధికారుల ముందు, గౌరవనీయుల ముందు,

భయంకరుల ముందు కూడా ఇలాగే మాట పెకిలిరాదు. అటువంటి సందర్భాల్లో ఆ సంభాషణను హావ భావాల్లో చిత్రించాలి."[40]

## 'అడవిలో వెన్నెల' కథల్లోని సంభాషణ

'అడవిలో వెన్నెల' కథల్లోని సంభాషణలు ఆసక్తికరంగా, వాస్తవికంగా, పాత్రోచితంగా ఉంటాయి. ఆదివాసీలు సంభాషణ కన్నా హావభావాల్లో తమ భావాలను వ్యక్తం చేస్తుంటారు. ప్రేమను, బాధను వారి మాటల్లో కన్నా, కళ్ళతో, హావభావాల్లో వ్యక్తీకరిస్తారు.

## 'రక్తపింజెర' కథలో సంభాషణ

"బొజ్జమామ పనికిరానన్నడా' పిల్ల అడిగింది.

"నీకెందుకు బాయి' డోబిగుసగుసగా

శర్మ గడియారాన్ని చూసుకొని గ్యాంగులకేసి నడిచిండు. "బొజ్జ మామకు జెరమొచ్చిందా" మళ్ళీ పిల్ల..................పైసలిత్తె కొట్టాలు మల్సుబాయి. కొట్టాలని ఏ ఖానూండ్ల రాసిండు'[41] ఇంకొకడు ఇలా ఇద్దరి, ముగ్గురి మధ్య సాగిన సంభాషణ కథకు బలాన్నిచ్చిది.

## 'తుడుం' కథలో సంభాషణ

'తుడుం' కథలో ప్రభుత్వాధికారితో ఒక ముసలావిడ చేసిన సంభాషణ అద్భుతం. అది "గిన్నేండ్లు మేం సచ్చినమో బతికినమో సూడని సర్కారుకు దయెట్ల గలిగిందోంట' చేతులు తిప్పుతూ అన్నది. ఒక్కపలుచటివాడు తలగోక్కున్నాడు.

"మీవూళ్ళకు సడుకు లేపిత్తది" ఎద్దు ముఖం

"మాకు కాళ్ళున్నాయి" స్త్రీ

"మీ మోటర్ల కోసమా' వెనుకలైనులోంచి బొంగురుగొంతు

"మేకల గొని స్తది"

"అవి ఏడమెయ్యాలె, సెకిదారు పుల్లరని కోసుకుంటదు" జనంలో నుండి

"మీకు ఎద్లు గొనిస్తది"



'కంకల గట్టి ఏడ దున్నుదుం. సర్కారు ఉన్న భూమి రిజర్వోల్లదనే'

'మీకు అప్పులిస్తది'

'ఎన్నేండ్లు'

'మాదెర్ సోదు మీరంతా నక్సలైట్లు"[42]

ఇలా 'అడవిలో వెన్నెల' కథల్లో సంభాషణలను పాత్రలకు అనుగుణమైన సంభాషణతో పాటు అవ్యక్త సమాజ హావభావాలను, మానసిక భావ సంఘర్షణలను రచయితలు ప్రత్యేక దృష్టి నిలిపి చిత్రించినట్లు స్పష్టమవుతుంది.

## కథన రీతులు

కథన రీతులు పలు రకాలు. ప్రతి రచయితా తనదైన ప్రత్యేక కథన రీతిని, శైలీ, శిల్పాన్ని రూపొందించుకుంటూ వస్తారు. ఒక పేరా చదవగానే ఫలానా వారి రచన అయి వుంటుంది అనే భావం కలగడం ఆయా రచయితల కథన రీతి వల్ల సాధ్య పడుతుంది. "ఏం చెప్పాలి, ఎలా చెప్పాలి అనే అంశాలు పరస్పర ఆధారితాలు. ఏం చెప్పాలనే వస్తువుననుసరించి ఎలా చెప్పాలనే సాహిత్యరూపం ఏర్పడుతుంది. అలాగే ఎలా చెప్పాలనే రూపాన్ని అనుసరించి ఆ సాహిత్య రూపంలో, ప్రక్రియలో ఒదిగే వస్తువుకు ఒక సాహిత్య పరిమితి అంటూ ఏర్పడుతుంది. ఎలా చెప్పాలి అనే దాన్ని అనుసరించి మాట, పాట, కథ, కవిత, సంగీతం, ఇతర కళలు, ప్రక్రియలు వైవిధ్య పూరితంగా రూపుదిద్దుకున్నాయి.... ఏం చెప్పారు అనే దాన్ననుసరించి ఇది సాహిత్యమని చెపితే వార్తా రచనకు, సాహిత్య సృజనకు తేడా గుర్తించలేం. ఎలా చెప్పాను అనే దానన్ననుసరించి అది వార్తో, పాటో, కథో, కవితో, నవలో, ఇతర కళలో, ప్రక్రియలో అవుతాయి. అందువల్ల అది ఏ ప్రక్రియో అని వర్గీకరించడానికి ఎలా చెప్పారో అనేది ప్రాథమికం."[43]

కథ చెప్పే వాళ్ళను కథకులు అని, చదివేవాళ్ళను పాఠకులు అని అంటారు. అంటే ఒక వైపు రచయిత, మరో వైపు పాఠకుడు ఉంటాడు. ఈ కథనం సాధారణంగా రెండు రకాలుగా ఉంటుంది.

1. ప్రత్యక్ష కథనం
2. పరోక్ష కథనం

"రచయిత కథక స్థానంలో ఉండి చెప్పేది ప్రత్యక్ష కథనం. కథాగతమైన పాత్ర, సన్నివేశం మెదలైన వాటి ద్వారా చెప్పేది పరోక్ష కథనం. కాబట్టి ఒక రకంగా చూస్తే పాత్రల స్వగతాలు, సంవాదాలు కూడా రూపవైవిధ్యాలేనన్న విషయం స్ఫురిస్తుందని"[44] అంటారు పోరంకి దక్షిణామూర్తి. ప్రధానంగా కథ చెప్పటానికి (రాయటానికి) ఏదో ఒక కథనం అవసరం అవుతుంది. ఏ విధంగా చెపితే బాగుంటుందనేది రచయిత ఆలోచనపై ఆధారపడి వుంటుంది. ఏ పద్ధతిలో చెప్పితే పాఠకుల హృదయాల్లో నిలిచిపోయేటట్లుంటుందోనని భావిస్తారో ఆ పద్ధతినే అనుసరిస్తారు. కథనానికి ఒక రచయిత ఎన్నుకొనే ఈ కోణాన్నే దృక్పథం (పాయింట్ ఆఫ్ వ్యూ) అని కూడా అంటారు.

కథకుడు తన కథలకు అవసరమైన ఇతివృత్తాన్ని వాస్తవ ప్రపంచంలో నుంచి ఎన్నుకుంటాడు. అయితే అడవిలో వెన్నెల కథల్లో చూసినట్లయితే బతుకుతెరువు కోసం నిరంతరం అడవులపై ఆధారపడి బతికే గిరిజనులు వాళ్ళని రకరకాలుగా దోచుకొని అణచివేయాలనుకునే అధికారులు, వాళ్ళ మధ్య తలఎత్తే సమస్యలు ఈ కథలకు ఇతి వృత్తాలయ్యాయి. ఈ కథలు ఉద్యమ కారులను, ఉద్యమించే ప్రజలను, వారి పట్ల సానుభూతితో చూసే వారిని ఎంతగానో కదిలించాయి. మధ్యతరగతి వారిని, ఆయా ఉద్యమాలను వ్యతిరేకించే వారిని ఈ కథలు అంతగా కదిలించలేకపోవచ్చు. అలాంటి వారు వస్తువు గురించి కాకుండా శైలీ, శిల్పం గురించి బాగాలేదని సాహిత్య విలువలు, సాహిత్య ప్రమాణాలు అందుకోలేరని తప్పుడు ప్రచారం చేస్తుంటారు.

"సహృదయతకు వర్గ స్వభావం వుంది. కుల స్వభావం వుంది. ఆడామగ సహృదయతలో తేడా వుంది. మగవారి సహృదయతకు పురాధిపత్య స్వభావం వుంది. చదువుకున్న వారి సహృదయతకు ఇగో, అహం, హిపోక్రసీ స్వభావం వుంది. స్థిర దృక్పథం కలవారి సహృదయతకు ఏకపక్ష స్వభావం వుంది. సహృదయతకు జాతి, మత, దేశ, మత, ప్రాంత, భాషా స్వభావం వుంది. ఈ గోడల్ని పగలగొట్టి స్వచ్ఛంగా వికసించే మానవత కూడా ఈ సహృదయతలోనే వుంది."[45]

## ప్రథమ పురుష కథనం – సాహు కథల్లో

అడవిలో వెన్నెల కథల్లో మూడు రకాలైన కథా కథనం కనిపిస్తుంది. కథా



కథనాన్ని ప్రధానంగా ప్రథమ పురుష కథనం, ఉత్తమ పురుషకథనం, అని రెండు రకాలుగా విభజించవచ్చు.

పోరంకి దక్షిణామూర్తి గారు అన్నట్లు "కథలో ప్రత్యక్ష ప్రమేయం లేకుండా కేవలం సాక్షీ భూతుడుగా నిలిచి కథకుడు చెప్పేది ప్రథమ పురుష కథనం"[46] అవుతుంది. ఇందులో కథకుడు కొన్ని సార్లు పాత్రలను పేర్లతో కాకుండా 'అతడు' 'ఆమె' వాళ్ళు 'వారు' వీరు మొదలైన సర్వ నామాలతో సూచించి కథను ముందుకు నడిపిస్తారు. ప్రథమ పురుషలో రచయితే సర్వ సాక్షి. సర్వవ్యాప్తి. అందువల్ల పాత్రలకు తెలియని అంశాన్ని, తెలియనవసరం లేని అంశాల్ని తానే చెప్పవచ్చు.

'రక్త పింజెర' కథ ప్రథమ పురుషలో ఉంది. కథను పరిశీలించినట్లయితే "శిత్య చుట్ట ముట్టించుకున్నాడు. పొగతో పాటు గొంతు పెకిలి మాటొచ్చింది. వానపాయె, పంటపాయె. ఇంగ నీయవ్వ తిననికైతె లావు తిప్పలు గాలిపాయె, తక్లీబున్నది బయి ఎట్లనో ఏందో, అరిపోతున్న చుట్టును పీల్చి 'ఎందుకు పెన్కు గెట్ల స్తూత్తాందేబాయి' అని అరిపోయిన చుట్ట మళ్ళీ ముట్టంచుకున్నాడు."[47] ఇందులో కథకుడు కథలో ప్రత్యక్షంగా కనిపించకుండా పరోక్షంగా కథను నడిపిస్తాడు. కాబట్టి ఈ కథ ప్రథమ పురుష కథనం అవుతుంది.

'నిర్ణయం' కథలో... "అతని వయస్సు చెప్పలేం కాని వృద్ధుడుగా కన్పిస్తున్నాడు. ఎండిపోయిన చెంపలు, లోతుకుపోయిన కళ్ళు, చిరిగిన రుమాలు .......... నెత్తిమీదికొచ్చిన సూర్యునివేడి తుట్టుకోవడానికి అతన్ని ఆచ్ఛదించే వస్త్రాలు ఏమీలేవు. మొలుకున్న దోతి పేగు, రుమాలే. అతన్ని అంత వేడి నుండి కాపాడేది అడవితల్లే ........కండలేని అస్థిపంజరం గూడ అయిన ఆ చేతుల్లో ఓ మార్పు(గొడ్డలి) నోరు ఉంది కాబట్టి ఈ పశువులు ఇతని ఆజ్ఞల్నీ పాటిస్తున్నాయి"[48] ఇక్కడ కూడ రచయిత పరోక్షంగా కథను నడిపిస్తాడు. 'కాయిదా' పెళ్ళికావాలి' జెండాకథ' గెరిల్లా' రగల్ రాజ్జెం మైసివాకట్' కథలు కూడా ప్రథమ పురుష కథనాన్ని కలిగి ఉన్నాయి.

## ఉత్తమ పురుష కథనం – సాహు కథలు

కథకుడు స్వయంగా కథను చెప్తూ తనను తాను 'నేను' అని ప్రస్తావిస్తూ కథను ముందుకు నడిపిస్తూ ఉంటే అలాంటి కథనాన్ని ఉత్తమ పురుష కథనం అంటారు. "ఈ పద్ధతిలో కథకుడు ఓ ప్రధాన పాత్రలో ఉంటూ కథ చెప్పుకు

పోతాడు. రచయిత ఎక్కడా వేరుగా కనిపించడు. రచయిత చెప్పదల్చు కున్నదంతా ఆపాత్ర ద్వారానే వర్ణిస్తాడు. ఒక్కోసారి రచయితే ఆ ప్రధాన పాత్ర అనిపిస్తుంది."[49]

"కథలో రచయిత పాత్రగా ప్రవేశించి దాని ద్వారా చెప్పడం ప్రారంభిస్తే అది ఉత్తమ పురుష కథనం అంటారు. కథలో పాత్ర అయినవారు తన ఉనికి తెలిసేటట్లుగా చెప్పే కథనం ఉత్తమ పురుష కథనం. దీంట్లో తరచుగా నేను అన్న ప్రస్తావన కొన సాగుతూ ఉంటుంది. ఆ పాత్ర భావాలు అతని మాటల్లోనే వెలువడు తుంటాయి"[50] అని పోరంకి దక్షిణామూర్తి అంటారు. ఇందులో ఎంత క్లిష్టతరమైన విషయాన్నయినా కథగా మలచవచ్చు.

'అడవిలో వెన్నెల' లోని 'కన్నీటి కథ – నీటికథ' ఉత్తమ పురుషలో ఉంది. "ఆ కొండ కోనల్లోని గిరిజనుల కథలు ఎన్నని ఏ కరువు పెట్టను, హద్దు లేనన్ని గాథలు, అది వేసవి కాలం. సూర్యునితో పాటు మేము ప్రయాణం చేస్తున్నాం. అడవి అందంగా వుంది. నిశ్శబ్దంగా భయంకరంగావుంది. గంభీరంగావుంది. ఎత్తయిన కొండలు, ఆ కొండల్ని చూస్తే మానవ మాత్రులు ఆ కొండలపైన వున్నారని, వుంటారని వూహించలేం."[51] ఈ కథలో పాత్రకు బదులుగా రచయిత మేము అని సంబోధించుకుంటూ కథని నడిపించాడు కాబట్టి ఈ కథ ఉత్తమ పురుషలో నడిచిన కథగా చెప్పవచ్చు.

## 'గంగజిమ్మ'లో ఉత్తమ పురుష కథనం

'గంగజిమ్మ' కథలో చిన్నన్న వాళ్ళ దళ సభ్యులతో "నేను వెంటనే ఆయనతో వెళ్ళాలి. మన అంకమ్మ చెల్లెలు దాదాపు మూడు వారాలకుపైన జబ్బుతో మంచం పట్టిందంట. మనం వచ్చినట్లు తెల్సి అవ్వ పాపన్నను నన్ను తోలుక రమ్మని పంపింది. ఇవ్వాల పొద్దటి నుంచి అంకులు అసలు కండ్లు తెరువనే లేదట! నేను మన చెల్లెను చూసి రావటం చాలా అవసరం మీరే మంటారు కామ్రేడ్స్"[52] అని అడిగాడు. ఇక్కడ 'నేను' అని చెప్పడం వల్ల ఉత్తమ పురుష కథగా చెప్పవచ్చు. ఇలాంటి కథనం 'ఆకలి' మొదలైన కథల్లో కనిపిస్తుంది.

## ఫ్లాష్ బ్యాక్ పద్ధతి

గతంలో జరిగిన ఒక సంఘటనని కళ్ళకు కట్టినట్టు రచయిత మాటల్లో కాకుండా ప్రత్యక్షంగా ఆ సంఘటననే చూపించడం ఫ్లాష్ బ్యాక్ పద్ధతిగా చెప్పచ్చు.



అయితే ఈ పద్ధతిని అడవిలో వెన్నెల కథల్లో సమర్ధవంతంగా చిత్రించ లేకపోయారు. 'పెళ్ళి కావాలి' 'మరట్ తుడుం పాయానా' కథలు ఈ ధోరణిని కలిగి ఉన్నాయి. 'అయితే మళ్ళ ఈ భూముల్ల పిచ్చి తుమ్మల ప్లాంటేషను చేస్తారన్నమాట' తన బాల్యం గుర్తుకువచ్చింది. 'కొడుకు పెళ్ళి చెయ్యమన్నాడు. పొద్దున్నే, అప్పటి నుండి అతని కోపం పెరిగిపోతుంది. తన గతం గుర్తుకువచ్చింది. తన తండ్రి తనకు పెళ్ళి జెయ్యనందుకు ఇల్లువిడిచి ఇల్లుటం వచ్చాడు. తనకొడుకు అలా పోకూడుదు. పోనివ్వద్దు' అనడంతో పూర్వ జ్ఞాపకాలే కారణం. ఇలా గతంలో జరిగిన సంఘటనలను గుర్తుకు తెప్పించి కథను ముందుకు నడిపించడాన్నే ఫ్లాష్ బ్యాక్ పద్ధతి అంటారు.

## కథ ఎత్తుగడ – కథల ముగింపు

"కథను ఎక్కడి నుండైనా ప్రారంభించవచ్చు. ఎలాగైనా ప్రారంభించవచ్చు. ఎలాగైనా కొనసాగించవచ్చు. ఎలాగైనా ముగించవచ్చు. ఫలానా విధంగానే ప్రారంభించాలని, కథ కొనసాగించాలని, ముగింపు ఇవ్వాలని చెప్పేదంతా ఆయా సాహితీ వేత్తల అభిప్రాయాలే తప్ప అవి గీటురాయి కాదు. ఆధునిక కథ పుట్టక ముందు ఈ సూత్రాలు, గీటురాళ్లు ఏవీ లేవు. ఆధునిక కథ పుట్టి, పెరిగే క్రమంలో అది ఒక రూపాన్ని, స్వభావాన్ని సంతరించుకొంది. అంతమాత్రాన దాని రూపం, స్వభావం అలాగే ఉండిపోలేదు. ప్రపంచ వ్యాప్తంగా కథకులు అనేక ప్రయోగాలు చేశారు. నూతన శైలీ, శిల్పాలను అభివృద్ధి పరిచారు. కథా కథనాన్ని, కథ ప్రజెంటేషన్‌ను అనేక మలుపులు తిప్పారు. వస్తువు పాతదైనప్పటికీ దాని ప్రజెంటేషన్ కొత్తగా చెప్పడం ద్వారా కథల్ని చదివించే నేర్పు సాధించారు. ప్రపంచ వ్యాప్తంగా వచ్చే సినిమా ప్రేమ కథల్లో వైవిధ్యం చాలా తక్కువ. కానీ వాటి ప్రజెంటేషన్, సన్నివేశ చిత్రణ, సంఘటనల కల్పలనలో అనగా శైలీ, శిల్పాల్లో ఎంతో వైవిధ్యం ఉంటుంది. ఎత్తుగడ అంటే కథను ప్రారంభించే తీరు. ముగింపు అంటే కథను ముగించే తీరు. కథాంశం ఒకటే అయినప్పటికీ కథ ప్రారంభం, నడక, ముగింపు వందల రకాలుగా వుండవచ్చు. ప్రపంచ వ్యాప్తంగా రచయితలు ఒకే కథాంశాన్ని వందల రకాలుగా రాశారు. ఇలా కథా వస్తువు, ఎత్తుగడ, నడక, ముగింపు, శైలీ, శిల్పాలు, రచయిత కంఠస్వరం, కథా కథనం నిరంతరం వైవిధ్య పూరితంగా ఎదుగుతూనే వుంటుంది. ఆయా రచయితల స్థాయిననుసరించి సమాజంలో వచ్చే సామాజిక పరిణామాలను అనుసరించి ఇలాంటి మార్పులెన్నో

వస్తూనే వుంటాయి. ఇంటర్నెట్ వచ్చాక, బ్లాగులు పెరిగాక నెటిజెన్‌ల ద్వారా కథా స్వరూప స్వభావాలు మునుపెన్నడూ లేనంతగా మారిపోతున్నాయి."[53] అని అంటారు బి.ఎస్.రాములు.

కథ యొక్క ముగింపు కథా లక్ష్యం, ప్రయోజనం, సందేశం, సంవేదన, స్పందనలు ఒక కొలిక్కి వచ్చి స్థాయి భావ దశ నుండి రసోత్పత్తి స్థాయికి ఎదిగే క్రమాన్ని అందిస్తుంది. స్వల్ప వ్యవధిలోనే కథ పాఠకుని ఆకట్టుకుని పూర్తిగా చదివేటట్లు చేస్తుంది. అందుకు అనుగుణంగా కథంతా ఒకే విధంగా సాగుతుంది. రచయితలు కథను ఎలా ముగించాలనుకుంటే అలా ముగిస్తుంటారు. ముగింపు ఆయా రచయితల దృక్పథాన్ని, లక్ష్యాన్ని కూడా తెలుపుతుంది. దాంతో పాటు కథలోని కథాంశానికి, పాత్రలకు స్వరూప, స్వభావాలకు ఒక స్పష్టత ఏర్పడుతుంది. పాఠకులకు ఒక కర్తవ్యం లేదా సందేశం లేదా స్ఫూర్తి అందిస్తుంది.

## 'రక్తపింజెర' ముగింపు

'రక్తపింజెర' కథను సాహు ఇలా ముగించారు. ఈ ముగింపు నిజానికి ముగింపు కాదు. తర్వాతి కర్తవ్యానికి ప్రారంభం మాత్రమే. "పొరకలసార్లను మీరు దాత్తండ్లు. మీ అందర్ని తుపాకుల పేల్చి చంపుతాం. అని బెదిరించారు.... గుడిసెలు తొక్కి, కుండలు తొక్కి, బొబ్బలేసి, చిలచిల నెత్తుర్లు కారంగా అందరిని కొట్టి యమలోకాన్ని సృష్టించి చివరకు కొందరికి పగ్గాలు కట్టి పోలీసు స్టేషన్‌కు తీసుకొచ్చారు. అందులో శిత్రు వున్నాడు.... శిత్రుబిడ్డ వెంటబడ్డది. డోబి భార్య గుంజుకుపోయింది... ఇప్పుడు వాళ్ళ కళ్ళల్లో మల్కుబాయి చితిమంటలు కనిపిస్తున్నాయి. ఇప్పుడు వాళ్ళ కళ్ళల్లో జ్వరంతో పనికిపోతున్న బొజ్జు కమిలి పోయిన ఒళ్ళు, ఇప్పుడు వాళ్ళ కళ్ళల్లో వందల సంవత్సరాలు యమ బాధలు, గాయాలు, మచ్చలు, ఇప్పుడు వాళ్ళ కళ్ళల్లో పోలీసులు చేసిన దౌర్జన్యం రేపిన కోపం."[54] ఆ కోపం ఉద్యమాల్లోకి మలుపు తిరిగిన క్రమం ఇతర కథల్లో కనబడుతుంది.

## 'అడవిలో వెన్నెల' ముగింపు

'అడవిలో వెన్నెల' కథను బి.ఎస్.రాములు ఇలా ముగించారు. "ఏసు కూర్చున్న కాడి నుంచి వచ్చి లేచి అన్నల పక్కన వచ్చి చేరాడు. ఎగాదిగా చూశాడు. చేతిలోని తుపాకీ చూశాడు. ఆశ్చర్యంగా అలాగే చూస్తున్నారు. కమాండర్



పలకరింపుగా చిరునవ్వు నవ్వాడు.... ఆ నవ్వుతో ఏసు బెరికితనం కొంత తగ్గింది. ఇదేంటిది ఆసక్తిగా అడిగాడు.... 'తుపాకీ' అన్నాడు కమాండర్. చూడమన్నట్టుగా చూపాడు. లక్కింబాయి, మోతీ ఆసక్తిగా ఏసు పక్కన చేరారు. ఒక్కొరొక్కరు అందరు వాటిని స్పర్శించి, యిటూ, ఆటూ తిప్పి చూసి ఆనందపడిపోయారు.... ఎంతో రాత్రి దాకా ఏదో ఒకటి మాట్లాడుతునే వున్నారు... అడవిగాచిన వెన్నెల ఆకాశాన్ని కప్పేసిన వృక్షాల్ని చీల్చుకొచ్చి అడివంతా పరుచుకొంటోంది. ఆ వెన్నెల్లో గూడెంలోని గుడిసెలన్నీ తడుస్తున్నాయి. దారి దొరికినట్లనిపించిన ఏసు వింత వింత ఊహలతో ఆ రాత్రంతా నిద్రపోలేదు."[55] ఇలా కథా ప్రారంభంలో అమాయకుడైన ఏసు కథ నడక సాగి దౌర్జన్యాలు భరించిన తీరు నుండి అన్నలు రావడం, కలవడం, చర్చించడం, ఆ తర్వాత ఆత్మవిశ్వాసం పెంచుకోవడం, తమకు ఉజ్వలమైన భవిష్యత్తు వుందని, నూతన చైతన్యంతో, నూతన ఊహలతో కొత్త జీవితంలోకి సామాజిక సంఘర్షణలోకి, ఉద్యమంలోకి కలిసి నడిచే క్రమం తీసుకున్న తీరును చిత్రించారు. ఇలా ముగింపు అనేది నిజానికి ముగింపు కాదు. అది సామాజిక ఉద్యమాల విస్తరణ ప్రారంభాన్ని తెలియజేస్తుంది. ఇలా ప్రతి కథా తర్వాతి లక్ష్యాన్ని తెలియజేస్తుంది. కర్తవ్యాన్ని సూచిస్తుంది. బాధలను వ్యక్తీకరిస్తూ పాఠకులను స్పందింప చేస్తుంది.

## 'తుడుం' ముగింపు

'తుడుం' కథను అల్లం రాజయ్య ఆదివాసీలు ఉద్యమిస్తూ పోలీసులను ఎదిరించడానికి అందరూ వెంటనే జమ కావడానికి తుడుం కొట్టి ఎలా పిల్చుకోవాలో హనుమంతరావు పాత్ర ద్వారా చెప్తూ ఇంద్రవెల్లి, ఎర్రజెండా, పొరకలసార్లను గుర్తు చేసుకుంటూ "మరట్ బాండ్ పియ్యానా (మనమే తుపాకి పట్టాలే), మావారాజ్జెం వాయానా (మనరాజ్జెం రావాలె), మనకు సుఖం మందానా (మనకు సుఖం దక్కాలే) అని అరుస్తూ, నినదిస్తూ జనం ఎవరి గూడాల్లోకి వారు వెళ్ళిపోతున్నారు.... చిన్ని ఒంటరి తనాన్ని పారదోలడానికి కాసేపు రేలా... రేలా... పాడుతోంది."[56]

## 'రగల్‌రాజ్జెం మైసివాకట్' ముగింపు

'రగల్‌రాజ్జెం మైసివాకట్' కథను సాహు ఇలా ముగించాడు. పోలీసులు దాదాపు 150 మంది అరెస్టు చేశారు. అందులో వాళ్ల నాయకుడు భగవతిరావు

కూడా వున్నాడు. మూడు గ్రామాలను ధ్వంసం చేసి ఆదిలాబాదు కేసి పటాలం కదిలింది. పోలీసులంతా దెబ్బలు తిన్నారు. ఈ గండం గడిచినందుకు వారికి చిత్రంగానే వున్నది. దాదాపు 20 మంది పోలీసులు వ్యాన్లలో దెబ్బలతో మూలుగుతున్నారు... పోలీసుల ముఖాల్లో విజయగర్వం లేదు. నెత్తురు చుక్కలేదు. కానీ నెత్తురు ముద్దలైన ఆదివాసీలు పిడికెల్లెత్తి అడివంతా ప్రతిధ్వనించే విధంగా పిట్టలు, జంతువులు అల్లకల్లోలం అయ్యే విధంగా గూడాలన్నీ ఆ గొంతులు వినిపించే విధంగా నినదిస్తూనే వున్నారు.

కల్లే సర్కార్ తోడేంగే (ఝూటా సర్కారును దించుతాం)

రగల్ రాజ్జెం మైసివాకట్ (ఎర్ర రాజ్జెం గెలిచి వస్తాం)

ఉడువానికే భూమి పాజింలే" (దున్నే వాడికే భూమి)

రైతు - బూతి సంగెం జిందాబాద్ (రైతు కూలీ సంఘం జిందాబాద్)" అంటూ ఉద్యమ చైతన్యాన్ని చిత్రించారు. ఈ ముగింపు ఉద్యమ కొనసాగింపు. అందువల్ల దీన్ని సాదా కథల ముగింపుల వలె చూడ్డానికి వీల్లేదు. ఇలాంటి ముగింపులు సామాజిక ప్రయోజనం సాధించే ప్రత్యేక లక్ష్యం కలిగి వుంటాయి. అందువల్ల సాహిత్య సిద్ధాంతాలు, ఉద్యమ సాహిత్యాన్ని అంచనా వేయడంలో విఫలం అవుతుంటాయి. అవి వారి శక్తికి మించిన, పరిధికి మించిన పని.

## 'గెరిల్లా' ముగింపు

'గెరిల్లా' కథను పి.చంద్ ఇలా ముగించారు. "అంతవరకు గిన్నెను చేతితో పట్టుకున్న కామ్రేడ్ ఎండిన ఆకులను చుట్టగా మల్చి నెత్తిమీద పెట్టుకున్నాడు... కమాండరు చుట్టూ కలియ జూసిండు. చాలా దూరము వచ్చామని గ్రహించిండు.... ఇప్పటికే శత్రువు తిరుగు ప్రయాణం సాగించుతుంటాడని నిర్ధారించుకొన్నాడు... సెంట్రీ డ్యూటీ మీదకెక్కిన కామ్రేడ్ సెలయేటి గట్టుమీద తుప్పల మధ్య తనకు అనువైన స్థలం నుండి చీకట్లను చీల్చుకుంటు చూస్తుండి పోయిండు.... చల్లటి ఇసుకలో కూలబడిపోయిన మిగతా కామ్రేడ్స్‌లో ఆకలి, దప్పిక, నీరసం ఒకదానికి ఒకటి పోటీ పడుతున్నాయి. ఆ చల్లటి ఇసుకలో దొర్లి పోయిన గింజలను చేతులతో తడిమి ఒక్కొక్క గింజనే గిన్నెలో వేస్తున్నాడు."[57] ఇలా గెరిల్లా దళాల జీవితం, వారు ఎదుర్కొనే నిర్బంధాలు, ఆకలి, నిద్ర, రక్షణ జాగ్రత్తలు ఎలా వుంటాయో చిత్రిస్తూ కథను ముగించారు. ఇలా అడవిలో వెన్నెల, గంగజిమ్మ, కాయిదా



లాంటి కథల్లోని ముగింపులు చూస్తే కథలకి ఇలాంటి ముగింపులు కూడా ఇవ్వవచ్చన్న ఆశ్చర్యం కలుగుతుంది. ఇవి సాధారణ కోవకు చెందిన కథలు కావు. అలాగే వీటి ముగింపులు కూడా సాధారణ కథల వంటివి కావు. విప్లవోద్యమ కర్తవ్యాల్లో భాగంగా మారిన సాహిత్యం ఇచ్చే సందేశం, స్ఫూర్తిల్లో భాగంగా ఇందులోని కథల ముగింపులు వున్నాయి. ఇవి ప్రత్యేకమైన సామాజిక చరిత్రను, ఉద్యమాలను, వాటి పరిణామాలను అధ్యయనం చేసే సామాజిక శాస్త్రాల్లో భాగంగా సాహిత్య విశ్లేషణ చేసినప్పుడే వీటి ప్రాధాన్యత, విశిష్టత అర్థమవుతుంది.

## కథల పేర్లు - విశిష్టత

కథకు చక్కదనాన్ని చేకూర్చేది, కళనిచ్చేది కథ పేరు. కథకు పెట్టే పేరునే శీర్షిక అంటారు. "సుందరమైన విగ్రహానికి నొసటి తిలకంలాగే చక్కటి కథకు మరింత చక్కదనం చేకూర్చేది పేర"[58] ని అంటారు పోరంకి దక్షిణామూర్తి. పేరుతోనే కథ కొంత అర్థం అవుతుంది. పేరు పెట్టడంలో రచయితల విజ్ఞత బయట పడే అవకాశం ఉంది. కథ పేరు పాఠకుణ్ణి ఆకట్టుకొని, కథను చదివించే విధంగా, ఆలోచింప చేసే విధంగా, ఆసక్తిని కలిగించే విధంగా వుండాలి. సాధారణంగా కథకుడు కథ ద్వారా చెప్పదల్చుకున్న కథ సారాంశాన్ని అందించే విధంగా వుండాలి. 'అడవిలోని వెన్నెల'లోని కొన్ని కథలను పేర్లను బట్టి అర్థం చేసుకోవచ్చు. ఉదా.కు 'కన్నీటికథ - నీటికథ' 'తుడుం' 'భూమికొరకు' 'ఆకలి' 'గెరిల్లా' అడవిలో వెన్నెల' లాంటి పేరును బట్టి కథా ఇతివృత్తాన్ని, వాతావరణాన్ని, రచయితల ఉద్దేశ్యాన్ని కొంత మేరకైనా తెలుసుకునే అవకాశం ఉంది.

'భూమికొరకు' 'అడవిలో వెన్నెల' అనేపేర్లు కథలోని ప్రధాన పాత్రలకు అను గుణంగానే పెట్టబడ్డాయి. అడవుల్లో వుండే గిరిజనులు భూమి మీద బతికే అవకాశం కోల్పోతున్నారనే లక్ష్యంతో రచయితలు ఈ శీర్షికలను పెట్టారు. కన్నీటి కథ - నీటికథ' 'ఆకలి' అనే కథల శీర్షికలు చదవగానే మనకు గిరిజనుల కష్టాలు కళ్ళ ముందు కదులుతాయి. 'కాయిదా' పెళ్ళికావాలి అనే పేర్లు వినగానే సాంప్రదాయాల్లోని సహజత్వాలు వ్యక్తి మవుతున్నాయి. 'గెరిల్లా' గంగజిమ్మ' మరట్ తుడం పాయానా' 'తుడుం' 'రగల్‌జెండా రాజ్యం' లాంటి శీర్షికల కథలు అన్నల, పోలీసుల వ్యవస్థలను గుర్తుకుతెస్తాయి. కథల్లోని వస్తువులకు అతుక్కుపోయే విధంగా పేర్లు పెట్టడం ఈ కథల గొప్పతనంగా కనబడుతోంది.

## ఉద్యమ సాహిత్య విశిష్టత

ఉద్యమ సాహిత్యాన్ని ఇతర సాహిత్యాలతో పోల్చడానికి వీలుకాదు. వీటి సాహిత్య ప్రమాణాలు, సాహిత్య విలువలు, శైలీ, శిల్పాలు ప్రత్యేకమైనవి. ఇవి సామాజిక శాస్త్రాల, సామాజిక ఉద్యమాల చరిత్రను, పరిణామాలను, సామాజిక కర్తవ్యాలను నిక్షిప్తం చేసుకున్న మహోన్నత కథలు.

బి.ఎస్.రాములుగారు అన్నట్టు "ఉద్యమాలు సాహిత్యాన్ని, జీవితాన్ని రకరకాలుగా వ్యాఖ్యానించాయి.... ఉద్యమాలు జీవితాన్ని, అన్ని సాహిత్య కళా ప్రక్రియల్లో చెప్పాలి. తమ దర్శనాన్ని, జీవిత కథను, మానవ సంబంధాలను చిత్రించడంలో భాగంగా వ్యక్తమయ్యేట్లు చేయడం ఆయా ఉద్యమ సాహిత్యకారుల కర్తవ్యం.... ఉద్యమం సాహిత్యంలో తన పోరాట చరిత్ర వ్యక్తీకరణను కోరుతుంది. ఉద్యమంతో పరిణామం చెందిన మానవ సంబంధాలు, సంస్కృతిని చిత్రీకరించడానికి సాహిత్య ప్రక్రియలు పరిమితమవడం వాటి పరిమితి. ప్రజలు తమ హృదయావిష్కరణను, తమ సాహిత్య అవసరాలను కోరుకుంటారు. ఈ మూడింటి మధ్యగల వైరుధ్యాన్ని పరిష్కరించి అంతిమంగా వున్నంతలో పాఠకుడి ఆసక్తి, పఠనీయతకనువుగా మానవ హృదయాన్ని ఉదాత్తీకరించేది ఉత్తమ ఉద్యమ సాహిత్యం.... సాధారణంగా ఉత్తమ సాహిత్యం ప్రజల సాహిత్యావసరాలను తీర్చడంతో పాటు, ఇంద్రియ సంవేదనలను, స్పందనలను, సంస్కృతి, సంస్కారాలను, ప్రాపంచిక దృక్పథాన్ని ఉదాత్తీకరిస్తుంది. తన కాలపు సమాజ సమగ్రతను, సంస్కృతిని, మానవ సంబంధాలను ఉన్న తీరు నుండి ఉండాల్సిన తీరుకనువుగా ఉన్నతీకరిస్తూ జీవితం పట్ల ఆశా విశ్వాలను పెంపొందిస్తూ జీవితానికి సాహిత్య గౌరవం కలిగింప జేస్తుంది."[59] అని అంటారు బి.ఎస్.రాములు.

'అడవిలో వెన్నెల' కథలు ఉద్యమం పట్ల మహోన్నత స్ఫూర్తిని కలిగించాయి. ఉద్యమకారులకు, ఆదివాసులకు స్ఫూర్తినిచ్చాయి. దాంతో పాటు తెలుగు మైదాన ప్రాంత పాఠకులకు, ప్రజలకు తెలియని ఆదివాసీ జీవితాలను, సంస్కృతిని, పోరాటాలను, ఉద్యమకారులను అర్థం చేయించి వారికి సన్నిహితం చేసింది. ఈ కథలు తమ పొరుగునే జీవిస్తున్న ప్రజల పట్ల సహృదయతతో స్పందించే అవకాశాన్ని కలిగించాయి. ఉత్తమ సాహిత్యం లక్ష్యం, లక్షణం ఇదే.



నాల్గవ అధ్యాయం

# అడవిలో వెన్నెల కథలు భాషా విశేషాలు

"బానిసలు తమ భాషకన్నా ఇతరుల లేదా తమ యజమానుల భాషే గొప్ప భాష అనుకుంటారు. ఇతరుల జీవితాలే కథలకు అర్హమైనవి అనుకుంటారు. కథకులు ఈ భావజాల బానిసత్వం నుండి విముక్తం కావాలి. స్వేచ్ఛ, సమానత్వంతో దిగంతాలకు ఊహాశక్తి విస్తరించాలి. పుట్టుకతో ఏదీ రాదు. అభ్యాసంతోనే అన్ని అబ్బుతాయి. రచయితకు ఆత్మవిశ్వాసం వుండాలి. తన ప్రాంతపుభాషపట్ల జీవితాలపట్ల మమకారం వుండాలి. తనచుట్టూగల ప్రజల్ని ప్రేమించాలి. అభివృద్ధిని అందుకున్న పాలకవర్గాల గురించి దోపిడీ కులాల గురించి వారి కష్టాల గురించి రాయడం రాజుగారి కుక్క చస్తే ఏడ్వడం లాంటిది. ఆ పని చాలా సినిమాలు, నవలలు, కథలు చేస్తూనే ఉన్నాయి. తోటి మనిషిపట్ల స్పందించడం అంటే ఇదికాదు. అభివృద్ధి అందుకోలేకపోయిన ప్రజల గురించి పీడిత కులాల ప్రజల, గురించి మంచి మనిషి గురించి ప్రతి మనిషి హృదయం స్పందించేటట్టు రాయాలి."[1] అని అంటారు బి.ఎస్.రాములు

'అడవిలో వెన్నెల' కథల సంపుటిలో కథల ఇతివృత్తాలు, భాషా సంబంధ విషయాలు గమనించినట్లయితే ఇవన్నీ ఇంచుమించు తెలంగాణ ప్రాంత, ముఖ్యంగా ఆదిలాబాద్, చంద్రపూర్, గడ్‌చిరోలి, చిరొంచ ప్రాంతాల ఆదివాసీల జీవితానికి, సంస్కృతికి, వారి సమస్యలకు, పోరాటాలకు అద్దం పట్టాయి. నైజాం రాజ్యంలో ఉర్దూ, తెలుగు, హిందీ, మరాఠీ, కన్నడ, గోండు, కోయ, బంజారా, తదితర భాషా ప్రజలు సహజీవనం చేశారు. ఉర్దూ అధికార భాషగా ఉండేది. ఇలా నైజాం రాజ్యంలోని ప్రజల భాషలో అనేక భాషా పదాల మిశ్రమం కనబడుతుంది. ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు, పర్షియన్ భాషా పదాలు, నుడికారం, సామెతలు కూడా తెలంగాణ భాషలో కలిసిపోయాయి. తెలంగాణ భాషను భాషే

కాదని కొందరు వ్యాఖ్యానించారు. తెలుగు భాష పేరిట రాష్ట్రం ఏర్పడాలని కోరి తెలంగాణా వారి తెలుగు తెలుగే కాదని, తౌరక్యాంధ్రమని వెక్కిరించారు. తెలంగాణా భాష, అభివ్యక్తి ఆంధ్రప్రదేశ్ ఏర్పడక ముందు పి.యశోదారెడ్డి, గూడూరి సీతారాం, భాస్కరభట్ల కృష్ణారావు, వంటి కథకులు తమ కథల్లో రాశారు. అవి పత్రికల్లో అచ్చయ్యాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడ్డాక మధ్య కోస్తాంధ్ర భాష పత్రిక భాషగా, వ్యవహారిక భాషగా అందరిమీదా, పాఠ్యపుస్తకాల్లో రుద్దారు. దాంతో తెలంగాణా భాషలో రాసే రచయితలు, తెలంగాణ భాష మాట్లాడే ప్రజలు అవమానాలకు గురయ్యారు. దీనిపై ఉద్యమ కథ పెద్ద ఎత్తున సైద్ధాంతిక పోరాటం చేసింది. సృజన, అరుణతార సాహిత్య పత్రికల్లో తెలంగాణా భాష ఆవశ్యకతను, దాన్ని అర్థం చేసుకోవడానికి సహృదయతతో ముందుకు రావాల్సిన అవసరాన్ని చర్చించింది. అలా 1977 నుండి తెలంగాణ భాష అభివ్యక్తి, తిరిగి సాహిత్య గౌరవం పొందే కృషి ఉద్యమ సాహిత్యంలో భాగంగా కొనసాగింది. ఉద్యమ సాహిత్యం ఇచ్చిన ధైర్యంతో తెలంగాణా నుండి తిరిగి తమ భాషలో కథలు, నవలలు, కవితలు, పాటలు రాసే రచయితలు పెరిగారు. అలా తెలుగు సాహిత్యంలో తెలంగాణా జీవితంతో పాటు సంస్కృతి, భాష, నుడికారం, వాక్య నిర్మాణం, ఉద్యమ సాహిత్యం ద్వారా సమున్నతంగా విస్తరిస్తూ వచ్చింది. అలా 'అడవిలో వెన్నెల' కథల్లో తెలంగాణా భాషతో పాటు గోండు, కోయ భాషా పదాలు, నుడికారాలు, నినాదాలు, భావాలు అత్యంత సహజంగా వ్యక్తీకరించబడ్డాయి. వాటి వైవిధ్యాన్ని, అర్థాలను పరిశీలిస్తాను.

### ఉర్దూ పదాలను అజంతాలుగా పలకడం

తెలుగు భాషలో ఏ భాషా పదాన్ని తీసుకున్నా అచ్చును జత చేసి పలుకుతుంటారు. ఖబర్ అనే ఉర్దూ పదాన్ని కబురు, కితాబ్ అనే పదాన్ని కితాబు, దస్తకత్ అనే పదాన్ని దస్తకతు, జాయిజాద్ అనే పదాన్ని జాయిజాదు అని, అలాగే రోడ్ అనే ఇంగ్లీషు పదాన్ని రోడ్డు అని, బస్ అనే పదాన్ని బస్సు అని తెలుగు భాషలో స్థిరపర్చుకున్నారు. తెలంగాణా ప్రాంతంలో ఉర్దూ పదాలు కలిసిపోయిన వాక్యాలు పలకడం చాలా సహజం. ఉర్దూ పదాలకు తెలుగు ప్రత్యయాలు చేర్చి తెలుగులో వ్యవహరిస్తారు. ఉర్దూ భాషలోని హలంతాలను తెలుగులో వ్యవహరించేటప్పుడు వాటికి తెలుగు విభక్తి ప్రత్యయాలు చేర్చి అజంతాలుగా మార్చి వ్యవహరిస్తుంటారు.



ఉదాహరణకు...

| | | | |
|---|---|---|---|
| 1. | అదాలత్ | - | అదాలతు (పు.111) |
| 2. | కబ్జ | - | కబ్జా (పు. 105) |
| 3. | జంగల్ | - | జంగలు (పు. 102) |
| 4. | సర్కార్ | - | సర్కారు |
| 5. | మాదర్‌సోద్ | - | మాదర్‌సోతు |

### ఆంగ్ల పదాలను అజంతాలుగా పలకడం

ఆంగ్ల పదాలకు తెలుగు ప్రత్యయాలు చేర్చి తెలుగులో వాడడం చూస్తూంటాం. ఆంగ్లభాషలోని హలంతాలను తెలుగులో వాడేటప్పుడు వాటికి తెలుగు విభక్తి ప్రత్యయాలు చేర్చి అజంతాలుగా మార్చి వాడుతుంటారు. 'అడవిలో వెన్నెల' కథల్లో ఇలాంటి ప్రయోగాలు వున్నాయి. ఉదాహరణకు :

| | | | |
|---|---|---|---|
| 1. | కలెక్టర్ | - | కలెక్టరు |
| 2. | పోలీస్ | - | పోలీసు |
| 3. | సర్కిల్ | - | సర్కిలు |
| 4. | కాంట్రాక్టర్ | - | కాంట్రాక్టరు |
| 5. | రోడ్ | - | రోడ్డు |

### అపదాది అచ్చుల్లో మార్పులు

1. అపదాది దీర్ఘాచ్చులు చాలావరకు హ్రస్వాచ్చులుగా మారుతాయి.

ఉదాహరణకు :

| | | | |
|---|---|---|---|
| 1. | చేస్తాడు | - | చేస్తడు (పు. 83) |
| 2. | వస్తారు | - | వస్తరు (పు. 94) |
| 3. | అంటాడు | - | అంటడు (పు . 35) |
| 4. | ఉంటాడు | - | ఉంటుండు (పు. 90) |
| 5. | అన్నాడు | - | అన్నడు |

2. అడవిలో వెన్నెల కథల్లోని మాండలికంలో ఉత్తమ పురుష ప్రత్యయం అయిన 'ను' క్రియా పదాల్లో లోపిస్తుంది.

1. వస్తాను - వస్తా
2. ఇచ్చాను - ఇచ్చా
3. తెచ్చాను - తెచ్చా
4. పోతాను - పోతా

క్రియలలో ఉత్తమ పురుష ప్రత్యయం 'ను' లోపించడంతో పాటు పూర్వ హల్లుల మీద దీర్ఘం కూడా లోపిస్తుంది. దీనివల్ల ఇస్త, వస్త, చేస్త వంటి రూపాలు ఏర్పడ్డాయనవచ్చు. అవి :

1. వస్తాను - వస్త
2. చేస్తాను - చేస్త
3. పోతాను - పోత

3. 'న' కు పరంగా దంత్యాలు (త,ద) గాని, దంతమూలీయాలు (ర,ల,న) గాని, తాలవ్యాలు (చ,జ) గాని, మూర్ధన్యాలు (ట,డ) వస్తే దాని హ్రస్వాచ్చులోపించడం 'అడవిలో వెన్నెల' కథల్లో చూడవచ్చు. ఉదాహరణకు :

1. వచ్చినాడు (124)
   - వచ్చినడు (దీర్ఘలోపం)
   - వచ్చిన్డు (హ్రస్వాచ్చు 'అ' లోపించింది)
   - వచ్చిండు

2. చెప్పినాడు (124)
   చెప్పినాడు - చెప్పినడు (దీర్ఘలోపం)
   చెప్పిన్డు - (హ్రస్వాచ్చు 'అ' లోపించింది)
   చెప్పిండు

4. 'చ' కారం స,జ లుగా మారుతుంది. 'అడవిలో వెన్నెల' కథల్లో మారిన తీరును చూడవచ్చు.

ఉదాహరణకు :

1. చమరు - సమరు
2. చీకటి - సీకటి



3. చాప - సాప
4. చలి - సలి
5. చూస్తూండే - సూత్తూండే
6. చౌకిదారు - సౌకిదారు
7. చేరుకొని - జేరుకొని
8. చదువు - సదువు
9. చేస్తే - జేత్తె
10. చేస్తానం - జేత్తానం
11. నీచువాసన - నీసువాసన
12. చిరుత - సిరుత
13. చచ్చింది - సచ్చింది.

5. ప్రత్యయాల మీద దీర్ఘాలు కూడా లోపిస్తాయి.

ఉదాహరణకు :

1. గాని - గని (పు. 72)
2. కాని - కని (పు. 83)
3. వస్తా - వస్త (పు. 73)
4. చేస్తా - చేస్త (పు. 73)

6. క్రియేతర పదాలలో కూడా దీర్ఘాచ్చు హ్రస్వంగా కనిపిస్తుంది.

ఉదాహరణకు :

1. దసరాకు - దసరకు

7. రెండు పదాల మధ్య ఉత్వం లోపిస్తుంది.

1. ఉంటుండు (పు. 90)
   ఉంటూ + ఉండు - ఉంటూండు
   - ఉంట్ (ఊ) + ఉండు
   - ఉంట + ఉండ

- ఉంటోండు

- ఉంటండు

పై ఉదాహరణలో పూర్వ పద అంత్య ఉత్వం, పర పదాది ఉత్వం రెండూ లోపించడం గమనించవచ్చు.

8. పదాంత 'ప' వర్ణం 'బ' గా మారుతుంది.

అవి :

1. పోండ్లి - బోండ్లి
2. పోవాలె - బోవాలె
3. మట్టిపెళ్ళ - మట్టిబెళ్ళ
4. కాలపెడ్తదేమోనని - కాలబెడ్తదేమోనని

9. సంయుక్త వర్ణం 'ష్ట' ద్విరుక్త 'ట' కారం గా మాండలికంలో ఉచ్చరిస్తారు.

ఉదాహరణకు :

1. కష్టం - కట్టం - కట్టెం

10. మహాప్రాణాలు అల్పప్రాణాలుగా చేసి పలకటం కనిపిస్తుంది.

1. ధర్మరాజు - దరుమరాజు

11. కొన్ని సందర్భాలలో అల్పప్రాణాలను సైతం మహాప్రాణాలుగా ఉచ్చరించడం చూస్తాం.

1. సూపర్ వైజర్ - సూప్పర్ వైజర్
2. నగరా - నగారా

12. ద్విరుక్త హల్లు అద్విరుక్తాలవుతాయి

అవి :

1. గూడెం తిరిగి - గూడెందిర్గి (పు. 94)
2. పట్కు పోయాడు - పట్టకపోయాడు (పు. 130)
3. పట్కురమ్మన్నాడు - పట్టక రమ్మన్నాడు.



13. అట్ల, ఇట్ల, ఎట్ల మొదలైన పదాలలోని అ, ఇ, ఎ లకు బదులు గ, గి, గె లు కన్పిస్తాయి.

ఉదాహరణకు :

1. అట్ల - గట్ల (పు. 54)
2. ఈసర్కారు - గీసర్కారు (పు. 40)
3. ఇట్ల - గిట్ల (పు. 54)
4. ఎట్ల - గెట్ల
5. ఈ గోడ్లు - గీగోడ్లు (పు. 55)

14. 'న' వర్ణం 'ల' కారం గా మారటం కనిపిస్తుంది.

1. నోటిసిత్తండ్లు - లోటీసిత్తండ్లు (పు. 90)

15. 'ర' కారాన్ని 'ల' కారంగా 'గ' కారంగా పలకడం 'అడవిలో వెన్నెల' కథల్లో కనిపిస్తాయి.

ఉదాహరణకు :

1. ఎవరింటరు - ఎవలింటరు (పు. 94)
2. ఎవరకు తోచింది - ఎవలకు తోచింది (పు. 93)
3. తిరుగరాదులే - తిరుగగాదులే
4. ఎవరు - ఎవలు (పు. 90)
5. సికిరేటు - సికిలేటు (పు. 34)

16. 'క్ష' 'చ్చ' గామారిన రూపం

1. లక్ష్మిబాయి - లచ్చుబాయి

17. వర్ణవ్యత్యయం

1. తగిలాయి - తలిగాయి

18. వర్ణలోపం

1. దునకటానికి - దూకటానికి (పు. 142)
2. పోరాడేవీళ్ళు - పోరేవీళ్ళు (పు. 21)

19. 'కచటతప' లు 'గజడదబ'లుగా మారిన రూపాలు

1. కొడతరో - గొడతరో
2. చేరుకొంగనే - జేరుకొంగనె (పు. 53)
3. ఎండుటాకులు - ఎండుడాకులు (పు. 59)
4. వెతికారు - వెదికారు (పు. 71)
5. నోట్లో పెట్టింది - నోట్లో బెట్టింది.

ఇలాంటి మరికొన్ని...

1. నిగ్గదన్నటం - నిగ్గతన్నటం
2. వాగుకుబోయి - వాగుకుపోయి
3. పొద్దుగూకడానికి - పొద్దుకూకడానికి
4. గడక - గటుక
5. ఏంజేస్తావు - ఏంచేస్తావు
6. పులిగొడ్డె - పులికొడ్డె

20. 'అడవిలో వెన్నెల' కథల్లో సంస్కృతపదాన్ని కింది విధంగా పలుకుతారు.

1. జ్ఞాపకం - గ్యాపకం

## జాతీయాలు

భావాలు పరస్పరం తెలుపుకోవడానికి హావభావాలు, శబ్దాలు, పదాలు, వాక్యాలు, భాష ఉపయోగపడుతుంటాయి. భావ వినిమయ సాధనం భాష. భాషకు పుష్టి నిచ్చేవి, ఒక సొబగు ఇచ్చేవి జాతీయాలు. జాతీయానికి చమత్కారం, నుడికారం, నుడిగట్టు, పలుకుబడి, భాషీయం అనే పర్యాయపదాలున్నాయి. ఆంగ్లంలో 'ఇడియం' హిందీలో 'ముహావర్' అనే సమానార్థకాలు నేటికీ వాడబడుతున్నాయి. 'ఆంధ్ర శబ్ద రత్నాకరము' లో జాతీయాలు అంటే "ఒంటరిగానున్న యొక పదమున కనపడని సొగసు, అది పదాంతంలో చేరి జత కట్టినప్పుడు ఇట్టే తళుక్కుమని తోచును. దానివలన ఆ సందర్భమునకే ఒక వింత సొబగు చేకూరును. ఇవియే పదబంధములు"[2] ని అంటారని పరిశోధకులు నిర్వచించారు. "పదాలకున్న సహజార్థాన్ని మరుగు పరిచి విలక్షణమైన అర్థంలో



ప్రయోగింపబడే పదాలు లేదా పదబంధాలనే జాతీయాలు"[3] అని భాషా శాస్త్రవేత్తలు వివరించారు.

'అడవిలో వెన్నెల' కథల్లో సహజమైన సంభాషణలకు పాత్రల మనస్తత్వ చిత్రీకరణకు అనుగుణంగా జాతీయాలను ప్రయోగించారు. అవి

1. అడవిగాచిన వెన్నెల : (పు. 84)

"ఎంతో రాత్రిదాకా ఏదో వొకటి మాట్లాడుతూనే ఉన్నారు. అడవిగాచిన వెన్నెల ఆకాశాన్ని కప్పేసిన వృక్షాల్ని చీల్చుకొని అడివంతా పరచుకొంటోంది. ఆ వెన్నెల్లో గూడెంలోని గుడిసెలన్నీ తడుస్తున్నాయి. దారి దొరికినట్లనిపించి ఏసు వింతవింత వూహలతో ఆరాత్రంతా నిద్రపోలేదు."" ఇక్కడ అడవిగాచిన వెన్నెల అనే పదం వారి జీవితాల్లో వెన్నెల కాయాలని, 'అన్నలు' వెన్నెల వెలుగుగా వచ్చారనే అర్థాన్ని తెలియజేస్తుంది. మరిన్ని...

2. కోకొల్లాలు (పు. 64)
3. కాలుగాలినపిల్లిలా .
4. గొడుగు పట్టు (పు. 79)
5. తీవ్రవాదుల స్వైరవిహారం (పు. 115)

## సామెతలు

జాతీయాలతో పాటు భాషకు అలంకార ప్రాయాలైనవి సామెతలు. 'సామెత అను పదమునకు సమానమైన పదము కన్నడంలో 'సామతి'. ఈ సామతి సామ్యత నుండి ఉద్భవించినట్లు, తెలుగులో 'సామ్యము' నుండి 'సామెత' ఆవిర్భవించి ఉండవచ్చునని' జి.యస్. మోహన్ గారు తెలిపారు. ఇవి జానపద విజ్ఞానంలో ఒక భాగం. భాషకు ఇంపును, సొంపును చేకూర్చేవి సామెతలు. ఇవి ఏ భాషలో నైనా జాతి రత్నాలవంటివి. ఎవరు కూడా వీటికి వెలకట్టి నిర్ణయించలేరు.

వ్యక్తి నిత్య జీవితంలోంచి, అనుభవంలోంచి సందర్భానుగుణంగా చెప్పబడి, తర్వాత కాలంలో బహుళ ప్రాచుర్యాన్ని పొందేవి సామెతలు. అల్పాక్షరాలలో అనల్పార్థాన్ని తెలియజేస్తూ లోక వ్యవహారంలో విరివిగా ప్రచారాన్ని పొంది, అనేక విషయాలను తెలియజేస్తూ పాఠకులను ప్రభావితం చేయడమే గాక లయను

కలిగి ఉండటం ద్వారా చెవులకు ఇంపును కూడా కలుగజేస్తాయి.

రచయితలు రచనలు చేసేటప్పుడు లోక వ్యవహారంలో ఉన్న సామెతలను సందర్భానుసారంగా వాడుకొని, పాత్రల సన్నివేశానికి సహజత్వాన్ని, సంభాషణా చాతుర్యాన్ని, చమత్కారాన్ని కలిగిస్తాయి. అడవిలో వెన్నెల కథల్లో కొన్ని అన్యభాష సామెతలు కన్పిస్తాయి. ఎందుకంటే రచయితలు గోండి భాషలో వుండే సామెతలను యధాతథంగా తీసుకోవడం జరిగింది. మొత్తం మీద కథల్లోని సామెతలు వస్తువుకు తగిన విధంగా సహజత్వాన్ని కలిగించాయి.

అవి :

1. సంసారం సాగదు, సావురాదు (పు. 29)
2. సముద్రం తలాపుకు బెట్టుకొని చాపనీళ్ళ కెడ్సినట్టు (పు. 29)
3. మృగశిరకార్తె మబ్బుల తీరున్నారు. 101
4. పాడిందే పాడరాపాసుపండ్ల దాసరి - 55
5. ముడ్డికింద మంటబెట్టిసుతివట్టుమన్నటున్నది - 101
6. ఆనచ్చేది పానం పోయేది తెలువనట్టే - 44
7. ఎతామినుకు మాకు బత్తటావయి - 44
8. ఎత్తుకుపోయినోడు మంచిగనే ఉంటండు తడకతీసినోడే దొంగయిపోతుండు.

పై విధంగా లోక వ్యవహారంలో వున్న సామెతలను పాత్రలచేత చెప్పించడం ఈ కథల్లో కన్పిస్తుంది. ఇవన్నీ గిరిజనుల నిత్యజీవితంలో అలవోకగా పలికే సామెతలే.

## గోండు పదాలకు తెలుగు వ్యవహార ప్రయోగాలు

| | | |
|---|---|---|
| 1. కిసింగార్ వెంతా | - | అడివంటుంకుంది. |
| 2. బాండే | - | తుపాకీ |
| 3. పటార్ | - | కొండ |
| 4. నెగడు | - | మంట |



| | | |
|---|---|---|
| 5. కాయిదా | - | సంప్రదాయం |
| 6. గీవ్వేర్ | - | బంక |
| 7. జింకార్ | - | షావుకారి |
| 8. కుడేరు | - | వాగు |
| 9. పెరుస పేను | - | పెద్ద దేవుడు |
| 10. బుడ్‌బావే | - | జూన్ |
| 11. పూసు | - | జనవరి |
| 12. జాడిలి | - | కావలి |
| 13. దాదా | - | అన్న |
| 14. అకడి | - | జూలై |
| 15. నెయిక్కు | - | కుక్క |
| 16. కోయతరార్ | - | ఆదివాసులు |
| 17. మహా | - | ఫిబ్రవరి |
| 18. దుర్వాడి | - | మార్చి |
| 19. బాయిలు | - | స్త్రీలు |
| 20. తుడుం | - | నగరా |
| 21. ఊడు వానికీ | - | దున్నే వానికీ |
| 22. భూమి ఫాజిలే | - | భూమి కావాలి |

ప్రధానంగా 'అడవిలో వెన్నెల' కథల్లో గల భాషను పరిశీలించినట్లయితే గిరిజనులు మాట్లాడుకునే సహజమైన భాషను ఆయా సంభాషణల్లో పలికించడానికి రచయితలు ప్రయత్నించినట్లు తెలుస్తూ ఉంది. ఆంధ్ర ప్రదేశ్‌లోని మూడు మాండలికాల్లోను కొంత వైవిధ్యముంది. అయినప్పటికే సారూప్య లక్షణాలే ఎక్కువగా ఉన్నాయి. 'అడవిలో వెన్నెల' కథల్లో కూడా అన్ని ప్రాంతాల వారికి అర్థమయ్యే భాషను రచయితలు ప్రయోగించారు.

సహజత్వం కోసం తెలంగాణా ప్రాంతంలోని ఉర్దూ, పారశీక భాష పదాలు కలిసిన మిశ్రమభాష కథల్లో చాలాచోట్ల కన్పిస్తున్నాయి. అంతే కాకుండా గిరిజనుల వ్యవహారంలో వుండే "గోండి" భాషను కూడా సందర్భానుసారంగా రచయితలు

చిత్రీకరించే ప్రయత్నం చేశారు. ఇది ప్రధానంగా గిరిజనులు పాడుకొనే పాటల సందర్భంలో కనిపిస్తుంది. అయినప్పటికీ అవి అన్నీ ప్రాంతాల వారికి అర్థమయ్యేటట్లుగా కుండలీకరణాల్లో రచయితలు వివరించే ప్రయత్నం చేశారు. ఇలాంటి ప్రయోగాలన్నీ ఆయాకథలకు సహజత్వాన్ని తీసుకురావడానికి ఎంతగానో దోహదపడతాయి. రచయితలు సహజత్వానికి, వాస్తవికతకు అధిక ప్రాధాన్యత ఇచ్చారు. ఆయా రచయితలు చేసిన వర్ణనలలో గిరిజనుల సహజ సౌందర్యం, ప్రకృతి సౌందర్యం చక్కగా అభివ్యక్తమయింది. రచయితల చిత్రించిన భాష, శైలి, వర్ణన, నుడికారం, సామెతలు ఈ కథలకు మరింత సొగసునిచ్చాయి.



## సింహావలోకనం

'అడవిలో వెన్నెల' కథల సంపుటిలో వాటిని రాసిన రచయితల పేర్లు పేర్కొనలేదు. అందువల్ల అవి అచ్చయిన సృజన, అరుణతార పత్రికల ద్వారా, ఆయా రచయితల ద్వారా ఎవరు రాశారో తెలుసుకొని పేర్కొన్నాను.

ఈ లఘు సిద్ధాంత వ్యాసంలో నేను మొదటి అధ్యాయంలో 'గిరిజనుల చరిత్ర – కథల సామాజిక నేపథ్యం – కథకుల పరిచయం' వివరించాను. గోండుల సంస్కృతి 'అడవిలో వెన్నెల' కథల సామాజిక నేపథ్యం, ఉద్యమాల పుట్టుక, విస్తరణ, వాటి ఆవశ్యకత పెరిగిన తీరు కథకులు వారి జీవితం పరిచయం చేయడం జరిగింది.

రెండవ అధ్యాయం 'అడవిలో వెన్నెల కథలు – వస్తుపరిశీలన' లో కథల సంక్షిప్త పరిచయం, వస్తు విశ్లేషణ ద్వారా గోండు ఆదివాసీ జీవితాలను, సంస్కృతిని, మానవ సంబంధాలను, కుటుంబ సంబంధాలను, ప్రేమలను వ్యాపారస్తుల ద్వారా, ప్రభుత్వాధికారుల ద్వారా జరిగే దోపిడీని, అణచివేతలను, అందుకు వ్యతిరేకంగా ఆదివాసీలు చేస్తున్న పోరాటాలను, ఉద్యమకారులు ఉద్యమాలు నిర్మిస్తున్న క్రమం, వారు ఎదుర్కొంటున్న నిర్బంధాలు, నిర్బంధాలు సైతం అడవుల్లో, ప్రజల్లో కలిసి తిరిగే తీరును వివరించాను.

మూడవ అధ్యాయం 'అడవిలో వెన్నెల కథలు – శైలీ, శిల్ప పరిశీలన' లో పాత్ర చిత్రణ, సన్నివేశ కల్పన, సంఘటనలు, సంభాషణలు, కథన రీతి, ఎత్తుగడ ముగింపు, కథల పేర్లు మొదలైన విశేషాలను విశ్లేషించాను. ఈ కథలను పరిశీలించినప్పుడు ప్రధానంగా ఈ కథలు రూఢీగా ఉన్న మధ్య తరగతి కథా రచనా నిర్మాణంలో గాక ఒక ప్రత్యేకమైన పద్ధతిలో రచన కొనసాగింది. దాన్ని కార్మికవర్గ సాహిత్య ప్రమాణాలుగా పేర్కొనవచ్చు.

నాల్గవ అధ్యాయం 'అడవిలో వెన్నెల కథలు – భాషా విశేషాలు' లో ఈ కథల్లోని ఉర్దూ, గోండీ, ఇంగ్లీషు, తదితర భాషా పదాలను, వాటి అర్థాలను, సామెతలను, నుడికారాలను, జాతీయాలను పేర్కొన్నాను. గోండు పదాలకు తెలుగు వ్యవహారిక ప్రయోగాలు మొదలైన అంశాలు పరిశీలించాను.

కాలక్షేప సాహిత్యం వేరు, మధ్య తరగతి సాహిత్య వేరు, ఆదివాసీల సాహిత్యం వేరు, ఉద్యమ సాహిత్యం వేరు, వాటి సాహిత్య విలువలు, సాహిత్య ప్రమాణాలు, వాటి పాఠకులు వేరువేరని తెలుసుకున్నాను. సాహిత్యం అంటే కేవలం వినోదం కాదని అది సామాజిక కర్తవ్యమని, సామాజిక పరిణామాల చిత్రణ అని, సాహిత్య ప్రయోజనం అంటే ప్రజల జీవితాల్లో, అవగాహనలో, చైతన్యంలో మార్పు తీసుకురావడం అని వారి కష్టాల్లో, సుఖాల్లో సాహిత్యం, సాహిత్య కారులు మేమున్నామంటూ రెండు వైపులా మద్దతుగా నిలవాలని, వెంట నడవాలని ఈ కథల సంపుటి పరిశీలన ద్వారా అర్థం చేసుకున్నాను. కష్ట జీవికి ఇరువైపులా నిలబడే వాడే నిజమైన రచయిత అని తెలుసుకున్నాను.

ఈ కథల అధ్యయనం ద్వారా నాకు తెలియని ఆదివాసీ గోండుల జీవితాలను, సంస్కృతిని, ఉద్యమాలను సన్నిహితంగా పరిశీలించే అవకాశం కలిగింది. నేను పుట్టి, పెరిగిన నాతోటి గిరిజనులు అడవుల్లో ఎలా బతుకుతున్నారో తెలిసింది. గిరిజనుల సాహిత్యం కోసం, దాన్ని విశ్లేషించడం కోసం ఇతోధికంగా కృషి చేయడం అవసరమని తెలిసింది. దాంతో పాటు నేను కూడా ఆదివాసీల జీవితం, సంస్కృతి గురించి కథలు, నవలలు రాయడం అవసరమనే ఆసక్తిని కలిగింప చేసింది.

అప్పటికే వున్న మధ్య తరగతి సాహిత్య సిద్ధాంతాలను ఆధారం చేసుకొని పరిశీలించాను. అదే సమయంలో కార్మికవర్గ విప్లవ సాహిత్య ప్రమాణాలను, సిద్ధాంతాలతో కూడిన తులనాత్మక అధ్యయనం చేశాను. 'అడవిలో వెన్నెల'లోని కథలను విశ్లేషించడానికి, సమన్వయించడానికి ఇప్పుడున్న సాహిత్య సిద్ధాంతాలు సరిపోవని, తెలుగు కథా సాహిత్యంలో కొత్త సూత్రాలు అవసరమవుతాయని వాటిని విప్లవ సాహిత్యం, పీడితవర్గ దళిత, బహుజన, స్త్రీవాద సాహిత్యం రూపొందిస్తూ వస్తున్నదని ఈ కథల పరిశీలన వల్ల తెలిసింది. ఈ కథలను పరిశీలించడం వలన గిరిజన సాహిత్యాన్ని, సామాజిక శాస్త్రాల, సామాజిక చరిత్ర పరిణామాల కోణంలో ఆయా శాస్త్రాల్లో భాగంగా అధ్యయనం చేయాల్సిన అవసరం ఎంతైనా వుందని, ఆదివాసీ సాహిత్యాన్ని నూతన కోణాల్లో అధ్యయనం చేయాల్సిన అవసరం వుందని నిర్ధారించడం జరిగింది.



అనుబంధం

సామాజిక తత్వవేత్త, ప్రముఖ కథా రచయిత

# "బి.ఎస్. రాములు" గారితో ఇంటర్వ్యూ

(బి.ఎస్.రాములుగారితో అనేక విషయాలను, అనేకసార్లు చర్చించడం జరిగింది. తెలుసుకోవడం జరిగింది. వాటిని ఈ సిద్ధాంత గ్రంథంలో బి.ఎస్.రాములుగారితో సంభాషణలుగా ఆయా సందర్భాల్లో పేర్కొనడం జరిగింది. ఇక్కడ ఇంటర్వ్యూలో పేర్కొన్నవి కొన్ని మాత్రమే.)

**1. నమస్కారం సార్... తెలుగు కథా సాహిత్యంలో మీ స్థానం ప్రముఖమైనది. మీరు సాహిత్యానికి చేస్తున్న కృషి ఎంతో విలువైనది. 'అడవిలో వెన్నెల' కథల సంకలనం రచయితల పేర్లు గాని, సంపాదకుల పేర్లు గాని తెలపకపోవడానికి గల కారణాలు ఏమిటి ?**

అడవిలో వెన్నెల కథల సంకలనం 1985లో వెలువడింది. కరీంనగర్ బుక్ ట్రస్ట్ పేరు మీద దీనిని ప్రింట్ చేశాము. కరీంనగర్ బుక్ ట్రస్ట్ మీద 'బ్రతుకుపోరు' 'భూమి' కథలు బొగ్గు పొరల్లో సింగరేణి కార్మికుల కథలు ప్రచురించాము. 1982లో బీడీ కార్మిక నవల బ్రతుకుపోరు 'భూమి' కథలు ఆ తర్వాత 1983లో 'బొగ్గు పొరల్లో' సింగరేణి కార్మికుల కథలు వెలువరించాము. సింగరేణి కార్మిక సమాఖ్య మహాసభల్లో బొగ్గు పొరల్ని కథల సంకలనం ఆవిష్కరించడం జరిగింది. ఆదివాసుల జీవితం, సంస్కృతి, వారి ఉద్యమాలపై కథల సంకలనం తీసుకురావాలనే ఆలోచనలతో ఈ కథల సంకలనాన్ని వేయడం జరిగింది. ఆ కథల నుండి 'అడవిలో వెన్నెల అనే కథను టైటిల్ కథగా వేశాము. పేరు లేకుండా కథలు వేయడం అనే దాని గురించి ఎంతో చర్చ జరిగింది. పేర్లు వుంచుకోవడం అనేది ఉనికి, అస్తిత్వం, గుర్తింపు కొరకే అని, ఇది ఒక మిడిల్ క్లాస్ స్వభావం అని మనం డి క్లాస్ కావాలి అని, డి క్యాస్ట్ కావాలి అని చర్చించి అలా చేశాం. అంటే ఏ వర్గం నుంచి వచ్చినా, అట్టడుగు వర్గాలకు చేరాలి, అనే దృక్పథం సీరియస్‌గా విప్లవోద్యమంలో, విద్యార్థి యువజన సంఘాల్లో విప్లవ రచయిత సంఘంలో చర్చించబడింది. ఆ నేపథ్యంలో కథకుల పేర్లు లేకుండా పుస్తకం

వేయడం జరిగింది. పేర్లు లేకుండా వేయడం కూడా ఒక త్యాగంగా భావించవచ్చు.

అయితే జానపద సాహిత్యానికి కర్త ఎవరూ లేరని అలానే కర్త లేకుండా రాస్తారు అని అంటారు. కాని ఎవరో ఒకరు పదం పాడతారు. చరణం అల్లుతారు. కాని కర్త లేకుండా వుండదు. మనిషి లేకుండా పాట వస్తుందా? తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలు ఎవరు అంటే లేరని అర్థం కాదు. ఉన్నారని అర్థం. అందుకే జానపద సాహిత్యానికి కర్తలు వుంటారు. అయితే ఒకరి తర్వాత ఒకరు మార్పులు, చేర్పులు చేస్తూ వుంటారు. జానపద సాహిత్యంలో ఎలా అయితే కర్తలు లేరో మన కథలకు కూడా జానపద సాహిత్యం లాగే మన ఉనికిని కోల్పోవాలి అనే దృక్పథంతో పేరు లేకుండా 'అడవిలో వెన్నెల' కథల సంకలనాన్ని వేయడం జరిగింది. అయితే చారిత్రకంగా అది చాలా తప్పు అని తర్వాత తెలిసింది.

బుద్ధుని బోధనలు బుద్ధుని పేరు మీదనే వున్నాయి. అలాగే ఏసుక్రీస్తు భావాలు ఏసు పేరు మీదనే వున్నాయి. వెనుకటి కాలంలో రామాయణ, భారతాలు ఏదో ఒక పేరు మీద వున్నాయి. పేరు మీద వుండడం వల్ల పేరుతో పాటు ఆనాటి సమకాలీన స్థితిగతులు అర్థమవుతాయి. అలాగే ఆ రచన కూడా అర్థమవుతుంది. రచన ఏ నేపథ్యంలో రాశాడు, ఏ నేపథ్యంలో జీవించాడు, అందులో సమాజంలో ఎంత మేరకు ప్రతిఫలించింది. జీవించిన జీవితం ఏమిటి, కథల్లో నవలల్లో రాసిన జీవితం ఏమిటి అనేది కొలవడానికి ఉపయోగపడుతుంది. కర్త తెలియని రచనలు అనామకం అయిపోవడమే కాకుండా ప్రాధాన్యతను కూడా కోల్పోతాయి. ఎవరూ పట్టించుకోరు. బుద్ధుడు చెప్పిన మాట అనగానే అలానా, అని అనుకుంటారు. మహాత్మా పూలే చెప్పిన మాట అనగానే అలానా అనుకుంటారు. అతడి మొత్తం కృషి యొక్క విలువ ఆ పదానికి, ఆ సూక్తికి, ఆ సంభాషణకు ఉపయోగపడుతుంది. తన 'కర్తృత్వం, వదిలేసిన తర్వాత దాంట్లో ఏముంటుందో తెలియదు గదా ! కర్తృత్వం అనేది తప్పనిసరి అవసరమైన విషయమే. అప్పుడు కుహనా, మధ్యతరగతి వాళ్లు తమ కర్తృత్వాన్ని వదలివేయకుండా ఇతరులకు బోధించడం వల్ల, మేము నిజమే అనుకొని ఉత్సాహంతో రచనకు కర్తృత్వం పేరు అవసరం లేదు, అని అనుకున్నాం.



**2. 'అడవిలో వెన్నెల' అనే పేరు దేనికి సూచికంగా వాడారు ?**

అడవిలో వెన్నెల అంటే అడవిలో వున్న ఆదివాసులు, ఆదివాసుల జీవితాల్లోని వెన్నెల. ఆడవి కాచిన వెన్నెల అనేది తిట్టు పదం. అడవిలో జీవించే గిరిజనుల పట్ల ప్రజలకు చిన్న చూపు ఉంది. నాగరికత ఇచ్చిన సామెతకు బదులుగా ఈ పేరు పెట్టాను. అడవిలో మనుషులు వున్నారు. ఆదివాసులు వున్నారు. అడవిలో కేవలం వెన్నెల మాత్రమే కాదు, మనుషులు కూడా వున్నారు అని సూచించడానికి ఈ పేరు. వారి జీవితాల్లో వెన్నెల కాయాలని, 'అన్నలు' వెన్నెల వెలుగుగా వచ్చారని యిలా పలు కోణాల్లో ఆలోచించి 'అడవిలో వెన్నెల' అనే పేరు పెట్టడం జరిగింది.

**3. ఇప్పటి వరకు గిరిజన జీవిత సంబంధమైన రచనలు తెలుగు సాహిత్యంలో ఏ ప్రక్రియల్లో ఎక్కువగా వచ్చాయి ?**

గిరిజన జీవితాలకు సంబంధించి ఇప్పటి వరకు సాహిత్య ప్రక్రియల్లో పాటలు ఎక్కువగా వచ్చాయి. వాళ్లు స్వయంగా రాసిన ప్రక్రియ పాట మాత్రమే. అదైనా ఉద్యమ పాటలు. అలానే జానపద సాహిత్యంలో గిరిజనులు గురించి మౌఖిక సాహిత్యం కన్పిస్తుంది.

**4. గిరిజన జీవితాల గురించి గిరిజనేతరులే రాస్తున్నారు. గిరిజనులు ఏమైనా రాశారా సార్?**

గిరిజనులు స్వయంగా రాయాలనే స్పృహ ఇప్పుడిప్పుడే పెరుగుతున్నది. ఇప్పటి దాకా గిరిజనుల గురించి చరిత్ర, సంస్కృతి, జీవన విధానాల గురించి, సామాజిక శాస్త్రాలు, కథలు, నవలలు, సాహిత్య విమర్శ రాసినదంతా మధ్య తరగతి మేథావులు, రచయితలు, కళాకారులు, చరిత్రకారులే. గిరిజనేతరులు గిరిజనుల గురించి ఇలా ఇంకా ఎన్నో రెట్లు ఎన్నో కోణాల్లో రాయడం చాలా అవసరం. మీలాంటి వాళ్లు ఎదిగి సాహిత్య సృజన చేయడం ఎంతో అవసరం. గిరిజనుల నుండి ఎంతో మంది చదువుకొని విద్యావంతులై ఉపాధ్యాయులుగా, లెక్చరర్లుగా, అధికారులుగా పని చేస్తున్నారు. వారు తమ గిరిజన సమాజం గురించి కథలు, నవలలు రాయాలి. అప్పుడే గిరిజన సాహిత్యం, గిరిజనులే సృష్టించడం వేగవంతమవుతుంది.

రచయిత అనేవాడు ఎక్కడి ప్రపంచం గూర్చి అయినా రాయాలి. మనిషిగా స్పందించాలి. చూసిన జీవితమే రాయాలి అనేది తప్పుడు అభిప్రాయం. ఎక్కడో జరిగే రష్యా, అమెరికా వంటి వాటి గురించి రాస్తున్నప్పుడు ప్రజలందరి గురించి రాసే బాధ్యత, కర్తవ్యం ప్రతి రచయిత పైనా వుంది.

**5. మీరు గిరిజన కథలు రాశారు. కథా రచయితగా తెలుగువారి జీవితాల్లోని అనేక కోణాలను అందించారు. మీ 'వేపచెట్టు' కథ విశ్వ సాహిత్యంలో నిలిచిపోతుంది సార్. అందులో అడవిలో వెన్నెల సుప్రసిద్ధం. మీరు ఇంకా ఏమైనా గిరిజన కథలు రాశారా సార్?**

నేను గిరిజనుల గూర్చి 'అడవిలో వెన్నెల' కథ రాశాను. గోండు గిరిజనులతో మాట్లాడి, తిరిగి అన్ని విషయాలు సేకరించి, 'సాధన' అనే వ్యక్తి రాసిన గిరిజన వ్యాసాలు అరుణతార, సృజనలో వస్తే చదివి, వాళ్ల సంస్కృతి తెలుసుకుని రాశాను. ఆ తర్వాత తూర్పు గోదావరి, మన్యంలో ఉద్యమాలు చేసిన గిరిజనుల గూర్చి కూడా రాశాను. 'కలిగిన వాళ్లు' 'మా బడి' 'అడవిలో వెన్నెల-2' అనే కథలు రాశాను. అలాగే 'గోగు పూలు' అనే కథ అడవిలో పనిచేసే వారి గురించి రాశాను. నేను ఈ కథలను విప్లవ కర్తవ్యంలో భాగంగా రాశాను.

నేను సాహిత్యకారుడి నుంచి సాహిత్య సామాజిక విప్లవకారునిగా మారడం వల్ల ఇంకా రాయాల్సిన కొన్ని కథలు రాయలేకపోయాను. ఆయా జీవితాలను జీవించిన వారే కథలు రాయాలి అనే తప్పుడు అభిప్రాయం రచయితల పేరిట ప్రచారం చేశారు. ఇతరులు రాయకూడదు. కేవలం ఉద్యమాలు చేసే వారు మాత్రమే రాయాలి అన్నారు. కాని గిరిజనులు కథలు రాయలేదు, నవలలు రాయలేదు, కవిత్వం రాయలేదు. ఇది ఉద్యమ నాయకత్వం యొక్క వైఫల్యమే.

**6. గిరిజన, ఆదివాసీ, దళిత మొదలైన పదాలలో ఏ పదం ఎస్టీలకు సరిపోతుందని మీరు భావిస్తున్నారు ?**

నేను గిరిజన, ఆదివాసీ అదే పదాలు మంచిది అనుకుంటున్నాను. గిరిజన అనే పదం కొండల్లో వుండే వాళ్లు అనే అర్థాన్నిస్తుంది. అయితే, తెగలు కాబట్టి ఆదివాసీ తెగలు అని అర్థం. దళిత అనే పదం వేరు. దళిత అనే



పదం వర్ణ వ్యవస్థకు, కుల వ్యవస్థకు సంబంధించినది. కుల వ్యవస్థలో హిందూ మతంలో నాలుగు వర్ణాలు అన్నారు, తర్వాత నాలుగు కులాలు అని 1) బ్రాహ్మణ, 2) క్షత్రియ, 3) వైశ్య, 4) శూద్ర. శూద్రుల తర్వాత అయిదో వర్ణమని ఐదో కులమని పంచములని అన్నారు. పంచములు అనే పదం బదులుగా 'దళితుడు' అనే పదం ప్రచారం చేయబడింది. భారత రాజ్యాంగం ప్రకారంగా దళితులంటే షెడ్యూలు కులాలు. షెడ్యూలు తెగలుగా రికార్డు చేయబడిన వాళ్ళంతా వాళ్లు ఏ మతం వున్నవారు కాదు, ప్రకృతి ఆరాధకులు అంటారు. షెడ్యూలు తెగలను హిందూ మతం అని, క్రైస్తవ మతంని ముస్లిం మతం అని లెక్కించడానికి వీలు లేదు. వాళ్ల మత పూర్వ దశకు సంబంధించినవారు. ఎప్పుడైతే పౌర సమాజం, నాగరికత ఏర్పడుతుందో, అప్పుడే గిరిజన తెగలు, తండాలు, జన పదాల నుంచి రాజ్యం ఏర్పడుతుంది. పౌర సమాజంలో హిందు మతం వుంటే అప్పుడు కుల వ్యవస్థ వస్తుంది. ఈ పౌర సమాజం ఏర్పడకముందు వున్న దశకు చెందిన మానవుల జీవితాలు, దాని వెలుపల వున్న స్వతంత్రమైన జీవితాలు గిరిజనులు, ఆదివాసులు, షెడ్యూలు తెగలు. అందువల్ల దీనికి దళిత అనే పదం వాడకూడదు. గిరిజన ఆదివాసీ అనే పదాలు సరైనవి.

**7. గిరిజనులు నాటి నుండి నేటి వరకు ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలు ఏమిటి?**

నేను 30 ఏళ్ల నుండి సమాజం గూర్చి ఆలోచిస్తున్నాను. అప్పటి నుండి ఇప్పటి వరకు సుమారుగా ఒకటే రకమైన అభిప్రాయం. పదాల తీరు వేరు, భావ వ్యక్తీకరణల తీరు వేరు. అభివృద్ధి అందిన వారికి, అందుకున్న వారికి, అందాల్సిన వారికి మధ్యన ఉండే అంతరం, వైరుధ్యం ప్రధాన సమస్య. అంటే మానవ సమాజం సైన్స్ అండ్ టెక్నాలజీ అభివృద్ధితో ముందుకు పోతుంది. అది అందుకున్న వారు ఒకరు, అందుకోదల్చు కున్నవారు కొందరున్నారు. అందుకోలేకపోతున్న వారు కొందరున్నారు. అసలు అభివృద్ధి అనే విషయం తెలియని వాళ్లు కొందరున్నారు. ఇది అభివృద్ధి అని తెలియని వాళ్లు ఆదివాసులు. ఇదీ ప్రధాన వైరుధ్యమే. అభివృద్ధి సాధికారికతయే ప్రధాన సమస్య. అందరికీ 16 సంవత్సరాల పాటు ఉన్నత విద్య, ఉచిత హాస్టల్, భోజన వసతి కల్పించి, ఆదివాసీ

బాలబాలికలందరినీ, ఉన్నత విద్యావంతులుగా చేసినప్పుడు వారు అనేక రంగాల్లోకి ఎదిగి ఆధునిక అభివృద్ధిని అందుకుంటూ తమ సమాజాన్ని మార్చుకుంటారు. ఆధునిక విద్య అందుకోకుండా ఆధునిక అభివృద్ధి అందుకోవడం సాధ్యం కాదు.

**8. గిరిజన సంస్కృతిని దళిత సంస్కృతిలో అంతర్భాగంగా చూడాలా, దళిత సంస్కృతిని గిరిజన సంస్కృతిలో అంతర్భాగంగా చూడాలా ?**

దళిత సంస్కృతి వేరు. గిరిజన సంస్కృతి వేరు. దళిత సంస్కృతి గ్రామీణ సమాజంలో లేదా పౌర సమాజంలో భాగం. సమాజం ద్వారా వీరు అస్పృశ్యతకు గురౌతున్న సంస్కృతి షెడ్యూలు కులాల సంస్కృతి. అందువల్ల ఇది పౌర సమాజానికి సంబంధించినది.

గిరిజన సంస్కృతి ప్రత్యేకమైనది. పౌర సమాజానికి దూరంగా, ప్రత్యేక భాష, సంస్కృతి, జీవన విధానం కలిగిన వారి ఆచార వ్యవహారాలు ప్రత్యేకమైనవి. వారి రక్త సంబంధాలు ప్రత్యేకమైనవి, ప్రత్యేక ప్రాంతంలో వుంటారు. కనుక వీళ్ల సంస్కృతి ప్రత్యేకమైనది. అది సామూహికమైనది. అందరినీ కలుపుకుపోయేది, విశిష్టమైనది. అక్కడి నుంచి సమాజం విడి వడి కులాల విభజన జరిగింది. గిరిజనులు కూడా అనేక కులాలుగా మారిపోయారు. అందువల్ల దళిత సంస్కృతి అనేది వర్ణ వ్యవస్థ సృష్టించిన, కుల వ్యవస్థ సృష్టించిన కుల అణిచివేతలో అంటరానితనం యొక్క సంస్కృతిలోకి వస్తుంది. అలాంటి అంటరానితనం ఏమీ లేకుండానే మానవ సమాజంలో ప్రకృతి ఆరాధకులుగా తమలో తాము తమ పరిసరాలలో భాగంగా సహజ పద్ధతిలో గిరిజన సంస్కృతి వున్నది.

ప్రతి గిరిజన తెగకు ఒక ప్రత్యేక భాష వుంటుంది. కాని దళితుల భాష పౌర సమాజానికి సంబంధించినదే. భాష వెంటే భావాలు, సంబోధన వేరు కదా! ఆ భావాలతో సంబోధించేవారు, వారి వ్యక్తీకరణ వేరు. గిరిజనులకు ప్రత్యేకమైన చరిత్ర వుంది. వాళ్ళు ఎప్పుడూ ఈ పౌర సమాజంలో భాగంగా, రాజ్యాంగంలో భాగంగా బతుకలేదు. ఈ రాజ్యాలకు అంచుల వెంట అడవులలో బతికారు. అందువల్ల ఎస్టీ, ఎస్సీల సంస్కృతి దేనికది ప్రత్యేకమైనవి, విశిష్టమైనవి.



**9. గిరిజనులలో కుల సమస్య కంటే, నిరక్షరాస్యత, అమాయకత్వం, ఆచార వ్యవహారాలలో కూరుకుపోవడం, భూమి సమస్య వంటివి ప్రధానంగా కన్పిస్తున్నాయా ?**

ఔను. వారి భూమిని అటవీ శాఖ, మైదాన ప్రాంతాల వారు ఆక్రమించుకుంటున్నారు. గిరిజనులు ఎదగడానికి ఆధునికాభివృద్ధి చాలా అవసరం. ఆధునికాభివృద్ధి ఇప్పటిలాగే అంటే రష్యా, అమెరికా లాగా ఉండాలని ఏమీ లేదు. భూమి సమస్యకు, నిరక్షరాస్యతకు మధ్య సంబంధముంది. నిరక్షరాస్యులు భూమి దున్నుకుంటారు. చదువుకున్న వారు భూమి దున్నించుకుంటారు. అందువల్ల భూమి సమస్య అనేది ప్రధానమైనది. 80 సం.ల క్రితమే అంబేద్కర్ భూమిని జాతీయం చేయాలన్నారు. ఆధునికాభివృద్ధిలో మనకు వాటా కావాలి అన్నాడు. అందువల్ల ఆధునికాభివృద్ధి అందితే భూమి సమస్య ప్రధానంగా వుండదు.

ప్రజలను భూమి దున్నుకొని బ్రతకాలి అని చెప్పడానికి పరిమితమైతే వారిని వెనకబడిన జీవితం జీవించాలని చెప్పడమే. నా అభిప్రాయం ప్రకారం ఆధునికాభివృద్ధిని అందుకోవడానికి, వారు విద్యను అందుకోవాలి. విద్యను అందించిన తర్వాత వాళ్లలో చైతన్యం వస్తుంది. దాంతో చిన్న, పెద్ద అందరూ అక్షరాస్యతను సాధిస్తారు. వాళ్ల జీవితాలకు భూమి అవసరమే. వాళ్లు ఆధునిక వ్యవసాయ పద్దతులు తెలుసుకోవడం అవసరం. స్పెషల్ ఎకనమిక్ జోన్స్ వచ్చాయి. ఆదివాసుల నుండి, ప్రజల నుండి సేకరించిన భూములు ప్రభుత్వం పేరు మీద, ఫారెస్ట్ అధికారులు, ఇతర ప్రైవేటు వ్యక్తులు సంస్థలు అనుభవిస్తున్నారు.ఆ తర్వాత ప్రభుత్వం అనుభవిస్తున్నది. ఈ భూములను, వ్యవసాయ యోగ్యమైన భూములను, ప్రభుత్వ ఆధీనంలో వున్న భూములను స్పెషల్ ఎకనామిక్స్ జోన్ పేరు నిబంధనలతో గిరిజనులకు, గిరిజన తండాలకు, తెగలకు, వందల వేల ఎకరాలు కేటాయించి రిజిష్టర్ చేయాలి.

**10. ఈ నేపథ్యంలో పరిష్కారాన్ని సూచించే దిశగా మీరు రాసిన అడవిలో వెన్నెల కథ కన్పిస్తుందా ?**

అడవిలో వెన్నెల కథా కాలం నాటికి నేను విప్లవోద్యమంలో ఉన్నాను. విప్లవోద్యమంలో ఫారెస్టు అధికారుల యొక్క దాడి, అణిచివేత, దుర్మార్గం

ఎంత స్థాయిలో వుంటుందో ఈ కథలో చిత్రించాను. ఎందుకంటే అడవి ఆదివాసులది. అడవిని నరికే హక్కు వాళ్లకు ఉండకపోవచ్చు కాని, పెంచే హక్కు వుంది కనుక అడవిని పెంచడానికి ప్రత్యేక ఆర్థిక మండలి, అడవిని ఫారెస్టు అధికారులకు బదులుగా వీళ్లకు అప్పగించాలి. దానికి బాధ్యత వహించాలి.

**11. గిరిజనుల్లో చాలా తెగలు వున్నాయి కదా ! తెలంగాణ, కోస్తాంధ్ర, రాయలసీమ ప్రాంతాలలో వున్న తెగలలో చాలా వైరుధ్యాలు వున్నాయి. ఈ క్రమంలో వీళ్ల సమస్యలను ఎలా అర్థం చేసుకోవాలి ?**

మైదాన ప్రాంతాల గిరిజనులు వేరు. కొన్ని తెగలు పట్టణ ప్రాంతాలకు సమీపంగా వుంటాయి. ఉదా.కు ఎరికలి వారు. గ్రామాలకు, పట్టణాలకు సమీపంలో వుండే ఆదివాసీలు ఆధునిక విద్య, అభివృద్ధి అందుకునే అవకాశం వుంది. కొన్ని తెగలు లోతట్టు ప్రాంతాలలో వున్న కోయ, చెంచు, గోండు మొదలైన వారు ఆధునిక విద్యాభివృద్ధిలో అన్ని అవకాశాలను అందుకోలేకపోతున్నారు. అభివృద్ధికి, ఆధునికాభివృద్ధికి, పౌర సమాజానికి దగ్గరగా ఎవరొచ్చారో, దాన్ని ఎవరైతే అందుకునే స్థాయికి వచ్చారో వాళ్లకే అభివృద్ధి అందుతుంది. మిగతా వాళ్లు ఎవరున్నారంటే, అక్కడున్న దొరలు కావచ్చు. అక్కడ వున్న రెడ్డిలు కావచ్చు. వారికి కూలీలుగా, పాలేర్లుగా, కార్యకర్తలుగా వాళ్లు ఉపయోగపడుతున్నారు. అభివృద్ధి చెందడం మన జన్మహక్కు అనే భావన వాళ్లకు రాలేదు. అగ్ర కులాల వలె మనము అభివృద్ధి చెందాలి అనే భావన వాళ్లలో కల్పించాలి. అందువల్ల అంబేద్కర్ ఏమన్నాడంటే, బానిసకు నువ్వు బానిస అనే విషయం చెప్పు, అతడు తిరుగుబాటు చేస్తాడు అని అన్నాడు.

**12. గిరిజనుల్లో కూడా అనేకమైన తెగలు వున్నాయని ఇంతకుముందే అనుకున్నాము. ఈ పరిస్థితుల్లో ఒక ప్రత్యేకమైన భాషను రూపొందించుకున్న వీరి తరతరాల సంస్కృతిని ఎప్పటి నుంచి గుర్తించాలి?**

గిరిజన సంస్కృతి అనేది సాధారణంగా, గిరిజన సాహిత్యం, జానపద సాహిత్యం అనేది ఎన్ని వేల ఏళ్ల నుండి కొనసాగుతున్నప్పటికీ అది వర్తమానం భాగంలోనే కొనసాగుతుంది. తరతరాల సంస్కృతి అనేది ఇప్పుడు



ఆచరించడం వలనే వుంటుంది. తరానికి, తరానికి ఆలోచనలో, జీవన విధానంలో, సంస్కృతిలో మార్పు వస్తుంది. సంస్కృతి నిరంతరం పరిణామం చెందుతూ ఉంటుంది.

**13. అడవిలో వెన్నెల కథల్లో శిల్పం గురించి మీ అభిప్రాయం ?**

అడవిలో వెన్నెల కథల్లో శిల్పం ప్రధానంగా రాసిన కథలు కొన్ని వున్నాయి. శిల్పం ప్రధానం అనుకోకుండా రాసిన కథలు కొన్ని వున్నాయి. అయితే ప్రధానంగా వాళ్ల సమస్యలను కథల రూపంలో రాయాలని, ప్రజలకు అందజేయాలనే ఉద్దేశ్యంతో ఈ కథలు రాశాము. కాని శిల్పాన్నే దృష్టిలో ఉంచుకొని రాయలేదు. అలా అని శిల్పం అంతగా కొరవడలేదు. ఈ కథల శైలీ, శిల్పాలు ప్రత్యేకమైనవి. అవి మధ్య తరగతి సాహిత్య, శైలీ, శిల్పాలతో, కాలక్షేపం, వినోదం, ప్రధాన లక్ష్యంగా కలిగిన సాహిత్య విలువలతో, ప్రమాణాలతో ఈ కథలను పోల్చలేం. ఉద్యమ కర్తవ్యాల్లో భాగంగా ఉద్యమ కారులకు, ఉద్యమించే ప్రజలకు మద్దతు ఇస్తూ నైతిక స్థయిర్యం, ధైర్యం, ఉత్తేజం అందించాలని వారి పోరాటాలను ఇతరులకు తెలియజేయడం అవసరమని రాయడం జరిగింది. ఆ లక్ష్యం పూర్తిగా నెరవేరింది. ఇప్పుడు ఉద్యమాల్లో పని చేస్తున్న ఉద్యమకారులే స్వయంగా కథలు, నవలలు రాస్తున్నారు.

తేది : 22-12-2007 హైదరాబాద్

# పాద సూచికలు

## మొదటి అధ్యాయం

1. అనుబంధం — బి.ఎస్. రాములు గారితో ఇంటర్వ్యూ.
2. సూర్యనారాయణ, ఎమ్. — 1983. *భారతదేశము గిరిజన సముదాయాలు.* పుట : 01
3. బాలగోపాల్, కె. — *అడవిలో వెన్నెల* కథల ముందుమాట. పుట:03
4. హస్నైన్,నదీం. — *భారతీయ గిరిజనులు.* పుట:16
5. Encyclopedia — 1829. పుట:98
6. Encyclopedia of Britanica. 11. Volume 918.
7. Cambridge Advanced Learner's Dictionery పుట 13:86
8. శివ రామకృష్ణ — *కొండ కోనల్లో.* (తెలుగు గిరిజనులు) పుట:01
9. కుమార స్వామి, జి. — *తెలుగు వైజ్ఞానిక మాస పత్రిక జనవరి. 1992.*
10. కార్వే ఐరావతి — ***Hindu Society*** పుట:18
11. సి.ఎస్.సి. చౌదరి — ***The mughal Empires*** పుట:113
12. రాజారాం, కామెర. — *జానపద విజ్ఞానం గోండుల ఆచార వ్యవహారాలు.* పుట : 17
13. మనోహర్, మేస్రం. — *గోండి సంస్కృతి.* పుట : 18
14. అడవిలో వెన్నెల కథల సంపుటి — పుట : 74
15. మనోహర్, మేస్రం. — *గోండి సంస్కృతి.* పుట : 28
16. అడవిలో వెన్నెల కథల సంపుటి — పుట : 37
17. రవి, వి. — *గిరిజనుల జీవిత రేఖా చిత్రాలు – అనుభవగాథలు.* (అముద్రితం) పుట : 25
18. కె.వి.ఆర్. — *అడవిలో వెన్నెల* పుట : 15
19. మనోహర్, మేస్రం. — *గోండి సంస్కృతి.* పుట : 03
20. సత్యనారాయణ, కంభంపాటి. — *ఆంధ్రుల సంస్కృతి – చరిత్ర 1.* పుట:33
21. విరసం ప్రచురణలు, 2010 — *ముప్పయ్యేళ్ళ దండకారణ్య సాహితీ సాంస్కృతికోద్యమ చరిత్ర* పుట:52
22. ,, ,,
23. బి.ఎస్.రాములు గారితో సంభాషణ
24. విరసం ప్రచురణలు, 2010 — *ముప్పయ్యేళ్ళ దండకారణ్య సాహితీ సాంస్కృతికోద్యమ చరిత్ర*

## రెండవ అధ్యాయం

1. సాహుని మరచామా (వ్యాసం) సూర్య పత్రిక సోమవారం, మార్చి, 31.2008
2. అడవిలో వెన్నెల కథల సంపుటి — పుట : 18
3. అడవిలో వెన్నెల ,, — పుట : 19
4. రక్త పింజెర — పుట : 30
5. రక్త పింజెర — పుట : 35
6. ఆకలి — పుట : 47
7. ఆకలి — పుట : 49
8. తుడుం — పుట : 86
9. మరట్ తుడుం పాయానా — పుట : 90
10. మరట్ తుడుం పాయానా — పుట : 94
11. రగల్ రాజ్జెం మైసివాకట్ — పుట : 107
12. శివసాగర్ — అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 1
13. కె.వి.ఆర్. — అడవిలో వెన్నెల కథలసంపుటి; పుట:13, 14

## మూడవ అధ్యాయం

1. కథలబడి – కథా సాహిత్య అలంకార శాస్త్రం; బి.ఎస్.రాములు; పుట : 13, 14
2. కథా రచన పాఠాలు, బి.ఎస్.రాములు
3. సాహు జీవితము – రచనలు – పరిశీలన; 1999 – వి.రాజేశ్వరశర్మ పుట :110
4. కథా రచన పాఠాలు, బి.ఎస్.రాములు
5. కథా రచన పాఠాలు, బి.ఎస్.రాములు
5. తుమ్మల రామకృష్ణ, బారిష్టర్ పార్వతీశం–ఒక పరిశీలన; పుట : 51

7. శీలా వీర్రాజు; కాలానికి ఇటు–అటు; పుట : 52
8. కథా రచన పాఠాలు, బి.ఎస్.రాములు
9. సాహు జీవితము – రచనలు – పరిశీలన; వి.రాజేశ్వరశర్మ పుట :113, 114
10. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 19
11. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 26
12. అడవిలో వెన్నెల కథల సంపుటి ; పుట : 41
13. సాహు జీవితము – రచనలు – పరిశీలన; వి.రాజేశ్వరశర్మ పుట:146
14. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 59
15. కథాకృతి (పరిచయాలు-పరామర్శలు), 2009 – విహారి; పేజి : 191
16. అడవిలో వెన్నెల కథల సంపుటి ; పుట : 122
17. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 28
18. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 85
19. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 97
20. కథాకృతి – విహారి; పుట : 203, 205
21. అడవిలో వెన్నెల కథల సంపుటి ; పుట : 138
22. బి.ఎస్.రాములు గారితో సంభాషణలు
23. బి.ఎస్.రాములు గారితో సంభాషణలు
24. కథా రచన పాఠాలు; బి.ఎస్.రాములు
25. కథా రచన పాఠాలు ; బి.ఎస్.రాములు
26. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 20
27. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 24
28. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 41
29. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 141
30. పోరంకి దక్షిణామూర్తి, కథానిక-స్వరూప స్వభావాలు; పుట : 407
31. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 31, 32
32. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 79
33. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 136
34. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 140
35. పోరంకి దక్షిణామూర్తి, కథానిక-స్వరూప స్వభావాలు; పుట :222
36. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 43



37. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 43
38. పోరంకి దక్షిణామూర్తి, కథానిక-స్వరూప స్వభావాలు; పుట : 407
39. బి.ఎస్.రాములు గారితో సంభాషణలు
40. కథా రచన పాఠాలు; బి.ఎస్.రాములు
41. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 35
42. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 87
43. కథలబడి – కథా సాహిత్య అలంకార శాస్త్రం; బి.ఎస్.రాములు; పుట : 146
44. పోరంకి దక్షిణామూర్తి, కథానిక-స్వరూప స్వభావాలు; పుట :364
45. కథలబడి – కథా సాహిత్య అలంకార శాస్త్రం; బి.ఎస్.రాములు; పుట : 161
46. పోరంకి దక్షిణామూర్తి, కథానిక-స్వరూప స్వభావాలు; పుట :367
47. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 30
48. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 51
49. తుమ్మల రామకృష్ణ; బారిష్టర్ పార్వతీశం–ఒక పరిశీలన; పుట : 63
50. పోరంకి దక్షిణామూర్తి, కథానిక-స్వరూప స్వభావాలు; పుట : 370
51. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 18
52. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట :124, 125
53. కథా రచన పాఠాలు, సంభాషణలు – బి.ఎస్.రాములు
54. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 40
55. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 84
56. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 88
57. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 152
58. పోరంకి దక్షిణామూర్తి, కథానిక-స్వరూప స్వభావాలు; పుట : 416
59. కథలబడి – కథా సాహిత్య అలంకార శాస్త్రం; బి.ఎస్.రాములు; పుట : 131, 132

**నాలుగవ అధ్యాయం**

1. కథా రచన పాఠాలు; బి.ఎస్.రాములు
2. తెలుగు జాతీయాలకోశం; విజయలక్ష్మి, మూలె. 1998. పుట : 01
4. తెలుగు భాషా చరిత్ర; కృష్ణమూర్తి, భద్రిరాజు. 1974; పుట 430
5. అడవిలో వెన్నెల కథల సంపుటి; పుట : 84

# ఉపయుక్త గ్రంథాలు


1. ***అడవిలో వెన్నెల*** (గిరిజన పోరాట కథలు), మార్చి1985. కరీంనగర్ బుక్ ట్రస్ట్, కరీంనగర్.
2. ఆనందరామం, సి. 1994. ***నవలా విమర్శ,*** పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాద్.
3. కృష్ణమూర్తి, భద్రిరాజు. 1974. ***తెలుగు భాషా చరిత్ర,*** పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్.
4. చిన్నారెడ్డి, జి. 1991. ***భూషణం కథలు - పరిశీలన*** (ఆముద్రితం) సిద్ధాంత వ్యాస గ్రంథం, హైదరాబాద్ విశ్వవిద్యాలయం.
5. చీనియా నాయక్, బి. 1998. ***బంజారా చరిత్ర (సంస్కృతి - ప్రగతి),*** శ్రీ హథీరాం బావాజీ పబ్లికేషన్స్, అనంతపురం.
6. దక్షిణామూర్తి, పోరంకి. 1988. ***కథానిక స్వరూప స్వభావాలు,*** నవోదయ పబ్లిషర్స్, విజయవాడ - 2.
7. నారాయణ రెడ్డి, సి. 1967. ***ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు - ప్రయోగములు,*** విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్.
8. బాలగోపాల్, కె. 1986. ***ప్రాచీన భారత దేశ చరిత్ర, డి.డి. కోశాంబి పరిచయం,*** హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్.
9. మనోహర్, మెస్రాం. 2002. ***గోండి సంస్కృతి,*** శ్రీ వెంకన్న ప్రచురణ, హైదరాబాద్.
10. రవి, వి. 2003. ***గిరిజనుల జీవిత రేఖా చిత్రాలు - అనుభవ గాథలు,*** (అముద్రితం) సిద్ధాంత వ్యాసం, హైదరాబాద్ విశ్వవిద్యాలయం, హైదరాబాద్.
11. రాజారాం, కామెర. 1993. ***జానపద విజ్ఞానం గోండుల ఆచార వ్యవహారాలు,*** (అముద్రితం) సిద్ధాంత వ్యాసం, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్.
12. రామకృష్ణ, తుమ్మల. 1993. ***బారిష్టర్ పార్వతీశం (ఒక పరిశీలన),*** చంద్రకళ పబ్లికేషన్స్, కర్నూల్.
13. రామకృష్ణ, శివ. 2007. ***కొండకోనల్లో*** (భారతీయ గిరిజనులు), శక్తి ప్రచురణ, హైదరాబాద్.
14. రాములు, బి.ఎస్. 2003. ***బహుజన తత్వం,*** విశాల సాహిత్య అకాడమీ ప్రచురణ, హైదరాబాద్.
15. రాములు, బి.ఎస్. 1998. ***కథలబడి-కథా సాహిత్య అలంకార శాస్త్రం,*** విశాల సాహిత్య అకాడమీ ప్రచురణ, హైదరాబాద్.
16. రాములు, బి.ఎస్. 2010. ***కథా రచన పాఠాలు,*** డిటిపి ప్రతి
17. రాజేశ్వర్ శర్మ, వి. 1999. ***సాహలా జీవితము-రచనలు, వరిశీలన,*** కాకతీయ యూనివర్సిటీ ఎం.ఫిల్ సిద్ధాంత గ్రంథం. రాతప్రతి.
18. విహారి 2009. ***కథాకృతి (వరిచయాలు-వరామర్శలు),*** శ్రీవేదగిరి కమ్యూనికేషన్స్ ప్రచురణ, హైదరాబాద్.
19. విజయలక్ష్మి, మూలె. 1998. ***తెలుగు జాతీయాల కోశం,*** యమ్బి యమ్మార్ పబ్లికేషన్స్, తిరుపతి.
20. వీర్రాజు, శీలా. 1999. ***కథానికానిర్మాణ శిల్పం,*** యువ భారతి, హైదరాబాద్.
21. వెంకట సుబ్బయ్య, వల్లంపాటి. 1995. ***కథాశిల్పం,*** విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్.
22. సత్యనారాయణ, కంభంపాటి. 1981. ***ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర1***, హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్.
23. హస్నైన్, నదీం. 1995. ***భారతీయ గిరిజనులు,*** ఓరియంట్ లాజ్మన్ లిమిటెడ్, హైదరాబాద్.


## ఆంగ్ల పుస్తకాలు


1. **CAMBRIDGE ADVANCED LEARNER'S DICTIONARY.** 2006. CAMBRIDGE PUBLICATION, LONDON.
2. C.V.F. HAIMANDORF. 1979. **THE GONDS OF ANDHRA PRADESH,** VIKAS PUBLISHING HOUSE, NEW DELHI.
3. THE ENCYCLOPEDIA AMERICANA. 1829. INTERNATIONAL EDITION, VOLUME : 27, NEW YORK.


## పత్రికలు


1. సృజన మాసపత్రిక సంచికలు
2. అరుణతార మాసపత్రిక సంచికలు
3. తెలుగు వైజ్ఞానిక మాస పత్రిక. జనవరి 1992. తెలుగు అకాడమి, హైదరాబాద్.
4. మూసీ సాహిత్య సాంస్కృతిక చారిత్రక మాస పత్రిక. డిసెంబర్ 2000. త్రైవార్షిక ప్రత్యేక సంచిక, తెలుగు సంస్కృతి.
5. సాహును మరిచామా ? (వ్యాసం). 31 మార్చి 2008. ఇమ్మడి సంపత్ కుమార్. సూర్య దినపత్రిక, హైదరాబాద్.
6. మూసి మాసపత్రిక సంచికలు
7. నేటినిజం దినపత్రిక, హైదరాబాద్ - బి.ఎస్.రాములు కథా రచన వ్యాసాలు
8. ఆంధ్రభూమి దినపత్రిక, సికింద్రాబాద్ - బి.ఎస్.రాములు కథా రచన వ్యాసాలు
9. ఆకాశిక్ పక్షపత్రిక, సికింద్రాబాద్ - కథా రచన బి.ఎస్.రాములు వ్యాసాలు